# శ్రీ శేషాద్రిస్వామి జీవితము



రచన :

"విశాఖ"










ప్రకాశకులు :

…థ మండలి, తెనాలి.



[వెల : రు. 5—00

# శ్రీ శేషాద్రిస్వామి జీవితము



★

రచన :

" విశాఖ "



ప్రకాశకులు :

సాధన గ్రంథమండలి, తెనాలి.



[వెల : రు. 5-00

# పరిచయం

బ్రహ్మశ్రీ కులుమణి నారాయణశాస్త్రిగారు తమిళ భాషలో వ్రాసిన శ్రీ శేషాద్రిస్వామివారి జీవిత చరిత్రకు ఇది భావానువాదం. కొన్నిచోట్ల విషయం విపులీకృతంకాక సంక్షిప్తం చేయబడింది.

అరుణాచల జనులకు రమణ మహర్షి రవి ఐనచో, శేషాద్రిస్వాములు శశివంటివారు. శ్రీ కావ్యకంఠ గణపతి మునులు భగవానుల ఉపదేశాలను ఛందోబద్ధం చేశారు. అంతేకాదు. వారు స్వయంగా అనేక సిద్ధులను పొందిన మహనీయులు. తెనుగులో రమణలీల లున్నవి; కావ్యకంఠుల చరిత్రకూడ ఉన్నది. కాని నాకు తెలిసి శ్రీ శేషాద్రిస్వామి చరిత తెనుగులో లేదు.

శేషాద్రిస్వామివారి జీవితచరిత్ర అనువదిస్తున్నానని ఒకపుడు కామకోటిస్వాములవారి చెవినివేయగా వారు ఇలా అన్నారు.

"రామకృష్ణ పరమహంస, వివేకానందులు రాగభక్తితో భగవదారాధన చేసినవారు. రమణమహర్షులు చిన్నతనంలోనే అద్వైతానుభూతి నొంది ఒక విశిష్టమార్గము త్రొక్కినవారు. అరవిందుల విధానం వేరు. సదాశివబ్రహ్మేంద్రులు, శేషాద్రిస్వామి మొదట వైదికంగావుంటూ తర్వాత

దానిని అతిక్రమించి అవధూతలైనవారు. వైదికనిష్ఠలో ఉండి ఆత్రోవను వదలవలెనంటే కష్టం. వైదికమార్గం అనుసరించే వారికి అదేమార్గం అని తోస్తూ వుంటుంది. ఒకొక్కరిది ఒకొక త్రోవ. అనువాదరూపంగా శేషాద్రిస్వామివారి కైంకర్యం చేయతగినదే."

రమణవాణికి పరిచితులైన ఆంధ్రులకు శేషాద్రిస్వామి క్రొత్త కాదు. జీవిత విశేషాలతో వారిచరిత్ర తెనుగువారికి అందించాలనే ఉత్సాహమే ఈ ప్రయత్నం.

ఇతిశం

—విశాఖ.

---

"శ్రీ శేషాద్రిస్వామిచరిత్ర ద్రావిడభాషలో బ్రహ్మశ్రీ కులుమణి నారాయణశాస్త్రిగారు వ్రాసిరి. ఈ పుస్తకము శ్రీ శేషాద్రిస్వామి అధిష్ఠానసభ - తిరువణ్ణామలై ప్రకటించినది. శ్రీ కుళందై ఆనందస్వామి జీవితచరిత్రలోని అంశములు ఈ అధిష్ఠానమువారు అపుడపుడు ప్రచురించిన తమిళ్ ఆరాధన సంచికలనుండి ఉద్ధృతములు. వీనిని ఆంధ్రదేశములోని భక్త జనుల ఉపయోగార్థము ఆంధ్రీకరణకు, ప్రచురణకు అంగీకరించి ఎన్నోవిధముల సహకరించిన శ్రీ శేషాద్రిస్వామి అధిష్ఠాన సభవారి సౌజన్యమునకు నా కృతజ్ఞత."

— విశాఖ.

శ్రీ భాగవతుల కుటుంబరావుగారు M.A.
చిలకలపూడి – కృష్ణాజిల్లా.

# సుమాంజలి

"శ్రీ శేషాద్రిస్వామి" – ఇది ఒక గ్రంథము. తమిళ దేశములోపుట్టి తమిళ దేశములోనే సిద్ధిపొందిన "శ్రీ శేషాద్రి స్వామి" అనే ఒక సన్యాసి జీవితం ఇందులో ఉంది. ఎందుకీ జీవితచరిత్ర మనకు? ఇది రాజకీయనాయకుని చరిత్ర కాదే! సినీతార చరిత్ర అయినాకాదు. లోకానికి దీనివలన ప్రయోజన మేమిటి? అనుకున్నాను. ఆమూలాగ్రం చదివాను. వివేకవంతులు, అనాత్మవంచకులు, దేశహితైషులు అయిన వారికి ఈ గ్రంథపఠనంవలన ప్రయోజనం ఉంటుంది అనుకున్నాను. మన శాస్త్రములలో చెప్పిన స్థితప్రజ్ఞలక్షణాలు – బ్రాహ్మీస్థితి – తపస్సంపన్నుల నిగ్రహానుగ్రహశక్తి, దూరదర్శన దూరశ్రవణ శక్తులు ఉన్మత్తప్రలాపాలు కావు. లోకాన్ని వంచించటానికి వ్రాసిన నిరాధారమైన వ్రాతలు కావు అనుకున్నాను. ఎందుకంటే, శ్రీ శేషాద్రిస్వామి కల్పిత వ్యక్తి కాదు. చరిత్రకందని కాలమునాటివారు కారు. 1870 సంవత్సరములో పుట్టారు. 20 వ శతాబ్దములో సిద్ధిపొందారు. వారి అనుగ్రహాన్ని పొందినవారుకూడ ఈ కాలపు వ్యక్తులే. జరిగిన సంఘటనలు కథలుకావు. ఈ జీవిత చరితలో విషయాలు శాస్త్రవాక్యాలకు సరిపోతున్నై. అందువలన నిజమైన ఆధ్యాత్మిక చింతనగల ముముక్షువులకు ఈగ్రంథము అమూల్యమైనది అనటములో అతిశయోక్తి లేదు అనిపించింది.

శ్రీ శేషాద్రిస్వామి బాల్యములోనే వేదమును, శాస్త్రములను సాధించారు. 'ప్రపేదిరే ప్రాక్తన జన్మవిద్యాః' అన్న వాక్యముబుజువైనది. జ్ఞానసిద్ధి కలిగేవరకు, జపాద్యనుష్ఠానము చేశారు. చనిపోయిన తల్లికి కర్మచేశారు. జ్ఞానియైనారు. తరువాత "రమతే బాలోన్మత్తవదేవ" అనేసూక్తి శ్రీ శేషాద్రిస్వామి విషయమున అక్షరాలా నిజమైనది. శ్రీ శుకమహర్షిని చూచిన స్త్రీలు సిగ్గుపడకుండుట భాగవతకథా విషయము. శ్రీ శేషాద్రిస్వామి స్పృశించినా స్త్రీలు మనో వికారాన్ని పొందకపోవటం 19-20 శతాబ్దములలోనివిషయము. శక్తిపాత దీక్ష అనేది ఉంటుందని సూతసంహితాదులలో చదివాము. శ్రీ స్వామి చరిత్రలో ప్రత్యక్షతారాకాణము కనుపడినది. ఈనాడుకూడా సామాన్యసిద్ధులు కలవారే దూరశ్రవణ దూరదర్శన శక్తులను ప్రదర్శిస్తున్నారు. శ్రీ స్వామి విషయములో సందేహముండటానికి వీలులేదు.

అయినా ఇంకొక సందేహము నన్ను బాధించింది. శ్రీ శేషాద్రిస్వామి తపస్సంపన్నులు కావచ్చు. అందువలన లోకానికేమి ఒరిగింది? ఆయనవలన సమాజానికి ఏమి మేలు కలిగింది? వారికివారు జ్ఞానసిద్ధినిపొందితే, మనకేమి కలిగింది? నిజమే. శ్రీ స్వామివారి అనుగ్రహానికిపాత్రులై, అభివృద్ధిలోనికి వచ్చినవారు అనేకులున్నారు. ఆత్మశాంతిని పొందినవారెందరో ఉన్నారు. ఇంగ్లీషు చదువుకొని ఉద్యోగాలు చేసినవారుకూడా అందులోఉన్నారండీ! మహిమలలోమొదట

విశ్వాసము లేనివారుకూడ ఉన్నారు. అన్నిటికి శిరోమకుట మైన విషయంఇంకొకటి. వర్షములు లేక మలమల మాడిపోయే రోజులలో ఒకభక్తుడు ప్రార్థిస్తే, శ్రీస్వామి అనుగ్రహిస్తే వర్షం వచ్చింది. ఏ సైన్యానికి క్షణకాలంలో ఒకపైసా ఖర్చు లేకుండా వర్షాన్ని తెచ్చే శక్తి ఉన్నది? ఇది దేశానికి క్షేమమూ కాదా? ఇంతకుముందున్న శ్రీ శృంగేరీ శంకరాచార్యులవారి చరిత్రలో ఇటువంటి సన్నివేశాలు కనుపడినై. వారు శృంగేరీ లో వరదలను నిలుపుచేశారు. శ్రీరాజేంద్రప్రసాదు శృంగేరిని సందర్శించినపుడు విపరీతంగా కురిసే వర్షాలను ఆపివేశారు. అందుకనే మన శాస్త్రాలు చెప్పినై - దేశక్షేమానికి కేవలం భౌతికశక్తిచాలదు, ఆధ్యాత్మిక శక్తికూడా కావాలి అని.

పరాతి సంధానమును మాత్రమే అధ్యయనం చేసి, అభ్యాసంచేసే, రాజకీయ నాయకులొకరే చాలరు. శ్రీశేషాద్రి స్వామి, శ్రీరమణ, శ్రీ శృంగేరీ విద్యాశంకరభారతి, శ్రీకంచి చంద్రశేఖరేన్ద్ర సరస్వతి స్వాములనుపోలిన మహాసీయులు, కూడా దేశానికికావాలి. రాజకీయనాయకులుకాదు. రాజర్షులు కావాలి. ఈ విషయం శ్రీశేషాద్రిస్వామి చరిత్ర మనకు బోధి స్తుంది.

జీవన్ముక్తి ఉన్నదా లేదా? స్థితప్రజ్ఞస్య కా భాషా? జీవన్ముక్తులు ఎట్లా ఉంటారు? ఈ సందేహము నివారణ అవుతుంది ఈగ్రంథం చదివితే. ఒకవైపు, శ్రీరమణమహర్షి,

ఒక వైపున శ్రీ శేషాద్రిస్వామి. ఇద్దరు జీవన్ముక్తులే. కాని విభిన్నరీతులలో కనుపడినారు. ఆనాటి వారి శిష్యులు భక్తులు ఎంత ధన్యులో !

ఇక శ్రీ శేషాద్రిస్వామి బోధలు ఇందులో ఉన్నై. ఉపవాసము - నిరాహారము అంటే ఏమిటి ? - ఇంకా ఎన్నో విషయాలున్నై. మనకు అవి అనుసంధేయాలు. మన అందఱి జీవితములలో వచ్చేసమస్యలకు పరిష్కారాలు, సందేహాలకు సమాధానాలు మార్గదర్శకసూత్రాలు ఇందులోఉన్నై.

"యద్యద్విభూతి మత్సత్వం శ్రీమదూర్జిత మేవ వా తత్తదేవావ గచ్ఛత్వం మమ తేజోంశ సంభవమ్". శ్రీశేషాద్రిస్వామి భగవదంశగా జన్మించారు. "జ్ఞానీత్వాత్మైవ మేమతం" "మమాత్మా సర్వభూతాత్మా". అనేవాక్యాలవలన ఆయన జ్ఞానియై భగవంతుడే అయినారు. శ్రీ శేషాద్రిస్వామివారి చరిత్ర భగవచ్చరిత్ర. శ్రీస్వామివారు తానే, తనభక్తులకు సర్వదేవతా రూపమున కనపడినారు. అన్యదేవతా భక్తులును నాభక్తులే అని భగవంతుడే అనగలడు. శ్రీశేషాద్రిస్వామి గుణకీర్తనము భగవద్గుణ కీర్తనమగును.

శ్రీ శేషాద్రిస్వామి దయాసింధువు. అందువలననే, అదృశ్యముగ భక్తులయందావేశించి నేటికిని హితబోధ చేయుచున్నారు. ఇది వీరిలోని విశేషము.

శ్రీ విశాఖగారు శ్రీ సాధన గ్రంథ మండలి ప్రచురణములవలన ఆంధ్రలోకమునకు చిరపరిచితులు. నిరంతరము, భగవద్భక్తి భావనాభరితులు. భగవద్విరవస్యారసజ్ఞులు. శ్రీ కంచికామకోటి పీఠాధిపానుగ్రహపాత్రులు. కవులు, రచయితలు, సహృదయులు. స్నేహపాత్రులు, శిష్టులు విశేషజ్ఞులు. వీరి యీ అనువాద రచనము ఆంధ్రలోకోపకారము. ఆంధ్రలోకము వీరికి కృతజ్ఞము.

శ్రీ సాధన గ్రంథమండలివారి విషయము వ్రాయనక్కఱలేదు. ఆధ్యాత్మికలోకమునకు వారుచేసిన సేవ నిరూపమము. వారి సంకల్పము మోఘము. వారికి భగవంతుడు వలసిన సంపదను సమకూర్చునుగాక అనిప్రార్థింతము.

"ఎందఱో మహానుభావులు."

"శాన్తా మహాన్తో నివసన్తి సన్తః
వసన్తవల్లోకహితం చరన్తః"
శివమస్తు.

—భాగవతుల కుటుంబరావు



# SRI SESHADRI SWAMIGAL OF TIRUVANNAMALAI
AND
# THE SPIRIT - MEDIUM.

"Lives of Great Men, do remind us
That we can make our life sublime,
And, departing, leave behind us,
Footprints in the sands of time" - A Psalm of Life
H.W. Long fellow

This golden saying is true for all times and climes in the world. India is the HolyLand of Vedas and Saints. Our Scriptures say that the individual soul in the man is the same as the Supreme Soul itself (Sublime) and that the purpose in life is to realise this sublime identity with the Supreme Soul. The Upanishad says about the Soul "I am non-dual, the residue of everything, Blissful, actionless, beyond all proof". To know this is self realisation. The path towards this end lies along the Vedicindicatcd branches of Karma (action), Bhakthi (devotion) and Jnana (knowledge). No doubt one may understand all this in theory by a careful study of the texts with the help of a sound teacher. But to bring it into action and daily life, to experience that great oneness with that Supreme Soul, to forget this body and all its actions even while one is living in this body, to

treat the entire seen-world as perishable and non-existent in the real sense, to tune the mind to withdraw it from the senses and to keep it in constant touch with the Supreme Soul - - these are easy steps to speak but difficult to be put into action. Every human being is Expected to follow the above path to self realisation. But very few succeed. It is this few that constitute the Jnani, Saint or Jivanmuktha in this world. It is said that for every one crore of human beings in India, one is born as Jivanmuktha. But they do not swarm the citadels and towns ; they resort to the forest or solitude for penance. By chance and for our benefit, some of these great men lived in towns in the midst of worldly men and yet lived a life above the same; though moving with the public yet they were not in any way affected by that contact. They kept their mind above all this worldly life. They served as object lessons for other thinking people to adopt, for they actually followed the path indicated in our Scriptures.

Each saint has chalked out a different though definite line to reach the goal of realisation. We have therefore many courses of Study open for our choice in all these Saints. It is up to us to choose the line suitable to our mind and experience in life. It is therefore very

essential that we should read the lives of all Saints in this vast country, who were practical laboratories in this school of Self-Realisation. Various have been the ways of these Saints. Some adopted the yoga marga and the Kundalini vidya; Some took to the simple-looking yet absolutely-sincere Bhakti cult; Some experienced the pure Jnanamarga, adumberated in the Upanishads. The Bhagavad Gita indicates the Jnani as the Sthita Pragjna (Ch. II) and describes his life and behaviour.

To this class of Sthita Pragjnas belong the great Saint of Tiruvannamalai, Sri Seshadri Swamigal, who after a life of 40 years in that town cast off his mortal coils on 4-1-1929. His body is interned at Tiruvannamalai. Regular worship is being done at the Samadhi in the vedic style.

Born of a very great orthodox family, noted for vedic study and astrology, at Conjeevaram, the boy Seshadri exhibited the divinity in him even when he was two years of age; when his mother took him to the temple he wanted a bronze toy Krishna which was for sale for 12 nP each. The vendor gave one free to the boy and to surprise of the pedlar, his 1000 toys were sold out that day. He came and accosted the

child the next day (as "Tangak kai") as boywith the Golden Touch". The child lost his father in his 14th year and it fell to the lot of his Mother, Maragathambal to bring up boy Seshadri and his younger brother Narasimhan. Sri Kamakoti Sastrigal, the maternal grand father of the boy recognised the great futurity in the boy, Seshadri, and put him to study the sastras under his friends. It was more a revision for the boy, who was a born-Jnani. He became an expert very soon in all the sastras. He used to go to the temple or the cremation ground and do Japam incessantly and never cared to remain at home or with his relatives. This caused an anxiety to the mother who wanted to turn his mind to the famiiy. A proposal for marriage was rightly rejected by Boy-Seshadri. The boy shunned life more and more. In his movements we find the characteristics of a developing Jnani. We could study how he discarded all attachment to things in life one by one as stated in the Gita and other holy texts. Every one of us should not skip over this part of the life-history but should tarry a while and try to understand it and bring it into our own life, wherever possible. They are the practical classes in Vedanta.

Boy Seshadri was a puzzle to all his relatives. Looked up in a room he would not be seen even though the lock is there; for days

he would not eat any food; he never cared for the body or its comforts, whether it is washed well or well dressed or protected against Sun, Rain or Storm, whether it is lying on a stone or a soft bed. He would dis-card the inviting man but would enter an uninvited house. This increased in later years.

Maragathambal, the mother, was in her last days and she called the boy and gave him as it were her last advice; She repeated the sloka of Bhaja Govindam " Sat Sangatve Nis Sangatvam " etc and called out " Arunachala " thrice and closed her eyes forever. This was the Upadesam for Boy Seshadri and he at once reached Tiruvannamalai of Arunachala - Fame and remained there for all the rest of his life, 40 years till 1929.

At Tiruvannamalai he would go to the temple of Devi or Lord Subrahmanya and used to be always moving inside the town. Mystic were his ways and very mysterious his words and their results. The history of the Saint at this stage is very intersting and instructive to the aspirant in Jnana Marga. The very sight of these saints will be a step in aid for our spritual growth.

These great saints never cared for the body they lived in, either during their life on

earth or have any desire to contact life after the body is gone. But the grace of Sri Seshadri Swamigal is peculiar. His body was interned at Tiruvannamalai but his spirit could not be restrained like that. He has reappeared in another form as a spirit with the same method of contact and teaching as he had at Tiruvannamalai before 1929. He found a medium in Mr. Sivarama Krishna Iyer who belonged to a village, Veerappanchatram, two miles from Erode Railway Station. Sivaramakrishna Iyr's mother was Smt. Kaveri Ammal, a saintly lady who lived with her husband (a Government employee in the Revenue Department at Erode) and had four sons and two doughters. The last son is this Sivaramakrishna iyer. Even from very early years this lady Kaveri Ammal exhibited signs of saintly life. She did not take rice and othr food for nearly forty years but lived on fruits, milk or sandal-paste-water. She was an ardent Muruga Baktai and used to perform pooja daily between 4 and 6 A.m. in her house to which only few of the relatives were admitted. She had developed powers like Sri Ayyaval of Tiruvasanallur; she once made the Cauvery water follow from the top of her pooja room and give her a bath when she could not go to the river which runs about one mile from her village. Many more are the mystic deeds of this

saintly lady, which remained unknown to the outside world throughout her life. once she went to Tiruvannamalai to attend a function in her relative's house and stayed in a chatram and was doing pooja early in the morning,,when suddenly Sri Seshadri Swamigal appeared in her pooja room and asked for food- She gave him the plaintain fruit kept for her pooja. Sri Swamigal ate half of it and thrust the other half in the mouth of Sivaramakrishan, (a young boy of seven years) who was just running into the house. This happened to be, possibly, a Diksha and later on this Sivaramakrishnan became the Medium.

More than twenty years thereafter, at the request of this saintly lady during her prayers, Sri Swamigal told her in a dream that he would appear in the sprit form through the medium of Sivaramakrishnan. And he did come and those who had seen the saint in the life-time were able to recognise the same old speach and thoughts in this spirit form also. At first the Medium Mr. Sivaramakrishnan would touch the plan-chette, made of thin wood with two hings at the back-bottom and a hole in the front portion to hold a pencil (avrilable in many places in the market) and the pencil will be inserted in the hyle. A paper placed under the

plachette would record the movements of the planchette, which is guided by the shirit, what is found written on the paper will be read as the spirit's message. Later on, no paper was used but the medium would feel in his mind what he should write and he would spell it out orally. Still later, it developed into a trance when the medium will not know what he says but the audience will have a long instructive and authoritative lecture for two or three hours, the medium speaking all the while as an ordinary himself not knowing. it. After the trance is over the medium would ask those present as to what happened during the trance. Books and pamphlets were written with the aid of the planchette through which the Saint Seshadri Swamigal spoke. A monthly Tamil Journal by name, "Jeevya Pradarsini" and later "Moksha Pradarsini" was run for some years with articles of the Saint given through the planchette.

The bhakthas of this Saint organised themselves into an association and had it registered under the Societies Registration Act and named it as Sri Seshadri Swamigal Adhishtanam Association, Unjalur. At Unjalur, 20 miles from Erode there is a yoga-samadi for this saint built by the members of this association. Here pooja according to the vedic injunctions is being carried on every day under the control of this

to get from the old medium, Sivaramakrishna Iyer, both through the planchette and in trance.

The history of this great Saint Sri Seshadri Swamigal would have been lost to the world but for the kindness and erudition of a great Sanskrit Scholar, Kuziumani Narayana Sastrigal, who lived with the Saint and observed him at close quarters and has written the life history in Tamil. Being a vedanti and a scholar, the writer has put the whole thing in the best manner possible for assimilation by the reader. This association holds the copyright for this book. It is the desire of some of the sishyas that the botk should be translated into Telugu for those who do not know Tamil and hence permission sought for has been granted for translation and publication of one edition to Sri. Bulusu Suryaprakasa Sastry, Founder Member Sadhana Grandha Mandali, Tenali, Guntur District. May those that read the book got the benefit of knowing the Saint through the book. If they are interested they can meet the Swamigal through the medium mentiond above. The association is having its office at Sri Sesha Nilayam, Sixth Street, Tatabad, Coimbatore-12. Correspondence can be had with the Secretary of the association at that address. Lectures of the Saint are being held with the medium of Sri Seshadri, son of the late Sivaramakrishna

Iyer, both at Coimbatore and Madurai on certain dates. Some lectures are also being delivered at Madras where the medium is employed in business. Information on these can be had from Secretary of the association.

---

## * తిరువణ్ణామలైలోని శ్రీశేషాద్రిస్వామివారు
## మరియు
## జీవుడు - ఉపాధి (అనుసంధాన కర్తలు)

మనము మన జీవితమును మహోన్నతముగఁ జేసికొనఁగలము;
మరణసమయమున కాలమనెడు ఇసుకయందు,
మన పాదముద్రలను మన వెనుక వదలగలము
అని మహాపురుషుల జీవితములు మనకు జ్ఞాపకముచేయుచున్నవి

A Psalm of Life
H. W. Long Fellow

ఈసువర్ణసూక్తి ప్రపంచమునందలి సర్వదేశకాలములకును వర్తించును. భారతదేశము వేదములకును మహర్షులకును నిలయమైన పవిత్రదేశము. మానవునిలోని జీవాత్మ పరమాత్మయేయనియు, దివ్యమైన ఈజీవాత్మ పరమాత్మల యైక్యమును సాధించుటయే మన జీవితమునకు లక్ష్యమనియు, మన మతగ్రంథములు తెలియజేయుచున్నవి. "నేను అద్వయము, సర్వావశేషము, ఆనందఘనము, నిష్క్రియము, సర్వప్రమాణాతీతము"

---

* "**Sri Seshadri Swamigal**" **of Tiruvannamalai**
**and**
**The Spirit - Medium** కి తెలుగు అనువాదము

పనిషత్తు జీవాత్మనుగుఱించి తెలియజేయు చున్నది.
మే ఆత్మసాక్షాత్కారము. దీనిని పొందుటకు, కర్మ,
జ్ఞానము అని మూడుమార్గములు కలవు. సమర్థుడైన
నొద్ద గ్రంథములను శ్రద్ధగ చదివినచో దీనినంతను
రూపముగ తెలిసికొనగల మనుటలో సంశయము లేదు.
నిని నిత్యజీవితములో క్రియారూపమున సమన్వయిం
పరమాత్మతో మహనీయమైన ఐక్యమును అనుభవము
తెచ్చుకొనుట. బ్రతికియుండగనే శరీరమును దానిక్రియ
న్నిటిని మఱచుట, పరమార్థదృష్టియందు, ఈదృశ్య
మునంతను నశ్వరముగను అసత్తుగను భావించుట,
ను విషయములనుండి ఉపసంహరించి, నిత్యము పరమా
నుసంధానముతో నుండునట్లు చేయుట-ఇవి అన్నియు
లతో చెప్పుటకు సులభమైన సోపానములే. కాని వీనిని
రూపమున అనుభవములోనికి తెచ్చుకొనుట కష్టము.
సాక్షాత్కారమునకు ప్రతిమానవుడును పై మార్గము నను
వలయునని అనుకొందము. కాని, అట్లనుసరించినవారిలో
దఱో సంసిద్ధిని పొందుదురు. సిద్ధిపొందిన ఆకొందఱినే
లు, సిద్ధులు, జీవన్ముక్తులు నని యందుము. భారతదేశ
ప్రతికోటిమానవులలో ఒకడు జీవన్ముక్తుడుగ పుట్టునని
రు. కాని ఆజీవన్ముక్తులు కోటలలోను పట్టణములలోను
లు గుంపులుగ మూగరు. తపస్సు చేసుకొనుటకై అడవు
నో, ఏకాంతప్రదేశమునకో చేరుదురు. ఆమహాపురుషు
కొందఱు మాత్రము మనకు మేలు చేయుటకు, యా

దృచ్ఛికముగ, పట్టణములలో నివసించినారు. అయినను మన కతీతమైన జీవితమును గడపినారు. ప్రజాసామాన్యముతో కలిసి మెలసి తిరిగినను ఆ ప్రజాసంపర్కమువలన వా రేమాత్రమును వికారమును పొందలేదు. వారు వారిమనస్సును సర్వప్రపంచ మునకును అతీతముగ నుంచిరి. మన వేద శాస్త్రములలో సూచితమైన మార్గమును వారు వాస్తవముగ అనుసరించిరి. ఆలోచన చేయగల మానవులకు అనుసరణీయములగు ఉదాహరణములైరి.

ఆత్మసాక్షాత్కారమను లక్ష్యమును చేరుటకు సిద్ధులు విభిన్నములు విస్పష్టములునైన మార్గముల ననుసరించిరి. అందువలన జీవన్ముక్తుల జీవితములలో మన మెన్నిక చేసుకొనుటకు వీలుగా, విభిన్నమార్గములు మనకు గోచరించును. మన మనసునకును, అనుభవమునకును తగినట్లు ఎన్నికచేసుకొనుటయే మనము చేయవలసిన పని. అందువలన ఈవిశాలదేశములో నున్న ఆత్మసాక్షాత్కార విద్యాలయములలోని ప్రయోగశాల లనెడు మహర్షుల జీవితములన్నిటిని చదువుట మనకు అత్యంతావశ్యకము. వీరిమార్గము లనేకములు. కొందఱు యోగమార్గమున కుండలినీ విద్యను సాధించిరి. ఇతరులు సులభముగ కనపడు కేవలనిష్కామభక్తి మార్గము ననుసరించిరి. అన్యులు ఉపనిషత్ప్రతిపాదితమైన శుద్ధజ్ఞానమార్గము నవలంబించిరి. శ్రీమద్భగవద్గీత (రెండవ అధ్యాయమునందు) జ్ఞానిని, స్థితప్రజ్ఞునిగ సూచించి అతని జీవితమును ప్రవర్తనను వర్ణించినది.

ో నివసించిన, సిద్ధపురుషులైన శ్రీశేషాద్రి
ప్రజ్ఞులకోవకు చెందినవారే. వారు నలుబది
పట్టణమున గడిపి 4-1-1929 నాడు తమ
ుడిచినారు. వారి శరీరము తిరువణ్ణామలైలో
పది. ఆ సమాధియొద్ద ప్రతిదినము వేదోక్త
ంచి పూజలు జరుగుచున్నవి.

ై, కంచిలో, వేదాధ్యయనమునకు జ్యోతిష
సిద్ధి చెందిన శిష్టాచార సంపన్నమైన ఒకకుటుం
. రెండు సంవత్సరముల వయసులోనే తమ
దర్శించినారు. శ్రీశేషాద్రియొక్క తల్లి, ఒక
ఒక దేవాలయమునకు తీసికొని వెళ్ళినది.
కంచు కృష్ణవిగ్రహముల నమ్ముచున్నాడు.
విలువ 12 పైసలు. శ్రీశేషాద్రి ఒక విగ్ర
ునాడు. ఆ వర్తకుడు శ్రీశేషాద్రికి ఒక విగ్ర
ముగ నిచ్చినాడు. ఆ నాడా వర్తకునియొద్ద
లు అమ్ముడుపోయినవి. అతడాశ్చర్య పడి
డాతడు శ్రీశేషాద్రియొద్దకు వచ్చి "సిద్ధి
అని అతని నభినందించినాడు. శ్రీశేషాద్రికి 14వ
గము కలిగినది. ఆయన తల్లియైన మరకతాం
ు, ఆయన సోదరుడైన నరసింహులుని పెంచినది.
ాస్త్రిగారు, శ్రీశేషాద్రికి మాతామహులు.
ద్రికి గొప్ప భవిష్యత్తు కలదని గుర్తించిరి.

శ్రీ శేషాద్రిని తన స్నేహితునియొద్ద శాస్త్రములను చదువుట కుంచిరి. శ్రీ శేషాద్రి పుట్టుజ్ఞాని. అందువలన ఆయన చదువం తయు పునఃపఠనము మాత్రమేమైనది. అచిరకాలములోనే ఆయన సర్వశాస్త్రపారంగతులైనారు. ఆయన దేవాలయము నకుగాని శ్మశానమునకుగాని వెళ్ళి నిరంతరము జపము చేసెడి వారు. తమ ఇంటగాని, బంధువులతోగాని ఉండెడివారుకాదు. ఆయన మనస్సును సంసారమునై పునఃత్రిప్పవలయునని ఎంచిన ఆయన తల్లికి, యీప్రవృత్తి మనశ్చింతను కలిగించినది. ఆయన తన వివాహ ప్రస్తావనను తిరస్కరించినారు. అది ఉచి తమే. సంసార విషయములను శ్రీ శేషాద్రి అంతకంతకు విస ర్జించినాడు. ఆయన చర్యలలో వర్ధమాన జ్ఞాని లక్షణములు కనపడెడివి. భగవద్గీతలోను ఇతర మతగ్రంథములలోను తెలిపి నట్లు ప్రపంచవిషయములను ఒకటొకటిగా వదలివేసినారు. వారి జీవిత చరిత్రలోని యీభాగమును మనలో నెవరును నిర్లక్ష్యము చేయగూడదు. అచటనాగి, ఆభాగమునర్థముచేసి కొని, సాధ్యమైనంత వఱకు, అందలి విషయములను. మన జీవితములలో సమన్వయ పఱచుటకు యత్నింపవలెను.

బాలుడైన శ్రీ శేషాద్రి బంధువుల కందఱకు ఒక సమస్య యైనాడు. ఒక గదిలో ఆయన నుంచి గదికి తాళము వేసినారు. తాళము తాళముగనే యున్నది. ఆయన గదిలో లేడు. కొన్ని దినములు ఆహారమునే తీసికొనడు. శరీరము, శరీరసౌకర్యము లపై శ్రద్ధయేలేదు. ఒడలు మురికిపోవునట్లు స్నానముచేయ

వలయుననిగాని, మంచి వస్త్రములను ధరింపవలయునిగాని, శరీరమునకు ఎండ వాన గాలివాన సోకకుండ చూడవలయు ననిగాని యావయే లేదు. రాతిమీద పడుకొనినను మెత్తని పరుపుమీద పడుకొనినను భేదము కనుపడెడిది కాదు. రమ్మని పిలిచినవారి దగ్గఱకు వెళ్ళక, పిలువనివారి యింటికి వెళ్లును. వయసు వచ్చినకొలది ఈలక్షణములు అధికములుగా జొచ్చినవి.

తల్లియైన మరకతంబాళ్ కు అవసానకాలము వచ్చినది. శ్రీ శేషాద్రిని పిలిచినది. "సత్సంగత్వే నిస్సంగత్వం" అను భజగోవింద శ్లోకమును చదివినది. అరుణాచల! అని మూడు సార్లు పలికినది. ఇది ఆమె కుమారునికి చేసిన అంత్యోపదేశ మేమో! ఆమె కనులు మూసినది. ఆమె వాక్యములు శ్రీ శేషాద్రికి ఉపదేశములైనవి. వెంటనే అరుణాచలమను పేర ప్రసిద్ధి నందిన తిరువణ్ణామలైకి ఆయన వెళ్ళినారు. 40 సంవత్సరముల జీవితశేషమంతయు అచటనే గడిపి 1929 లో సిద్ధినందినారు.

శ్రీ శేషాద్రి తిరువణ్ణామలైలో దేవియొక్క ఆలయము నకుగాని శ్రీసుబ్రహ్మణ్యేశ్వరాలయమునకు గాని వెళ్లెడివారు. ఎల్లపుడు పట్టణములో తిరుగుచుండెడివారు. వారి ప్రవర్తన ములు అతిగహనములు. వారిమాటలు, వానిఫలములు దుర్బోధములు. ఈస్థితియందున్న శ్రీ శేషాద్రిస్వామి చరిత్ర జ్ఞాన మార్గానుయాయులకు ఉపదేశముగను హృదయంగమముగను ఉండెడిది. ఇటువంటి సిద్ధుల కేవల దర్శనము మన ఆధ్యాత్మికాభివృద్ధిలో ఒకమెట్టుగ నుపకరించును.

సిద్ధపురుషులు జీవించియున్నపుడు, వారిశరీరముపై శ్రద్ధ వహింపరు. శరీరమును వదలిన తరువాత ఈప్రపంచముతో సంబంధమును పెట్టుకొనవలెనని కోరరు. కాని శ్రీశేషాద్రి స్వామి అనుగ్రహము విలక్షణమైనది. వారి శరీరమును తిరువణ్ణామలైలో సమాధియందుంచుట సాధ్యమైనది. కాని వారి ఆత్మను సమాధియందుంచుట సాధ్యముకాలేదు. శ్రీస్వామి వేఱొకరూపమున, అనగా భూతరూపమున ఆవిర్భవించినారు. 1929 సంవత్సరమునకు ముందటవలెనే ప్రజలతో సంబంధము పెట్టుకొని, ఉపదేశించుచున్నారు. ఈరోడ్ రైలుస్టేషనుకు రెండుమైళ్ళ దూరముననున్న పీరప్పన్ సత్రములో ఉన్న శ్రీశివరామకృష్ణఅయ్యర్ లో ఆవేశించినారు. శ్రీశివరామకృష్ణ అయ్యర్ తల్లిపేరు శ్రీమతి కావేరిఅమ్మాళ్. ఆమె పవిత్ర చరిత్ర. ఆమె భర్త ఈరోడ్‌లో ప్రభుత్వపు రివిన్యూశాఖలో ఉద్యోగిగ నున్నారు. ఆమెకు నలుగురు కుమారులు. ఇద్దఱు కుమార్తెలు నున్నారు. చివరి కుమారుడు శ్రీశివరామకృష్ణయ్యర్. బాల్యము నుండియు శ్రీమతి కావేరిఅమ్మాళ్ పవిత్ర చరిత్ర. సుమారు నలుబది సంవత్సరములు ఆమె ఏఅన్నమును తినలేదు. పండ్లు, పాలు, లేదా మంచిగంధపుపొడి కలిపిననీళ్లు మాత్రమే తీసికొనెడిది. ఆమెకు సుబ్రహ్మణ్యేశ్వరుని యందు ఉత్కటమైన భక్తి కలదు. ప్రతిదినము ఉదయమున 4–6 గంటలమధ్య తనయింట పూజచేసెడిది. అప్పుడు కొందఱు బంధువులను మాత్రమే రానిచ్చెడిది. తిరువసనల్లూర్ నందలి

శ్రీఅయ్యావల్ వలె ఈమెయు దివ్యశక్తులను సాధించినది. కావేరినది ఆమె గ్రామమునకు ఒకమైలు దూరమున ప్రవహించు చుండెడిది. ఒకనాడామె నదికి స్నానము చేయుటకు వెళ్ళలేక పోయినది. అపుడానది, తన పూజాగృహము పైభాగమునుండి లోనికి ప్రవహించునట్లు చేసి, ఆప్రవాహములో ఆమె స్నానము చేసినది. ఆపవిత్రచరిత్రయందింకను ఎన్నియో శక్తులున్నవి. కాని ఆమె జీవించి యుండగా ఆశక్తుల విషయ మెవరికిని తెలియదు. ఒకప్పుడు ఆమె తిరువణ్ణామలైలో నున్న తన బంధువులయింట ఒక కార్యము జరుగుచుండగా, తిరువణ్ణామలై వెళ్ళి ఒక సత్రములో విడిది చేసినది. ఉదయముననే పూజ చేయుచున్నది. ఆకస్మికముగ శ్రీ శేషాద్రిస్వామి వచ్చినారు. ఆహారము కావలెనని అడిగినారు. ఆమె పూజకై ఉంచిన అరటిపండును స్వామికి ఇచ్చినది. స్వామి ఆపండులో సగము తినినారు. ఇంతలో ఏడేండ్ల వయసుననున్న శ్రీశివరామకృష్ణ య్యర్ అచటికి వచ్చినారు. శ్రీస్వామి తాను సగముతినగా మిగిలిన పండును శివరామకృష్ణన్ నోట క్రుక్కినారు. ఇది శ్రీస్వామి ఆ బాలునకిచ్చిన దీక్షయేమో. తరువాత కాలమున ఆశివరామకృష్ణయ్యరే శ్రీస్వామి భూతముగా ఆవేశించుటకు ఆశ్రయమైనారు. (Spirit medium)

ఇరువది సంవత్సరములు గడిచినవి. శ్రీమతి కావేరి అమ్మాళ్, తన ప్రార్థనలో అడిగిన కోరిక ననుసరించి శ్రీ శేషాద్రి స్వామి ఆమెకు కలలో కనపడి తాను భూతమై శివరామ

కృష్ణునియందావేశించునని చెప్పినారు. అటులే ఆవేశించి నారు. శ్రీస్వామిని బ్రతికియుండగా చూచినవారు, భూతమై ఆవేశించిన స్వామిలోగూడ అపూర్వప్రమాటలను భావములను గుర్తింపగలిగినారు. ఒక పలచని కొయ్యపలక, దాని వెనుక అడుగుననున్న రెండు లంకెలపై నుండును. దానికి ముందు భాగమున ఒకరంధ్రము ఉండును. అందులో పెన్సలు పెట్టు దురు. (ఈపలక, అంగడిలో అన్నిచోట్లను దొరకును) ఆ పలకక్రింద ఒక తెల్లకాగితము ఉండును. మొట్టమొదట శ్రీశివ రామకృష్ణ అయ్యర్ ఆపలకను తాకెడివారు. ఆవేశించిన భూతమే ఆపలకను నడిపెడిది. అపుడు కాగితముమీద పెన్సలు వ్రాసిన అక్షరములు పడును. వానిలో భూతరూపము ఆవే శించిన శ్రీస్వామియొక్క సందేశముండెడిది. కొంతకాలమైన తరువాత కాగితమును ఉపయోగించుట మానివేసినారు. శ్రీశివ రామకృష్ణయ్యర్‌కు తాను వ్రాయవలసిన అక్షరములు స్ఫురిం చెడివి. వానిని ఆయన పలికెడివారు. ఇంకను కొంతకాలమైన తరువాత ఆయనకు సమాధిస్థితి కలిగెడిది. అపుడు తానేమి మాట్లాడుచున్నది ఆయనకు తెలియదు. ఆయన ముఖమున శ్రోతలు రెండు లేక మూడుగంటలు ఉపన్యాసమును వినెడి వారు. అవి ప్రామాణికముగను ఉపదేశకముగను ఉండెడివి. శ్రీశివరామకృష్ణయ్యర్ సామాన్య మానవునివలెనే మాట్లా డెడివారు. ఏమి మాట్లాడుచున్నది మాత్ర మాయనకు తెలి యదు. సమాధిస్థితి అయిన తరువాత, సమాధిస్థితిలో ఏమిజరి

గినదనీ, అచటనున్నవారిని అడిగెడువారు. ఈకోయ్యాపలక సాహాయ్యముతో శ్రీశేషాద్రిస్వామి ఉపదేశములను పెద్దపుస్తకములలోను, చిన్నపుస్తకములలోను వ్రాసినారు. వీనినన్నిటిని మొదట "జీవ్యప్రదర్శిని" అను పేరుతోను తరువాత "మోక్షప్రదర్శిని" అను పేరుతోను నడిచిన తమిళభాష పత్రికలలో ప్రకటించినారు.

శ్రీ శేషాద్రిస్వామి భక్తులు ఒకసమాజముగ ఏర్పడి, ఆసమాజమును సొసైటీస్ రిజిస్ట్రేషన్ చట్టముక్రింద రిజిస్టరు చేసినారు. దానికి శ్రీ శేషాద్రిస్వామిగళ్ అధిష్ఠానమ్ అసోసియేషన్ ఉంజలూరు అని పేరుపెట్టినారు. ఈరోడ్‌కు 20మైళ్ళ దూరమునందున్న ఉంజలూరులో, శ్రీస్వామివారి భక్తులు, స్వామివారి యోగసమాధిని నిర్మించినారు. ఆసమాజాధ్వర్యమున, అచట ప్రతిదినము వేదవిహితముగ పూజలు జరుగును. ఇంతటిపేరు, మహిమలుగల, సిద్ధపురుషులు శ్రీకోలండై ఆనంద స్వామివారు వేఱొకరు గలరు. వారు మధురలో నుండెడివారు. 1932 లో శరీరమును విడిచినారు. వారుగూడ శ్రీశివరామకృష్ణయ్యరులో ఆవేశించేడివారు. పైసమాజమువారే, ఈఆనందస్వామివారికి మధురలో అరసరాది అను తావున ఒక సమాధిని నిర్మించినారు. అచటగూడ శాస్త్రానుసారముగ పూజలు జరుగును. శ్రీ శేషాద్రిస్వామివారి శరీరమును తిరువణ్ణామలైలో 1929 లో సమాధియందుంచినారు. అదియు ఈ సమాజపర్యవేక్షణమునసే యున్నది. అచట సక్రమముగ

పూజలు జరుగును. తిరువణ్ణామలై లోని శ్రీస్వామివారి ముఖ్య శిష్యులనేకులు ఈసమాజములో సభ్యులుగ చేరినారు. వారు తిరువణ్ణామలై లోని ఈఅధిష్ఠానమునకు అమూల్యమైన సేవ చేయుచున్నారు.

మన దురదృష్టమువలన శ్రీశివరామకృష్ణయ్యరుగారు తమ 61-వ ఏట 3-3-74 న మరణించినారు. కాని శ్రీస్వామి వారి అనుగ్రహ మపారము. పై ఇద్దరు సిద్ధపురుషులును శ్రీశివరామకృష్ణయ్యరు కుమారులైన శ్రీశేషాద్రిగారిని తమ భూతావేశమునకు ఆశ్రయముగా (Spirit Medium) చేసికొనినారు. పూర్వమువలెనే ఈ యిద్దఱి సిద్ధపురుషుల బోధలను కొయ్యపలక సాహాయ్యముతోగాని, సమాధిస్థితిలో నున్న శ్రీశేషాద్రిగారి ముఖమునగాని మనము వినగలము.

శ్రీ కుజుమణి నారాయణశాస్త్రిగారు అనువారు గొప్ప సంస్కృత విద్వాంసులు. శ్రీశేషాద్రిస్వామి వారితో కలసి మెలసియుండి, వారికి అత్యంత సన్నిహితముగ నుండి వారి జీవితమును పరిశీలించినారు. వారు దయతో తమిళములో శ్రీస్వామివారి జీవితమునే వ్రాయకున్నచో ప్రపంచమునకు ఈ చరిత్ర లభించెడిది కాదు. వారు వేదాన్తులు, పండితులు అగుట వలన విషయమంతయు పాఠకులకు సులభముగ తెలియునట్లు బాగుగా వ్రాసినారు. ఆపుస్తకముయొక్క సర్వస్వామ్యములు ఈసమాజమువారి అధీనమున నున్నవి. తమిళమురాని తెలుగు వారికి తెలియుటకై ఈగ్రంథమును తెనుగులోనికి అనువదింప

వలయునని శ్రీస్వామివారి శిష్యులు కొందఱు కోరినారు. అందువలన ఆగ్రంథమును తెనుగులోనికి అనువదించి ప్రకటించుటకు తెనాలిలోనున్న శ్రీ సాధన గ్రంథ మండలి వ్యవస్థాపకు లయిన శ్రీబులుసు సూర్యప్రకాశశాస్త్రిగారికి అనుమతి యిచ్చుటయైనది. పాఠకులకు ఈగ్రంథపఠనమువలన శ్రీస్వామివారి జీవితవిశేషములు తెలియును. పాఠకులకు ఆసక్తి యున్నచో శ్రీస్వామివారిని, వారు ఆవేశమున నున్నపుడు, చూడవచ్చును. ఈసమాజ కార్యాలయము-శ్రీశేషాద్రి నిలయము, 6వ వీధి తాటబద్ కోయంబత్తూరు 12. (Sri Sesha Nilayam 6th Street, Tatabad-Coimbatore 12.) నందు కలదు. ఆ అడ్రసుతో కార్యదర్శిగారితో ఉత్తరప్రత్యుత్తరములు జరుపవచ్చును. కొన్ని తేదీలలో శ్రీశేషాద్రిగారి ముఖమున శ్రీస్వామివారి ఉపన్యాసమును కోయంబత్తూరులోను, మధురలోనుగూడ వినవచ్చును. శ్రీశేషాద్రిగారు మద్రాసులో ఉద్యోగము చేయుచున్నారు. అందువలన కొన్ని ఉపన్యాసములను మద్రాసులోకూడ వినవచ్చును. ఈవిషయమునకు సంబంధించిన వివరములు సమాజ కార్యదర్శిగారికి వ్రాసి తెలిసికొనవచ్చును.

—భాగవతుల కుటుంబరావు.



# సరస్వతీ స్తుతి

అమల కమలాధివాసిని మనసో వైమల్యదాయిని మనోజ్ఞే,
సుందరగాత్రి సుశీలే తవ చరణాంభోరుహం నమామి సదా.

అచలాత్మజా చ దుర్గా కమలా త్రిపురేతి భేదితా జగతి,
యా సా త్వమేవ వాచా మీశ్వరి సర్వాత్మనా ప్రసీద మమ.

త్వచ్చరణాంబురుహయోః ప్రణామహీనః పునర్ద్విజాతి రపి.
భూయా దనేద మూక స్త్వద్భక్తో భవతి దేవి సర్వజ్ఞః.

మూలాధార ముఖోద్గత బిసతంతునిభా ప్రభా ప్రభావతయా,
విసృతలిపి వ్రాతా హితముఖకరచరణాదికే ప్రసీద మమ.

వర్ణతనో మృతవర్ణే నియతమతిభి ర్వర్ణితే పి యోగీంద్రైః,
నిర్ణీత కరణదూరే వర్ణయితుం దేహి దేవి సామర్థ్యం.

ససురాసుర మౌళిలసన్మణి ప్రభాదీపితాంఘ్రి యుగనలినే,
సకలాగమస్వరూపే సర్వేశ్వరి సన్నిధిం విధేహి మయి.

పుస్తక జపపటహస్తే వరదాభయ చిహ్నచారుబాహులతే,
కర్పూరామలదేహే వాగీశ్వరి శోధయాశు మమ చేతః.

క్షౌమాంబరపరిధానే ముక్తామణివిభూషణే ముదావాసే,
స్మితచంద్రికా వికసిత ముఖేందు బింబాంబికే ప్రసీద మమ.

విద్యారూపే ఽవిద్యానాశిని విద్యోతితేంతరాత్మవిదాం,
గద్యైః సపద్యజాతై రాద్యై ర్మునిభిః స్తుతే ప్రసీద మమ.

త్రిముఖి త్రయీ స్వరూపే త్రిపురే త్రిదశాభివందితాంఘ్రియుగే
త్రీక్షణవిలసితవక్త్రే త్రిమూర్తి మూలాత్మికే ప్రసీద మమ.



# అంకితము

"శ్రీ శేషాద్రిస్వామి చరిత్ర రచనకు ప్రోత్సహించిన అస్మద్గురువర్యులు శ్రీ కంచి కామకోటి జగద్గురు శ్రీ శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ శంకరాచార్య స్వాములవారి పాదపద్మములకు ఈ పుస్తకము ప్రణయ ప్రపత్తులతో నంకితము"

"ఇత్యేషా వాఙ్మయీ పూజా శ్రీమచ్ఛంకర పాదయోః ।
అర్పితా తేన మే దేవః ప్రీయతాం చ సదాశివః ॥"

—విశాఖ.

వేదాత్మికే నిరుక్త జ్యోతి ర్వ్యాకరణ కల్పశిక్షాభిః,
సచ్ఛందోభి సంతత క్లృప్తషడంగేంద్రియే ప్రసీద మమ.

త్వ చ్చరణే సరసి జన్మస్థితి మహిత ధియాం స లిప్యతే దోషః
భగవతి భక్తి మత స్త్వయి పరమాం పరమేశ్వరీ ప్రసీద మమ.

బోధాత్మికే బుధానాం హృదయాంబుజ చారురంగనటనపరే,
భగవతి భవభంగకరీం భక్తిం భద్రార్థదే ప్రసీద మమ.

వాగీశీ స్తవమితి యో జపార్చనాహవన వృత్తిషు ప్రజపేత్,
సతు విమల చిత్తవృత్తి ర్దేహాపది నిత్య శుద్ధ మేతి పదం.

—ప్రపంచసారము



శ్రీమత్పరమహంస కల్యాణగుణ గంభీర

# శ్రీ శేషాద్రిస్వామి స్తుతి

కృతి. కీరవాణి రాగము-ఆదితాళము

## పల్లవి

గురువరుని సేవించిన వారికి
దొరకని ఫలముకలదా-శేషాద్రిసత్. (గురువరుని)

## అనుపల్లవి

స్మరణా దరుణాచల తేజోమయ
పురమున జీవన్ముక్తుడైన సత్. (గురువరుని)

## చరణము-1

బహుకాలముగా సజ్జనులకు కరుణతో
ఇహాపరసుఖములకై సూక్ష్మరూపుడై
మహనీయుల సదుపదేశముల
మహిమలుపొగడ విదులకై తరమా సత్.
(గురువరుని)

## చరణము-2

కలినరులకు నామమహిమలు తెలుసును
సలిలమువలె పాపతాపము తొలగును
చెలిమితో దైన్యాలకభయ మొసగును
ఫలితమా పుణ్యజ్ఞానము వెలుగును సద్గురు.
(గురువరుని)

కృతికర్త :
—సంగీత కళానిధి, టి. కే. బాలగణేశయ్యరు

శ్రీమత్పరమహంస శ్రీరాజపూజిత

# శ్రీ కొళందైయానందస్వామి స్తుతి

కృతి–ఆనందభైరవి–ఆదితాళము

### పల్లవి

ఆనందస్వామిని వేడరే
శ్రీ రాజపూజిత కొళందై. (యానందస్వామిని)

### అనుపల్లవి

జ్ఞానానంద మనోహరం అభ
యానంద భక్తార్తిహారం కుళందై–(యానందస్వామిని)

### చరణము–1

అతిసుందర మీనాక్షీ కుమారం
యతిరూప భృంగి నరావతారం
శృతి శాస్త్ర పురాణాది సాగరం
స్తుతిసలుపరె గురువర కుళందై– (యానందస్వామిని)

### చరణము–2

బాలుని వలె ముద్దుపలుకు లాడుచును
మేలైన భువనేశ్వరిని వేడుచును త్రి
కాలము నెరిగి భక్తుల కాపాడును
బాలగణపతిని బోలిన కుళందై. (యానందస్వామిని)

కృతికర్త :
—సంగీతకళానిధి, టి. కే. బాలగణేశయ్యరు

# మండలి మాట

జ్యోతిర్మాత్ర స్వరూపాయ నిర్మలజ్ఞాన చక్షుషే,
నమః శివాయ శాంతాయ బ్రహ్మణే లింగమూర్తయే॥

ప్రస్తుతము పరమశాక్తేయులైన మహాసీయుల చరిత్ర మీ ఆదరాభిమానముల అండలో మండలి ప్రచురింప గలుగుట ఈశ్వరునికృప. ఇతర ప్రచురణలవలెనే సాధకలోకము ఈ పుస్తకమునుగూడ ఆస్వాదించి ఆనందించెదరని మాఎన్నిక.

జ్ఞానప్రాప్తికి మూడుమార్గము లున్నవి. అవి దైవము, ఆర్షము, పౌరుషములు. పంచకోశపరిజ్ఞానము భృగువు వరుణుని వద్దనుండి నేర్చుకొనెను. యమునివద్ద నచికేతుడు నాచికేతవిద్యలో విబోధితు డయ్యెను. ఈజ్ఞానము దైవదత్తము.

రెండవది ఆర్షము లేక ప్రతిభ. సప్తఋషులు బందిపోటుదొంగను ఒకనిని అనుగ్రహించిరి. ఆ అనుగ్రహస్వరూపమే ఆదికవి వాల్మీకి. వారు ప్రసాదించిన రసాంబుధియే రామాయణము.

మూడవది పౌరుషము. మానవమాత్రుడైన ఒక గురువును చేరి తత్త్వాన్వేషణమో, దైవానుగ్రహప్రాప్తికి ధ్యాన,

మంత్ర, జపాదులు చేయుటయో పౌరుషము. అందులకే స్కాందము;

ఉపదిష్టః సద్గురుణా జప్తః క్షేత్రే చ పావతే,
సద్యో యథేప్సితాం సిద్ధిం దదాతీతి కి మద్భుతం.

అతః సద్గురు మాశ్రిత్య గ్రాహ్యోఽయం మంత్రనాయకః,
పుణ్యక్షేత్రేషు జప్తవ్యః సద్యః సిద్ధిం ప్రయచ్ఛతి.

గురవో నిర్మలాః శాంతా సాధవో మితభాషిణః,
కామక్రోధ వినిర్ముక్తాః సదాచారా జితేంద్రియాః.

ఏతైః కారుణ్యతో దత్తో మంత్రః క్షిప్రం ప్రసిద్ధ్యతి,
క్షేత్రాణి జపయోగ్యాని సమాసా త్కథయామ్యహం.

ప్రయాగం పుష్కరం రమ్యం కేదారం సేతుబంధనం,
గోకర్ణం నైమిశారణ్యం సద్యః సిద్ధికరంనృణాం.

అని, గురువు ఆవశ్యకత, మంత్రోపదేశవిధి, పుణ్య క్షేత్రములలో మంత్రపురశ్చరణ, గురువు లక్షణముల విశదీకరించుచున్నది. మహనీయుల చరిత్రలను చదువుటవలన, మనకు కర్తవ్యము జ్ఞప్తికి వచ్చి తత్త్వనిష్ఠుల మగుటకు అవకాశ మేర్పడుచున్నది. అందుచే శ్రీ శేషాద్రిచరిత్ర మనకొక సాధనప్రణాలికగా భాసించ గలదు.

ఈ గ్రంథము ద్రావిడమాతృకకు విశాఖగారిచే స్వేచ్ఛానువాదము. ఈ పుస్తకమును ప్రచురించుటకు అనుమతించిన

శ్రీ శేషాద్రిస్వామి అధిష్ఠానమువారికిని, ఆంధ్రానువాదము చేసిన విశాఖగారికిని, సుమాంజలియు, శ్లోకార్థములును, ఆంగ్ల వ్యాసానువాదమును వ్రాసిఇచ్చిన మిత్రులు, పండితులు శ్రీభాగవతుల కుటుంబరావుగారికిని మండలి కృతజ్ఞత. కృతి భర్తలైన కామకోటి సరస్వతులకు మండలి నమోవాకములు. ఆస్తికులైన పఠితల ఆదరణ అభిమానము లున్న, త్వరలోనే విశాఖగారిచే వ్రాయబడిన జగద్గురు శృంగేరిశంకరాచార్యులు శ్రీచంద్రశేఖరభారతీ స్వాములవారిచరిత్ర, బోధలుకూడ మండలి ప్రచురించగలదని విన్నవిస్తున్నాము.

సాధన గ్రంథమండలి,
తెనాలి
తేది 6 — 7 — 1976

ఇట్లు, విధేయుడు
బులుసు సూర్యప్రకాశశాస్త్రి
వ్యవస్థాపకుడు



శ్రీ బాలాజీస్వామి

(శ్రీ శేషాద్రిస్వామివారి గురువులు)

ఓం

# శ్రీ శేషాద్రిస్వామి జీవితము

మూకోపి జటిల దుర్గతి శోకోపి స్మరతి యః క్షణం భవతీం।
ఏకోభవతి సజంతు ర్లోకో త్తర కీర్తి రేవ కామాక్షి ॥

ఆర్యాశతకము.

కాంచీమండలము భారతదేశములో ఆధ్యాత్మానికి పుట్టినిల్లు. దీని విస్తీర్ణము నాలుగువందల మైళ్ళు. ఈ ప్రదేశమునకు తొండమండల మని కూడ పేరు. నాలుగు దిక్కులలో నాలుగు పుణ్యస్థలములు - విరించిపురము, మహాబలిపురము, దేవకీపురము, దేవపురము. ఈ మండలమందే నెలసినవి. ఒక నంక పయస్విని, (పాలారునది) మరొకనంక దక్షిణపినాకిని (దక్షిణపెన్న) కాంచీమండలములో ప్రవహిస్తూ జనులకు భౌతిక సంపదనేకాక, పారమార్థిక ఐశ్వర్యంకూడ కల్గిస్తున్నది. ఈ స్రోతస్వినులమధ్య ముత్యాలహారము నడిమిలో మణిపూసవలె కాంచీపురము విలసిల్లుతున్నది.

అయోధ్యా మధురా మాయా కాశీ కాంచీ అవంతికా।
పురీ ద్వారవతీ చైవ సప్తైతే మోక్షదాయికాః ॥

అన్నశ్లోకం ముక్తిప్రదములైన సప్తక్షేత్రములలో కంచి ఒక్కటి అని ఉద్ఘాటిస్తున్నది.

పురాణములు కంచిని బ్రహ్మపురమనీ, ధర్మక్షేత్రమనీ వర్ణించినవి. కంచిలో వేలకొలది శివలింగ ప్రతిష్ఠ లున్నవి. ఎన్నో పుణ్యతీర్థము లున్నవి. ఏకామ్రనాథుడు వెలసిన క్షేత్రము ఇదే. ఈ ఆమ్రవృక్షము మహాప్రళయమందుకూడ నష్టముకాక మార్కండేయ మహర్షిని రక్షించినదని పురాణములు చెబుతున్నవి. ఏకామ్రనాథుని అర్థాంగి-శ్రీచక్రరాజ దేవత-త్రిపురసుందరి. కామాక్షీ ఆలయము ఈ క్షేత్రమందే కలదు. అంతేకాదు. అసంఖ్యాక జీవకోటి రక్షణభారము వహించిన వరదరాజ పెరుమాళ్ళు వాసస్థానమూ ఇదే. ఈ పురనిర్మాణమూ శ్రీచక్రాకృతిలో ఉన్నదని తెలిసినవారు అంటారు.

బిందుస్వరూపము, గురుమండలము, దానిచుట్టూ నవావరణలు కల ఆకృతియే శ్రీచక్రము. కామరాజపీఠము, లేక భూయోని అని పిలువబడే శ్రీకామకోటిపీఠమే కంచికి బిందుస్థానము. బిందుస్థానము చుట్టూ ఏకామ్రనాథుడు, బ్రహ్మా, హస్తివరదుడు, హయగ్రీవుడు, భృగువు, అగస్త్యులు, వ్యాసులు, మార్కండేయులు మొదలైన దేవతలు, ఋషులూ గురుమండలముగా ఏర్పడి ఉన్నారు. వికటచక్రవినాయకుడు, కుమారస్వామి, కృష్ణభగవానులు, ఆవరణదేవతలు, అవతార పురుషులు, యోగులు, జ్ఞానులు, సిద్ధులు, ఈ క్షేత్రాన్ని ఆన్వేషించి ఇక్కడే స్థిరంగా ఉండి పోదామని కోరుకొనుట వింతకాదు. శ్రీశంకరభగవత్పాదులు సైతము దిగ్విజయానం

తరము ఈపట్టణమందే చాలరోజులు వసించిరని ప్రతీతి. ఆసమయమున కామరాజపీఠమునకు కళాకర్షణచేసి ఉపశాంతి చేసిరట; వివిధ మార్గగాములైన హైందవమును వైదికముచేసి తద్రక్షణకై గురుపీఠమును ఆచార్యులు ఏర్పరిచిరి. వారి వీక్షణతో ఈక్షేత్రము మరింత వాసికెక్కి ముముక్షువులకు ఆశ్రయణీయ మైనది.

గురుమండల మనగా సద్గురుమూర్తుల సమూహము. పూజాక్రమములో గురువులను మండలాకృతిగ అమర్చి ఆరాధించుటయే గురుమండలము. 'ఆచార్యదేవోభవ' అన్న వాక్యము శ్రుత్యనుశాసనము. కాలావసరమునుబట్టి అవతార పురుషులు, ఋషులు జన్మిస్తున్నారు. శ్రీమన్నారాయణుడు, బ్రహ్మ, వసిష్ఠుడు, శక్తి, పరాశరుడు, వ్యాసులు, శుకులు, గౌడపాదులు, గోవిందభగవత్పాదులు, శంకరులు, పద్మపాదులు, హస్తామలకులు, తోటకాచార్యులు, సురేశ్వరులు, ఆనందగిరి, వాచస్పతి, అమలానందులు, అప్పయ్యదీక్షితులు, మధుసూదనసరస్వతి, రామానందులు, భాస్కరులు, సదాశివబ్రహ్మేంద్రులు గురుపరంపరకు చేరినవారు.

గురుమండలము దివ్యౌఘము, సిద్ధౌఘము, మానవౌఘము అని మూడు తెగలు. బ్రహ్మనారాయణులు దివ్యౌఘమునకు చేరినవారు. వసిష్ఠులాది శంకరులపర్యంతము సిద్ధౌఘమునకు చేరినవారు. ఇతరులను మానవౌఘమునకు చేరినవారని చెప్పుటవాడుక. ఈవిభాగము శ్రీవిద్యోపాసనా సంప్రదాయము.

ఈ గురుమండలములో శంకరభగవత్పాదులు సుప్రసిద్ధులు. వారు కంచిలో వాసమేర్పరచుకొని లోకక్షేమార్థము శ్రీవిద్యాక్రమమును నెలకొల్పిరి. అద్వైతాచరణకు శ్రీవిద్య మొదటి మెట్టు. అందుచే శిష్యులకు శ్రీవిద్యారహస్యములను స్వయముగా ఉపదేశించి మంత్ర యంత్రముల వ్యాప్తి తమ పర్యవేక్షణక్రింద జరుగునట్లు చూచిరి. వారు స్వయముగ ప్రపంచసారము, సౌందర్యలహరి, లలితాత్రిశతీభాష్యము వ్రాసిరి. శ్రీ కామాక్షియందు ప్రజలకు భక్తికుదురుటకై కొన్ని ఉపాసనాక్రమములను ఏర్పరచి; అర్హతకలవారిని నిష్ణాతులను జేసిరి. శ్రీవిద్యోపాసన అవిచ్ఛిన్నముగా జరుగుటకు తగిన జనులు కంచిలో లేకపోగా, నర్మదాతీరమునుండి పరంపరగా శ్రీవిద్యోపాసన చేయుచూవచ్చిన, ముప్పది కుటుంబములను కంచికి తరలించుకొనివచ్చి, కామాక్షి దేవి క్రియాయోగమును వారికి ఉపదేశించి, అనుష్ఠించునట్లు చేసిరి.

ఆచార్యుల ఆజ్ఞప్రకారము ఈ ముప్పది కుటుంబముల వారు శ్రీ కామాక్షీదేవిని శ్రద్ధాభక్తులతో ఆరాధింప సాగిరి. కర్ణాత్కర్ణోపదేశేన సంప్రాప్తం అవనీతలం' వృత్త పారంపర్యగ శిష్యపారంపర్యగా శ్రీవిద్య సంప్రాప్తించి వ్యాప్తి చెందినది. ఇట్లు శ్రీవిద్యా ఉపాసకులైన కుటుంబములకు కామకోటి వారన్న బిరుదుకూడ ఏర్పడినది.

కామకోటి వంశములో పుట్టిన వారందరూ సాంగో పాంగ వేదాభ్యాసం చేసినవారు. పురాణేతిహాసములను ఆక

ళించుకొన్నవారు. వైదికాచరణ, శ్రీవిద్యోపాసన, త్రిపుర సుందరీపూజ వీరి నిత్యాచరణమై యుండెను. ఈ ముప్పది కుటుంబములలో పదికుటుంబములు పౌరకుత్స గోత్రులు. పది కుటుంబములు కౌండిన్య గోత్రులు, తక్కిన పదికుటుంబములు కౌశిక గోత్రులు. అనగా సగముమంది అష్టసాహస్ర శాఖీయులు. తక్కినసగము వడమశాఖీయులు. కాలక్రమమున ఈ పరంపర క్షీణించి పౌరకుత్సులలో ఒక కుటుంబము, కౌండిన్యులలో ఒక కుటుంబము మాత్రము మిగిలెను. ఈ రెండు కుటుంబములు లోకమున అధర్మము ప్రబలినను, పూర్వ సంప్రదాయములను వదలక పాటించుచూ వచ్చినవి.

ఆ కాలమునందు విజయనగరము, వేలూరు, ఆర్కాటు, తంజావూరులలో రాయలవంశమువారు, నాయకవంశమువారు మహారాష్ట్రీయులు మండలాధిపతులై యుండిరి. ఈ సంస్థానములలో పై చెప్పిన కుటుంబములవారు మంత్రులుగను, పూజారులుగను, ఆస్థానవిద్వాంసులుగను, ప్రశస్తి నొందిరి. శ్రీవిద్యాదీక్షులగుటచే వారు నిగ్రహానుగ్రహదక్షులే కాక, గణితము, హోర జ్యోతిషము, జాతకము మొదలగు శాస్త్రములలో చక్కని పాండితికలవారై యుండిరి.

ఇట్లు ప్రసిద్ధి చెందిన వారిలో ముఖ్యులు, జోస్యము సుబ్బరాయలు, దేవరాయజోస్యులు, శేషాద్రిజోస్యులు, వెంకటరమణశాస్త్రి, కామకోటిశాస్త్రి, క్రీ. వె. 1500 సంవత్సరముల పిదప ఈ వంశమువారు కొన్నిసంస్థానాధిపతుల వేడి

కోళ్ళను మన్నించి శ్రీవరదరాజస్వామి పెరుమాళ్ళ సన్నిధిలో పంచాంగపఠన కైంకర్యమునకు ఒప్పుకొనిరి. దాని ఫలితముగా భూగృహావసతులు, వాహనములు, బిరుదులు, మాన్యములు వీరికి సంక్రమించెను. పైగా వీరు వైష్ణవోచితమైన కొన్ని సంప్రదాయములను అంగీకరింపవలసి వచ్చెను. ఇ.ట్లు లౌకిక వాసనలు అధికమైనను, పరంపరగా లభించిన శ్రీవిద్యాసిద్ధీ, అద్వైతానుభవమూ వీరికి కొరవడలేదు. ఇట్లు కొన్ని సంవత్సరములు గడచెను.

కలిప్రాబల్యము శైవవైష్ణవములకు వైషమ్య మేర్పడెను. కొందరు వీరవైష్ణవులు, తప్తముద్రాంకములేని కామకోటి వంశమువారికి వరదరాజసన్నిధిలో కైంకర్యమునకు అర్హత ఏదని ప్రశ్నించిరి. తప్తముద్రాంకణము, వేదమార్గ బాహ్యమనియు, తమపూర్వీకులకు అనభిమతమనియు, దానిని తామొల్లమని కామకోటివారు మాన్యములను వదలుకొనిరి. అందుచె వారి కలిమితగ్గెను. కొందరు సంపదలు సంకట హేతువులని బీదలకు దానమిచ్చిరి. శివకంచి, విష్ణుకంచిలో నుండిన రెండు ఇళ్ళను మాత్రము విక్రయించక స్వాధీనములోనే యుంచుకొని, సాంసారికులైనను, బంధరహితులై, యదృచ్ఛాలాభ సంతుష్టులై జ్ఞానవైరాగ్య సంపన్నులై జీవితము కామకోటివారు గడపిరి.

ఈసమయమున మతవిషయిక కలహములు హెచ్చెను. దైవభక్తి ప్రజలలో అంతరించెను, ఆచారానుష్ఠానాదులు

క్షీణించుచూ వచ్చెను. దీనిని ఆకట్టుటకు దైవానుగ్రహ సంప న్నుడైన ఆచార్యుని అవసరము కలిగెను. ఈలోపమును పూర్తిచేయుటకో అనునట్లు కామకోటి వంశమున క్రీ. వె. 1790లో కామాక్ష్యనుగ్రహమున కామకోటిశాస్త్రి జన్మించెను. బాల్యముననే ఆయన కులవిద్య శ్రీవిద్యలో సిద్ధి పొందెను వేదములు పురాణేతిహాసస్మృతులు, మీమాంసా తర్క వ్యాకరణములను మథించి, ఆయన చక్కని వ్యుత్పత్తి సంపాదించెను. వేదాంత విషయములలో ఏ ప్రశ్ననైనను అవ లీలగా చెప్పగల దక్షుడాయన.

కామకోటిశాస్త్రి ఆహితాగ్ని. ఉదయము స్నానవిధు లను పూర్తిచేసి, సహస్రగాయత్రి జపించి, అగ్నికార్యముల జేయును. అనుష్ఠానములందు ఏమరిక అనుట ఎరుగడు. ఆయ నకు లెక్కలేని శిష్యులు, ఆయన కుటీరము ప్రాచీన గురుకుల వాసమును తలపింప జేయును. ఆధ్యాత్మికమూర్తి ఊరివారికి ఆదర్శప్రాయుడు.

కామకోటిశాస్త్రికి గాంధర్వకళలో ఎనలేని ప్రవేశము. అది కామాక్షి అనుగ్రహము. దేవీ సమక్షమున శాస్త్రి రాగ తాళలయయుక్తముగా స్వకీయమైన కీర్తనలు పాడేవారు. ఆ రాగసుధలో శాస్త్రి తన్మయులై, సమాధ్యవస్థ ననుభవించే వారు. విష్ణుపరముగాను, అమ్మవారిపైనను, ఎన్నో కీర్తనలను శాస్త్రి వ్రాసిరి. ప్రతికీర్తనలోను, భక్తి జీవనాడి. ఈ క్రింద శాస్త్రిగారి కీర్తనలు కొన్ని;

కేదారగౌళం-రూపకతాళం

పల్లవి

చిత్సభానాయకం చిత్త భజసాంబం

అనుపల్లవి

భజితాంతసమసం నిజభవ్యనటన జితదుర్గం
పాలితసర్గం భర్గం చిత్సభా ॥

చరణం

దివ్యరత్నహారిణం దీనతాపహారిణం భుక్తిముక్తి కారణం
భవ్యచారిణం కల్మషాపహారిణం కవ్యభీష్ట స్మరణం
కామకోటి సన్నుత శుభచరణం విలసత్కరుణం
మునిజనహృదయ విహరణం – చిత్సభా ॥

భైరవి రూపకతాళం

పల్లవి

రమాపతే సదానతే దయాంమయి ప్రదిశ ॥రమా॥

అనుపల్లవి

సుమానసాభిరామ మామవానిశం సదయహృదయ ॥రమా॥

చరణం

సామోద హృషీకేశ చిదానంద మురారే హృది
భూమోదయ మాపాదయ దామోదర భీమార్చిత ॥రమా॥
సామజ వరదామలగుణ సోమవదన కామఫలద రామ
సుమరదన ఘనాఘనాపజయ ॥రమా॥

సాధిత దిక్పాల మదప్రాభవ సంరావణ విద్రావణ
హృద్భేద శిరశ్ఛేదన ధౌరేయ విభో - ॥రమా॥

ఇలా జలా నిలా నలాంబరేందు భానుమండలోజ్జ్వలకలాప
భావితశ్రిత కామకోటినుత శ్రీరమణ కరుణాలయ సుధా
సద్రుచ మృదువచన పురాదిముఖవినుతాపార కృపాకరాచ్యుత
సుగుణ
సరోరుహేక్షణ సుజనసదాశ్రయ అసురదమన
నిరుపమ సుచరితా వరమవ మామకుంఠ గరుడగమన ॥రమా॥

మధ్యమావతి-ఆదితాళం

అంబశివే భవతీ ముపాసే
శంబరవైరి హారాంకనివాసే-

అంబుజ భవవిష్ణు పూజితాసి దిగంబర మపిసాంబ రమాకలయసి
తుంబురముఖ గానలోలే బాలకుచాంబ శంకరినిపీత కాదంబరి
సిద్ధనిచయ మానసాంబుజాత నిబద్ధపతే సురతే వరదే-
సందిగ్ధ మపి యథార్థ మాశు భాసయ వర్ధయ మమబుద్ధి
మమృత సంభాషిణే - ॥అంబ॥

పామరనర సంగమాత్ర దూరయ శ్రీమదంఘ్రి సేవినం సుశీలయ
తామరసదళాక్షి కామేశ్వరి కామకోటి వాక్కదంబ సద్దేహిని
॥అంబ॥

కామకోటిశాస్త్రి భవ్యజీవనము గడుపుచూ ఊరి వారి
కందరికి తలమానికమై యుండెను. ఈయన సచ్చరిత్ర. ఆధ్యా

త్మికనిరతి బోధనాపటిమలను చూచి వెలియూరివారు ముగ్ధులై అప్పుడప్పుడు తమ ఊరికి శాస్త్రిని ఆహ్వానించేవారు. వళూరు గ్రామస్థులు, శాస్త్రిగారి వసతికి తగిన కుటీరమును నిర్మించి, ఆహ్వానించిరి. వారి వేడికోలును మన్నించి, శాస్త్రిగారు కంచిని వదలి యావజ్జీవము వళూరునందే స్థిరపడి పోయిరి.

శాస్త్రిగారిది కౌండిన్యస గోత్రము. వారికి పుత్రసంతతి లేదు. శేషమ్మ యనే ఒక పుత్రికమాత్రము కల్గెను. అందుచే అన్నగారి సంతతినే తన పిల్లలవలె చూచుకొనేవారు. అన్నగారైన చిదంబరశాస్త్రి గారికి వెంకటరమణశాస్త్రి, నంసింహాశాస్త్రి అని ఇరువురు పుత్రులు, సుందరాంబ, మరకతము అని ఇరువురు పుత్రికలు కల్గిరి. వెంకటరమణశాస్త్రి వేదవేదాంతములలో గొప్పవాడనిపించుకొనెను. కొన్ని రోజులు నిర్బంధముతో గృహస్థజీవితము గడపి, అటుపై కాశికి వెళ్ళి సన్యసించి, 1904లో సిద్ధి పొందెను. మిగతముగ్గురు కన్నవారి ఆదరణలోనే యుండిరి.

మరకతము అందగత్తె, కుశాగ్రబుద్ధి. కామకోటిశాస్త్రికి మరకతమన్న చాల ప్రేమ. అందుచే కావ్యనాటకములను ఆమెకు చెప్పించిరి. అచిరకాలములో ఆమెకు వీనియందు మంచిప్రవేశము కల్గెను. వివాహోచితమైన వయస్సురాగా, విద్యావినయ సంపన్నుడును, రూపసియు, శ్రీవిద్యోపాసకు

గును, పౌరకుత్స గోత్రజుడును అగు వరదరాజు అనే యువకున కిచ్చి మరకతమునకు పెళ్ళి చేసిరి.

వరదరాజు మరకతముల కాపురము అన్యోన్య ప్రేమాశ్రయమై వెలిగెను. సంస్కారవతి యగుటచే, సహధర్మచారిణియై దైవభక్తికలిగి మరకతము త్వరలో బంధువుల మెప్పు సంపాదించెను. సౌందర్యలహరి, మూకపంచశతి ఆమెకు కంఠస్థము. తండ్రి వ్రాసిన కీర్తనలు ఆమెకు చాలవరకు వచ్చియుండెను. భగవత్సన్నిధిని స్తోత్రధ్యాన పరాయణయై ఆధ్యాత్మిక చింతనతో ఆమె కాలము గడుపు చుండెను.

వివిధ గ్రామములనుండి శిష్యు లనేకులు శాస్త్రములను చదువునిమిత్తము వరదరాజును ఆశ్రయించి గురుకులవాస ముండిరి. జ్యోతిషములో వరదరాజు పెద్దచేయి. పాఠములను ఫలములను చెప్పుటలో అద్వితీయుడు. కామకోటి వంశీయులు సత్యభాషణులు. వారేమి చెప్పినను ఫలించెడిది. ఆవంశపు వారికి జోస్యులను పేరు వ్యవహారనామము. వరదరాజులను కూడ జోస్యులనే పిలిచేవారు. వరదరాజు తమ్ముడు రామస్వామి యోగ్యతలో గుణములో అన్నకు ఏవిధముగను తీసిపోడు. ఇరువురికీ అన్యోన్య సౌహార్ద మెక్కువ.

వరదరాజుల దాంపత్యములో అనపత్యత ఒక్కటే పెద్దలోటు. దంపతులకు ఇది క్లేశకారణ మాయెను. 'వంశము ఇంతటితో విచ్ఛిన్న మగునా? పూర్వకర్మ అపరిహార్యమా'

అని దిగులు తోచెను. దానహోమములు, సేతుస్నానము, షష్ఠీవ్రతము, క్షేత్రాటనము వరుసగా శ్రద్ధతో చేసిరి. కాని ఫలము కనుపించలేదు.

కామకోటిశాస్త్రిలు తన ఆరాధ్య దేవత కామాక్షిని ఈ దంపతులవిషయముగా ప్రార్థించెను. ఒకరోజు శాస్త్రిగారికి కల. 'నీవు నాకు వెన్నను నైవేద్యము పెట్టిన, నా జ్ఞాన కళయే మరకతమునకు పుత్రుడై పుట్టును' అని కామాక్షి అనుగ్రహించినది. ఉదయము శాస్త్రి తనస్వప్నవృత్తాంతము దంపతుల చెవిని వేసెను. వారికి ఈవార్త అమృత సేచన మాయెను.

దేవతార్చన సమయములో శాస్త్రి నవనీతమును అమ్మవారికి నివేదించి మరకతమునకు ప్రసాదముగా నిచ్చెను. ఇది జరిగిన కొన్నిదివములకు మరకతమునకు గర్భసూచన లగుపించెను. క్రీ. శ. 1870 సంవత్సరము జనవరి 22వ తేది శని వారము హస్తానక్షత్రయుక్త కన్యారాశిలో మరకతము ఒక బాలకుని ప్రసవించెను. జన్మదినము, కులదైవమయిన శ్రీనివాస మూర్తికి ప్రియమైన రోజు. పిల్లవానికి శేషాద్రి అని పేరు పెట్టిరి, లేకలేక పుట్టినవాడు, అల్లారుముద్దు, ప్రతినెల శిశువు పుట్టినతిథి వాను పండుగ చేసుకొని ఆనందించుచుండిరి. మొదటి సంవత్సరము పుట్టినరోజు బంధుమిత్రులతో వైభవముగా వరదరాజులు చేసెను. దంపతుల పుత్రోత్సాహము పున్నమి నాటి వెన్నెలవలె వెల్లివిరసెను.

## 2

రెండవ ఏడు పసిపాపడు తప్పటడుగులు వేయ సాగినాడు. ఒక్కటే దుడుకు. మిట్టపల్లములు చూడక బాలుడు పరుగెత్తును. ఈ గుణము అతని భావి జీవితమున ఏర్పడిన సమదర్శిత్వమునకు ఛాయవలె యుండెను. తండ్రి దేవతార్చనలో పాల్గొనును. ధ్యానములో కూరుచున్న వరదరాజు ప్రక్క శేషాద్రియు పీట వేసుకొని కూర్చొనును. ధ్యానమును నటించును.

మూడవ ఏడు బాలునికి కొన్ని శ్లోకములు గురుస్తుతి మూకపంచశతిలోని కొన్ని స్తవములు నేర్పిరి. శిశువు అక్షర పదభ్రంశలేక మధురోచ్చారణతో శ్లోకములను చదువును. చదివినంతసేపు మనస్సు దానియందే లగ్నము. ఏడుపు, మొండితనము అను మాట లేదు. ఆ బాలుని ప్రపంచమే వేరు.

తల్లి ప్రతిదినము ఆలయమునకు వెళ్ళును. శేషాద్రికి నాలుగేండ్లు. వరదరాజస్వామివారికి వైశాఖోత్సవము జరుగుచుండెను, ఉత్సవములకు వాడుకగా వచ్చు వర్తకులు తమ సామగ్రులతో వచ్చి చేరిరి. ఎక్కడ చూచినను అంగళ్లే. ఒక అంగడిలో రెండంగుళముల ప్రమాణంలో బాలకృష్ణుని కంచువిగ్రహములు ఒకడు అమ్ముచుండెను. తల్లి చేతిని పట్టుకొని నడుచుచుండిన శేషాద్రి చేతిని వదలి, ఆ విగ్రహములను చూడగానే పరుగెత్తి, ఒక విగ్రహమును ఎత్తుకొని 'నాకు

పూజకు కావాలి' అని అనెను. వర్తకుడు పసివానిని చూచి ముచ్చటపడి, 'అమ్మా పిల్లవాడు ప్రియపడుచున్నాడు. ఇప్పుడే అంగడి తెరచినాను. మీదే బోణీ. వెల రెండుఅణాలు మాత్రమే. తీసి ఇవ్వండి.' అని అన్నాడు. మరకతము సరే యని శేషాద్రికి ఒక బొమ్మకొని ఇచ్చి ఆలయమునకు వెళ్ళి ఇంటికి తిరిగి వెళ్ళెను.

మరుసటి రోజు మరకతము శేషాద్రీ ఆవీధిలో గుడికి పోవుచుండగా అంగడి వాడు మరల కనబడినాడు. శేషాద్రిని చూడగానే వానిని జవిరి ఎత్తుకొని, చేతులను ముద్దులాడి, 'తండ్రీ! నీది బంగారు చేయిరా, బాబూ! నీవు బొమ్మలను తాకితివో లేదో అన్నీ నిన్ననే అమ్ముడు పోయినవి' అని ఉత్సాహముతో అనెను. శేషాద్రికి ఆనాటినుండి 'హిరణ్యా బాహువు' అన్న బిరుదు అమరిపోయింది. ఆ బాలకృష్ణ విగ్రహము చాలరోజులు శేషాద్రి దేవతార్చనలో ఉండిపోయినది. ఇప్పటికిని శేషాద్రిస్వామి వంశీయులచేత అది పూజింపబడుచున్నది.

ఐదవఏడు పిల్లవానికి అక్షరాభ్యాసం చేశారు. దానికై వరదరాజు గురుశుక్రుల అస్తమయములేని ఒక మంచిరోజు నిర్ణయించెను. ఆయుష్య హోమము జరిపి శ్రీవిద్యాసిద్ధులగునకామకోటి శాస్త్రిలచేత కుశాగ్రముతో బాలుని నాలుకపై సారస్వత మహాబీజమును సారస్వత దశశ్లోక మంత్రమును ఉల్లేఖింప చేసిరి. ఆమంత్రములచే అభిమంత్రించిన గోక్షీరము

లను ప్రాశన చేయించిరి. పంచాక్షరి, అష్టాక్షరి శ్లోకము మీద వ్రాసి బాలునికి మూడుమార్లు అనుశ్రావిక పద్ధతిని ఉపదేశించిరి. విద్వాంసులకు బహుమతుల నిచ్చి పిల్లవానిని ఆశీర్వదింపుడని కోరిరి. అటుపై శేషాద్రిని పాఠశాలకు పంపిరి. చదువులో శేషాద్రి అతిచురుకు. అమరకోశము కాండత్రయమును అతడు ఒకే మాసములో కంఠస్థము చేసెను. మంచిధారణ, క్లిష్టమైన విషయములను అతడు అవలీలగా గ్రహించును. మూడు సంవత్సరములలో కావ్యములు, చంపువు, నాటకాలంకారములు అన్నిటిలో అసాధారణ పాండిత్యమును సంపాదించెను. తమిళ గ్రంథములు, కంబరామాయణము, తిరుకురళ్, నాలడియార్, మొదలగు గ్రంథములను కూడ పరిశీలించి వానిలో వ్యుత్పత్తిని గడించెను.

శేషాద్రి ప్రతిభ విద్వత్సభలలో విదిత మాయెను. విషయ మేదైనను సరియే ధారాళముగా శ్రవ్యపేయముగా అతడు చెప్పును. కవిత్వము వచ్చును. ఉపనయనానంతరము తర్క-వ్యాకరణములను పూర్తిచేసి, కామకోటి శాస్త్రిలవద్ద కొన్ని మంత్రరహస్యములను, ప్రస్థానత్రయమును, అభ్యసించెను. కోవెల వేదపాఠశాలలో క్రమాంత వేదాధ్యయనము పూర్తిచేసెను. న్యాయశాస్త్రమును చదివెను.

శేషాద్రికి అనుదినమూ తండ్రికి నమస్కరించి పాఠశాలకు వెళ్ళుట వాడుక. ఒకరోజు వాడుక ప్రకారము శేషాద్రి

నమస్కరించెను. వరదరాజుకు భావోద్రేకము కల్గెను. 'నాయనా! ఈ అనుదిననమస్కారమేల? నీ తల్లికి నమస్కరించుము. అది చాలును' అని అనగా, శేషాద్రి 'నాకు మీరు ఇరువురూ ఒక్కటే. భక్తి ప్రీతులలో నేను వ్యత్యాసము చూపలేను.' అని చెప్పి తనదారిని వెళ్ళెను.

శేషాద్రి వెళ్ళినవెనుక వరదరాజు తనభార్యను పిలిచి, 'ఎంతటి వారికైనను ఇహలోకపు వాంఛలు పూర్తిగా పోవు. నీవు దైవ్యానుగ్రహమున నాకు భార్యవైతివి. నలుగురు మెచ్చుకొనే పుత్రుడున్నాడు. తమ్ముడు రామస్వామికి సంతతి లేదు. మన నరసింహుని అతడు దత్తత తీసుకొన ఇష్ట పడు చున్నాడు. అతని కోరిక తీర్చుట మంచిది. శేషాద్రి కొలది కాలములో ప్రఖ్యాతి వహించును. నాకు ఇహలోక యాత్ర చాలించుటకు దేవి అనుజ్ఞ ఐనది. నేడో రేపో నేను దేహము చాలింతును. నీవు కొంతకాలము శేషాద్రి పేరు ప్రతిష్ఠలను చూచిన పిదప కైవల్యప్రాప్తి నొందుదువు' అని పలికెను.

ఈ మాటవినగనే మరకతము దుఃఖభారముచే మూర్ఛిల్లెను. మూర్ఛ తేరిన పిదప వరదరాజు–'ఎంత ఆపదలోనైన ధైర్యము వదలరాదు. అన్నీ ఈశ్వరేచ్ఛ ప్రకారము జరుగును' అని భార్యను ఆశ్వాసించెను.

మరునటిరోజు వరదరాజు వాడుక ప్రకారము నియమ నిష్ఠలను తీర్చుకొని భోజనానంతరము ఉపనిషత్తులను చది

వెను. ప్రదోష సమయమున ఏకామ్రనాథుని దర్శించెను. ఇంటికి వచ్చిన పిదప ఆహారము పుచ్చుకొనలేదు. కొంత సేపటికి ఆయనకు అతిసార విరోచనము లారంభించెను

వరదరాజు వాక్కు ఫలించునట్లున్నదే యని అందరూ గాబరాపడిరి. శేషాద్రియు కన్నులనీరు గ్రుక్కుకొనుచూ తండ్రి సమీపమునకు వచ్చి నిలుచుండెను. బిడ్డా! విచారపడకు. అతిసారములో కొన ఊపిరివరకు జ్ఞాపకశక్తిపోదు. 'అతిసారేతు మరణం యోగినామపి దుర్లభం' నా అదృష్టం కొద్ది ఈ వ్యాధి వచ్చింది. ఇక నామనస్సు తత్త్వముపై లగ్నము చేయ యత్నించెదను. నేను చెప్పవలసినది ఏమియులేదు. కాని ఒక్కమాట. శాస్త్రము లెన్ని చదివినను, అనుభవ జ్ఞానము మించినదిలేదు. అన్ని జ్ఞానములలోను అనుభవ జ్ఞానమే గొప్ప. ఈ మాట గుర్తుంచుకో. అని తన చరమ సందేశము తెలిపి, ధ్యాన మగ్నుడై వరదరాజు తన పాంచభౌతిక శరీరమును వదలిపోయెను. తండ్రి మరణముతో శేషాద్రికి దుఃఖముతో బాటు అపార వైరాగ్యముప్పతిల్లెను.

వరదరాజులు చనిపోగా మరకతమును, పిల్లలనూ కామకోటిశాస్త్రి తనతో బాటు వళూరునకు తీసుకొని పోయెను. శేషాద్రికి పదునాలుగేళ్ళు. తాతగారివద్ద ఈ సమయముననే ఆయన ప్రస్థానత్రయమును పూర్తిచేసెను.

కామకోటిశాస్త్రియందు దేవికి అపారకృప. ఆయన శమదమాది గుణసంపన్నుడు. వైరాగ్యం కలవాడు. ఈ యన వద్ద చాలమంది మంత్రోపదేశం పొందారు. సర్. పి. టీ. త్యాగరాజు చెట్టిగారి తండ్రి పొట్టి మహాదేవ చెట్టి, శాస్త్రివద్ద మంత్రోపదేశమును పొంది విశేష ధనలాభమును గాంచెను. గురుదక్షిణగా చెట్టి నాలుగువేల రూపాయలు శాస్త్రికి ఇవ్వబోయెను, శాస్త్రిగారు చిరునవ్వునవ్వి వద్దని త్రిప్పివేసిరి. శాస్త్రిగారికి ఎనభై ఏళ్ళయినది. సర్. సి. పి. రామస్వామయ్యరు మాతామహుడు భాగవత ప్రవచనము చేయవలసినదని కోరిరి. తనకు ఆరోగ్యము సరిగా లేనందున, తనకు బదులు శేషాద్రి ప్రవచనము చేయునని, శాస్త్రిబదులు పంపిరి. వెంకటసుబ్బయ్యరు దీనికి సమ్మతించెను. మరకతము శేషాద్రితో బాటు శాస్త్రి వందవాసికి వెళ్ళిరి. సుమారు ఒక్క సంవత్సరకాలము శ్రోతలకు ఆశ్చర్యకరముగా శేషాద్రి ప్రవచనము చేసెను.

ఈ సమయమున శాస్త్రిగారికి ఆరోగ్యము బాగా చెడిపోయినది. రెండు మూడు నెలలు మంచము పట్టెను. కొంత స్వస్థతరాగా, కంచికి మరలి అచట ఉపనిషద్బ్రహ్మము అని పేరొందిన శ్రీకృష్ణానందస్వామిని ఆశ్రయించి తమకు సన్యాసదీక్ష ఇవ్వమని ప్రార్థించిరి. ఆయన శాస్త్రికి దీక్ష నిచ్చెను. విధ్యుక్తముగా శాస్త్రి గురువువద్ద వేదాంత శ్రవణము

చేసిరి. దేహదార్ఢ్యము లేనందున పరివ్రాజకోచితమైన మాధు కర వృత్తిని ఆయన అవలంబింపలేదు. మరకతము తన ఇరువురి కొమరుల సహాయముతో ఆయన భిక్షకు ఏర్పాటు చేసెను. మూడు నెలలు గడచిన పిదప దామల్ అను గ్రామమునకు వెళ్ళి అచ్చట బ్రహ్మానంద సరస్వతి అన్న పరివ్రాజక నామముతో కామకోటిశాస్త్రిలు విదేహముక్తి నొందిరి.

భర్తమరణముతో మరకతమునకు జీవితములో గొప్ప ఔదాసీన్య మేర్పడెను. ఎప్పుడూ మౌనమే, ముప్పొద్దుల స్నానము, అధిక కాలము జపధ్యానములతో చెల్లుచుండెను. ఏక భుక్తము, పుత్రునిపై మాత్రము వాంఛ అధికముగా నుండెను. దానికి శేషాద్రి గుణాతిశయమే కారణము.

శేషాద్రికి ఇపుడు పదహేడవ సంవత్సరము. వివాహము చేయవలెనని మరకతమునకు ఆశకల్గెను. దామల్ గ్రామమున శేషాద్రి మేనత్త వెంకటలక్ష్మమ్మకు కాకిని అను అమ్మాయి వున్నది. పిల్ల గుణవతి. కులశీలములను ఎన్నపని లేదు. శేషా ద్రికి ఇవ్వవలెనని ఆమెకూ కోరికకలదు. ఒకరోజు ఆమె కంచికి ప్రయాణ మాయెను. అన్న రామస్వామి జోస్యులతో కాకినిని శేషాద్రికి ఇవ్వవలెనని నా కోరిక. అన్నకూ నాయన గారికీ ఇరువురికీ సమ్మతమే. కానీ వారి సమక్షమున ఈ కార్యము జరుగుటకు మనం ఇచ్చి పెట్టుకోలేదు. నీవు శీఘ్ర ముగా ముహూర్తము పెట్టిన బాగుండును, అని చెప్పెను.

"లక్ష్మీ! నీదగ్గర దాపరిక మెందుకు? శేషాద్రి జాతకములో పరివ్రాజక యోగ మున్నది. అతడు సన్యాసి అగుట నిశ్చయము. నీకుమా త్రైకు వేరే సంబంధము చూచుట ఉత్తమం" అని రామస్వామి బదులుచెప్పెను, అప్పగారి మాటలకు వెంకటలక్ష్మమ్మ విన్నబోయెను. విఫలయై ఇంటికి మరలిపోయెను.

అప్పుడే జపమునకు కూర్చున్న మరకతము చెవిలో ఈ మాటలు పడెను. రామస్వామి ఏమిచెప్పిన అది జరుగును అని ఆమెకు నమ్మకము. పది రోజులలో కాకిని పెళ్ళి జరిగె నని వార్త వినవచ్చెను. దీనితో మరింత విచారము పుట్టెను. ఆమె ఏక భుక్తమును వదలి ఉపవసించ సాగెను. దేహము చిక్కి శల్యమాయెను. ఈ సమయమున తమ్ముడు నరసింహ శాస్త్రి మరణించెనని వార్త వచ్చెను. ఇవి అన్నియూ చేరి ఆమెను మంచమెక్కించెను, సన్నిపాతజ్వరము ఒక నెల వదలక కాచినది. మందుమాకులు లేవు. కార్తిక మాసము శుక్ల పక్ష దశమి, మరకతము శేషాద్రిని పిలిచెను. 'నాయనా! నేను ఇక ఉండునట్లు కనిపించటం లేదు. నీవు నన్ను వదలి ఎక్కడకు వెళ్ళకు' అని హెచ్చరించెను. మరుసటిరోజు ఏకాదశి గడియలు, మరకతము శేషాద్రిని పిలిచి

సత్సంగత్వే నిస్సంగత్వం నిస్సంగత్వే నిర్మోహత్వం,
నిర్మోహత్వే నిశ్చలతత్వం నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః॥
దర్శనా దభ్ర సదసి జననాత్ కమలాలయే।
కాశ్యాంతు మరణా న్ముక్తిః స్మరణా దరుణాచలే॥

అని రెండు శ్లోకములు శేషాద్రిరొమ్ము మూడు మారులు చరచి చెప్పెను. శేషాద్రిని-అంబశివే అన్నకీర్తను పాడమని, అతనితో బాటు తానును పాడెను. కడపట అరుణాచలా అరుణాచలా యని అరుణాచలేశ్వర స్మరణతో శేషాద్రిపై ఒరిగి ఆమె ప్రాణములను విడచెను.

శేషాద్రికి దుఃఖము సముద్రమువలె పొంగినది. మాతృ శోకము దావానలమువలె దీపించెను. కాని శేషాద్రి ధీరోదాత్తుడు. శోకమును జ్ఞానముచే అతడు ఉపశమింప చేసుకొనెను. మాతృయజ్ఞమును, తమ్ముడు నరసింహునితో కలసి పూర్తి చేసెను.

## 3

రామస్వామి జోస్యులు అతనిభార్య కల్యాణి తల్లి దండ్రులను పోగొట్టుకొన్న సేషాద్రిని నరసింహునీ ఆదరముగా చూచుచుండిరి. రామస్వామికి కొంచెము స్వార్జితము కలదు. దానితోబాటు జోస్యము మంచిరాబడి యుండెను. గృహనిర్వాహణకు వలసిన ఆర్థికస్తోమతకు ఏవిధమైన లోప

మును లేదు. అందుచే శేషాద్రికి కుటుంబభారము తెలియ లేదు: ఐనను శేషాద్రికి ఇంటనుండుటకు మనసొప్పలేదు. తల్లి చరమ సందేహము, ఎకొద్ది ఈషణాత్రయములు ఉండెనో, వానిని తలఎత్తనట్లు చేసెను. శేషాద్రి ప్రకృతి విరక్తితో నిండి పోయెను.

అంతేకాదు. తల్లి అరుణాచల అ రు ణా చ ల అని ప్రాణము విడచినది. శేషాద్రికి అరుణాచల స్మరణ అధిక మాయెను. అదివఱకు అతడు తిరువణ్ణామలై చూచినదిలేదు. పంచశిఖరముల గోపురములతో శేషాద్రి చిత్తరువు నొకటి వ్రాసెను. భక్తిమహిమమో సంస్కార బలమో తెలియదు. అది అరుణాచలమునకు ప్రతిరూపమై అమరెను. దేవీపూజ, రామసేవ పారంపర్యముగా సిద్ధించి చే యున్నది. ప్రత్యేక ముగా తన కొక పూజాగృహమును శేషాద్రి నియమించు కొనెను. అందు కామాక్షి, రామచంద్రమూర్తి, తాను గీచిన అరుణాచల చిత్తరువూ ఉంచి ధూపదీప నైవేద్యములతో పూజప్రారంభించెను. ఉదయము 5 గంటలకు స్నానము చేసి లోన కూర్చున్న మధ్యాహ్నము పండ్రెండు గంటలకు కాని తలుపు తెరచుటలేదు. వేళకు భోజనము చేయుడు. కొన్ని రోజులు కేవల ఉపవాసమే. తాతగారు ఉపదేశించిన షోడ శాక్షరిని ఉగ్రముగా జపించును. ఉచ్చస్వరమున అరుణా చలేశా, శోణాద్రినాథా యని పిలుచును. రాత్రులలో దుర్గా

సూక్తమును పఠించును, బ్రహ్మముహూర్తమున నాలుగు గంటలకు స్నానమునకు బయలుదేరును. పినతండ్రియు పిన తల్లియు ఈ తీవ్రసాధనలు కొంతతగ్గించి ఆరోగ్యమును గమ నించుకొనుమని చెప్పిన ఆమాట చెవిని పెట్టడు. ఇంట్లో వీరి పోరు అధికము కాగా గుళ్ళలో ఎక్కువకాలము ఆయన ఉపాసన చేయుటకు ప్రారంభించెను.

శేషాద్రికి సహజముగనే శాస్త్రవాసన అధికము. శాస్త్ర విచారణ, చర్చలు వాక్యార్థములు విద్వాంసులతో కౌతుకముతో చేసెడివాడు. ఇప్పుడో వాని నన్నిటిని నిలిపి వేసెను. ప్రస్తుత దినచర్య ముప్పొద్దుల స్నానము. మధ్యలో ఏదో అశుద్ధి యని మరల మరల స్నానము. చక్రత్తాళ్వారు సన్నిధిలో అభిముఖముగనో, ఉత్తరదిశనో కూర్చుండి జపము చేయును. ఈ కార్యక్రమము మధ్యాహ్నము పండ్రెండు గంటలవఱకు. తరువాత కామాక్షి సన్నిధానమునకు వచ్చును. పలుపర్యాయములు ఆలయ ప్రదక్షిణము చేయును. దానితో బాటు నమస్కారములు మూకపంచశతిని పారాయణచేయును. చీకటిపడి ఊరిలోని వారందరు నిదురపోయినపిదప ఇంటికి మరలును. రాత్రి ఆహారమేదియు లేక ఉపవాస ముండును. కుంకుమను విభూతివలె నుదుట పులుముకొనును. సూర్యుని చూచి సాగిలపడును. తనలో తానే మాట్లాడుకొనును. వీధిలో కన్య లెవరైన పోవుచుండిన వారికి సాగిలపడును. తెలిసిన పెద్దలు ఎవరైన కనబడిన వారి పాదములను కండ్లకొత్తు

కొనును. శేషాద్రీ ఏమిది?' అని వారు అడిగిన, బ్రాహ్మణుని పాదములూ భగవత్పాదములూ ఒకటి అని బదులు ఇచ్చును

స్వామి వీథిలో ఊరేగింపుకు వచ్చిన, ముందు పోయి త్రోవలోని రాళ్ళనూ కాగితములనూ తీసి పారవేయును. రాత్రింబగళ్లు ఒకచో తిరుగుడు. నిర్దిష్టస్థలము లేదు. అందరి ఇళ్ళూ తనవే. తైలాభ్యంగనముకాని. క్షురకర్మగాని ఎరుగడు. రాత్రిళ్లు ఎక్కువ నిద్రింపడు.

ఎవరైననూ శేషాద్రీ ఏమి చేయుచున్నావు ? అని అడిగిన 'కర్మనాశమునకు జపము చేయుచున్నాను. కర్మ పోవలెనుకదా ?' అని బదులు చెప్పును. 'ఏమి జపము ?' అని మరల అడిగిన, 'అంభస్యపారే. - ఇది నారాయణోపనిషత్తు లోనిది. కామోకార్షీత్ మన్యురకారషీత్ కామః కరోతి నాహం కరోమి- లక్ష ఆవృతులు ఐనవి. ఇంకను ఏబదివేలు ఉన్నవి. కర్మక్షయము కాక మోక్ష మెట్లు సాధ్యము ?''అని శేషాద్రి ప్రశ్నించును. శేషాద్రికి పిచ్చి బాగాపట్టినదని ఊరి వారు తీర్మానించిరి.

ఊరివారి ఉపద్రవము, ఇంటివారి పోరు ఎక్కువకాగా, ఆలయములు వదలి శేషాద్రి ఏకాంత ప్రదేశములకై వెదుక సాగెను. ఏదియూ దొరకక పోగా శ్మశానమునకు వెళ్ళి అచ్చట తన ఉపాసన ప్రారంభించెను. ఇంటిలో జపము. సాయంసంధ్య పూర్తి చేసుకొని వేగవతీ నదీ తీరములోని

శ్మశానము చేరుకొని మరునటి ఉదయమువరకు జపించి, ఇంటికి మరలును. ఈ విషయము పదిదినములవరకు ఎవరికిని తెలియలేదు. తెలిసిన పిదప అశుద్ధప్రదేశములో ఈ జప మేల ? అని ఆక్షేపించిరి. 'శ్మశానము రుద్రభూమి. అచట చేయు సాధనలకు రుద్రుడు అనుకూలుడు. ఇతర ప్రదేశము లలో వేయిమార్లు జపించిన ఎంతఫలమో శ్మశానములో ఒక్కమారు జపించిన అంతఫలము' అని శేషాద్రి బదులిచ్చెను.

ఒకప్పుడు బంధువులు శేషాద్రి ఒకగదిలో ఉండగా బయట గొళ్ళెము పెట్టిరి. మనసు మార్చుకొనునేమో అని. వారి ఆశ. శేషాద్రియో, ఇదే సాకు అనుకొని లోపల గొళ్ళెము పెట్టి నిర్విచారముగా నాలుగు రోజులు ధ్యాన ములో మునిగి పోయెను. బంధువులకు అతడు తలుపు తెరిచిన చాలనిపించెను. నిర్బంధము అధికము కానుకాను జపసంఖ్య యూ వృద్ధి అయ్యెను. ఉపవాసములతో జపసాధనలతో ఆయన ముఖమున అలౌకికమైన దీప్తి ప్రకాశింప సాగెను శేషాద్రి శాస్త్ర వైదుష్య మెరిగిన వారు అగుటచే ఆయన ఆధ్యాత్మికోన్మాదమును ఎవ్వరును అరికట్ట పూనుకోలేదు.

ఒకరోజు శనివారము. ఇంటివారి కందరికి తైలాభ్యం గన దినము. శేషాద్రి పదిగంటలకు శ్మశానమునుండి తిరిగి వచ్చెను. పినతండ్రి ఇతని తీరుచూచి నాకు తలంటు వద్దని విసుగుకొనెను. పినతండ్రికి తైలమర్దనము, వస్త్రములను

ఉదుకుట శేషాద్రివంతు. ఆధ్యాత్మిక విషయములందు తక్క శేషాద్రి పినతండ్రిమాట జవదాటడు. జపతపములు లేని సమయములలో అతిచనువుతో మెలుగును. చమత్కారములు ఎక్కువ. సరసముగా మాట్లాడును. సాధనవిషయము తప్పించిన శేషాద్రి సరసుడే.

'ఈరోజు మీాచిన్నాయన తలంటుకోరట' అని కల్యాణి అనెను.

'కారణము ?'

'నీవు ఇట్లా ఉన్నావని వారు అలిగి ఉంటారు.'

'నాపై అలుగుటఎందుకు ? ఎవరిత్రోవ వారిది. వారి వారి స్థితిలో వారువారున్న కలహానికి కారణ మెక్కడ ?'' అని శేషాద్రి పినతండ్రిని అభ్యంగమునకు పిలిచెను. ఎదురు చెప్పిన బాగుండదని పినతండ్రియు ఒప్పుకొనెను. తలపై నూనెపెట్టి మర్దన చేయుచూ మధ్యలో ఆపి వీథిలోనికి వెళ్ళి ఆకాశమువంక ఐదునిమిషములు చూచి శేషాద్రి మరల తిరిగి వచ్చెను.

''ఆకాశంలో ఏమి చూచావు ;''

'దేవతలను'

'వట్టిదేవతలేనా ? లేక గంధర్వులు కూడానా?'

'ఆ ! గంధర్వులూ ఉన్నారు'

'ఓహో. వాళ్ళు ఆలాపిస్తున్న రాగం ఏమి?

'బిలహరి'

'సరి నీకు పిచ్చి బాగాముదిరినట్లున్నది.

వారు పోతుంటే నాకంటికి కనబడరేమి?'

'వారు కర్మిష్ఠులకండ్ల బడరు. సుస్థలంగా ఉన్న వారికే వారి దర్శనం'

'సరి. సరి. నీ వెఱ్ఱి రోజురోజుకూ వేయితలలు వేస్తున్నది.' అని పినతండ్రి స్నానమునకు లేచెను.

సాధనా కాలములో శేషాద్రికి ప్రోత్సాహమునకు బదులు నిరోధమే ఎదురైనది. ఆయన వర్తన లోకవిరుద్ధము, దానితో ఆయనకు లేనిపిచ్చిని అంటగట్టిరి. ఉన్మాదు డన్న పేరురూఢి అయ్యెను. బంధువులూ స్నేహితులూ కలసి, 'పెళ్ళి చేయండి పిచ్చికుదురుతుంది' అని లోకసహజమైన సలహా నిచ్చారు. కానీ శేషాద్రి పిచ్చి ఇప్పటికే జగద్వ్యాప్తమై పోయెను. ఇతనికి పిల్లనిచ్చు వారెవరు! పినతండ్రికి శేషాద్రితో తనకే పిచ్చిపట్టునేమో అని అనిపించెను.

రామస్వామి ఒకరోజు ఖిన్నుడై కూరుచుండెను. శేషాద్రి ఆయనను సమీపించి' మీకు విచార మెందుకు? వివాహేచ్ఛ నాకుఉన్న నేనుమీకు చెప్పనా! మీరు ఊరక

ఇట్లు నిర్బంధముచేసిన నేను ఊరువిడిచి పోవుదును' అని తెలియచెప్పెను. ఈ మాటతో పినతండ్రి కొన్ని రోజులు ఊరకుండెను. శేషాద్రియు తనకు అంతరాయములు తొలగిన వని సంతోషించెను. కాని ఈశ్వరేచ్ఛ వేరుగా నుండెను.

కామకోటి శాస్త్రిల పిదప శాస్త్రవిషయములలో పరశురామశాస్త్రి పేరుపొందెను. ఆయనకు బంధుకోటిలోను గౌరవముకలదు. ఒకరోజు హఠాత్తుగా పరశురామశాస్త్రి రామస్వామి ఇంటికి వచ్చెను. అతనిని చూచి, రామస్వామి 'పోనీ నీవైనా శేషాద్రికి నాలుగు మంచిమాటలు చెప్ప రాదా ?' అని బ్రతిమలాడెను. 'శేషాద్రిని సరిదిద్దుట కే నారాక' అని శాస్త్రి గంభీరముగా అనెను.

అపుడే తన జపతపములు పూర్తిచేసుకొని శేషాద్రి ఇంట అడుగు పెట్టుచుండెను. వచ్చీరాకముందే శాస్త్రి శేషాద్రిని ఆక్షేపించెను. 'నీవు శ్మశానమందు జపిస్తున్నా వటనే ? అది శాస్త్ర విరుద్ధము' అని పరశురామశాస్త్రి అనెను. శేషాద్రి చేయవచ్చునవెను. ఇరువురికి తర్క మారంభ మాయెను. శేషాద్రి 'నేను నైష్ఠిక బ్రహ్మచారిని. ఉపాసకు నను. ఉపాసనకు దేశకాల నియమములేదు' అని శాస్త్రాధా రములను చూపి శాస్త్రిని నిరుత్తరుని చేసెను. 'ఐనచో నీవు గృహస్థులున్న చోటికి శ్మశానము నుండి రాకూడదు. అని

శాస్త్రి అనెను' అట్లైనచో మంచిది, అని శేషాద్రి వెంటనే తిరిగి పోయెను. ఆనాటినుంచి శేషాద్రి ఇంటివైపు తిరిగి చూడలేదు. ఏచెట్టుక్రిందనో, ఏ కోవెలలోనో ఆతడు కాలము గడుపసాగెను. రామస్వామియు గుండె దిట్టము చేసుకొనెను.

సాధకునకు గురులాభమైనకాని సాధన స్థిరమవదు. ఒకరోజు వాడుక ప్రకారము శేషాద్రి కోవెలకు పోయెను. అచ్చట నలువురు శిష్యులచే పరివేష్టితుడై అపరదక్షిణా మూర్తివలె తోచించు ఒక గౌడసన్యాసిని శేషాద్రి చూచెను. చూచినంతనే శేషాద్రికి భావోద్రేకముతో కంఠము రుద్ధ మాయెను. నమస్కరించిన పిదప సన్యాసియు 'మాశుచః ఉపవిశ' యని సంజ్ఞచేసెను. శేషాద్రి అరుగుమీద కూర్చొ నెను. సన్యాసిచూపులే నయనదీక్ష ఆయెను. సన్యాసి వృత్తాంత మరసిన పట్టన్న అను యువకుడు శేషాద్రికి సన్యాసి పరిచయము చేసెను. ఆయన పేరు బాలాజీ స్వాములు. హరిద్వారము నుండి రాక. రామేశ్వరం వెళ్ళుతూ కంచికి వచ్చారు. పట్టన్న దైవభక్తి, సత్సాంగత్యములో ప్రియము కలవాడు. బాలాజీ స్వాముల ఇరువురి వృత్తాంతమును అడిగి తెలుసుకొన్నారు. కొంతసేపు శాస్త్రసంభాషణ చేశారు. వారు ఉన్నంతవరకు వీరు ఇరువురూ పరిచర్యచేయుచు వచ్చిరి. కడపటిరోజు పట్టన్నకు దేవీ మంత్రమునూ, శేషాద్రికి సన్యాసిదీక్షయూ

ఆయన ఇచ్చెను. స్వామి సాధన ఇట్లుసన్యాస దీక్షలో, తత్త్వమసి వాక్యోపలబ్ధిలో ముగిసెను.

శేషాద్రి తండ్రి ఆబ్దికము సమీపించెను. శేషాద్రి సన్యాసియై తిరుగుచుండెను. ఆబ్దికము చేయువారెవరు ? శేషాద్రిని బలవంతపఱచినైనను పిలుచుకొని వచ్చెదమని రామస్వామి బయలుదేరెను, వెదుకగా వెదుకగా ఒకచోట శేషాద్రి కనపడెను. ఆబ్దికమునకై శేషాద్రిని రామస్వామి రమ్మనెను, 'నేను సన్యాసిని. నాకుకర్మలు ఎన్నడో పోయిన వి. నన్ను బలవంతము చేయకుడు' అని చెప్పిననూ రామస్వామి చెవినిపెట్టక బలవంతముగా తీసుకొనివచ్చి ఒకగదిలో త్రోసి బీగమువేసి, శ్రాద్ధానంతరము, పితృశేషమును తినిన పిదప వెళ్ళ వచ్చునని బీగము చెవి మొలలో దోపుకొనెను. శేషాద్రి తమ్ముడు నరసింహము శ్రాద్ధకర్మలను చేసెను. బ్రాహ్మణుల భోజనములైనవి. పితృదేవతలకు ప్రదక్షిణము చేసి ఆశీర్వచనము లందు సమయము. రామస్వామి గదితలుపు తీసెను. గదిఖాళీ. శేషాద్రి అందులేడు. ఊరుమొత్తము గాలించిరి. శేషాద్రి యోగశక్తితో గదినుండి మాయమయ్యె నని గ్రహించిరి. సాధారణునిగా అతనిని తలచినందులకు తమ బుద్ధిమాంద్యమునకు నొచ్చుకొనిరి.

కొంతకాలమునకు కంచికి ఇరవై మైళ్ళ దూరమునను న్న కావేరీపాకములో శేషాద్రి ఉన్నవార్త వినవచ్చెను.

ఆ ఊరిలో శేషాద్రి పెద్దమ్మ సుందరమ్మాళ్ ఉండెను. ఆమెకు పదేళ్ళ పిల్లవాడు. పేరు శేషు. శేషాద్రిని శేషు చూచి తల్లితో చెప్పెను. ఆమె ఆలయమునకు వెళ్ళి శేషాద్రిని ఇంటికి రమ్మనెను. శేషాద్రి వచ్చుటకు నిరాకరించెను. అందుచేత ఆమెయె అతనికి ఉన్నచోట ఆహారము తెచ్చి పెట్టెను.

ఒకరోజు ఉదయము ఆరుగంటలపుడు శేషాద్రి, శేషు గుడిచుట్టూ ప్రదక్షిణము చేయుచుండగా, ప్రాకారము ఉత్తర దిశలో గోడచేరువున నున్న పొన్నచెట్టుక్రింద నుండి ఒక పెద్ద పాము వెలికి వచ్చెను. పిల్లవాడు భయపడి పాము, పాము అని అరచెను. కాని శేషాద్రి నిశ్చింతగా పామువద్దకు వెళ్ళెను. పాము అతినిపై ప్రాకి, మెడచుట్టు మూడుమార్లు చుట్టుకొని అతని శిరస్సును పడగతో కప్పెను. శేషు వీధి లోనికి పరుగెత్తి శేషాద్రిని పాముకరచినదని గోలచేసెను. జనులు గుమిగూడి లోనికివచ్చిరి. శేషాద్రి నిశ్చలముగా సదాశివునివలె భుజంగభూషణుడై కూరుచుని యుండెను.

శేషాద్రి కావేరిపాకమునందున్న సంగతి తెలిసి కల్యాణియు, రామస్వామియు ఆయనను చూడవచ్చిరి. సమాధిలో ఏడు భూమికలు. అవి శుభేచ్ఛ, విచారణ, తనుమానసీ, సత్వాపత్తి, సంసక్తి, పదార్థభావని, తుర్యగ అనునవి. నాలుగవ భూమికలోని వారిని బ్రహ్మవిదు లనియు, ఐదు,

ఆరు, ఏడు, భూమికలలో నున్న వారిని క్రమముగా బ్రహ్మ విద్వర, బ్రహ్మ విద్వరీయ, బ్రహ్మవిద్వరిష్ఠు లని వ్యవహరించుదురు. సమాధిలోనికి సంకల్ప మాత్రమున వెళ్ళి తిరిగి వచ్చుట పంచమ భూమిక. సమాధిలోనికి స్వేచ్ఛగా వెళ్ళి ఇతరుల సాయముతో తిరిగి జాగృతిలోనికి వచ్చిన అది ఆరవ భూమిక. అట్లు కాక స్వేచ్ఛగా కాని, ఇతరుల సాయముతో కాని జాగృతికి రాకపోవుట ఏడవభూమిక. శేషాద్రి స్వామి ఆరవభూమిక సమాధిలో నుండెను.

చుట్టూ చేరినవారు 'నమః పార్వతీపతయే హరహర మహాదేవ' యని ఉచ్చస్వరమున నమోవాకములు పల్కిరి. స్వామి కనులు తెరచెను. పినతల్లియు, పిన తండ్రియు, 'నాయనా! నీమహిమ తెలియక అపచారము చేసితిమి. నీకేమి కొరతయూ చేయము, నీవు ఇంటికి మరలిన చాలు ననిరి. స్వామి వారిని ఒదార్చి ఇంటికి పంపిరి.

ఆనాటినుండి స్వామిది అత్యుత్తమ ఆధ్యాత్మికస్థితి. అది జీవన్ముక్తస్థితి. స్వామి అందరికిని సొంతమే. పశుపక్షులు సహితము ఆ ప్రేమస్రవంతిలో ఓలలాడినవే. ఆయన పాదధూళి భవబంధములను నిర్మూలింప దగియుండెను.

కావేరిపాకమున స్వామి నెల రోజులుండెను. జనసమర్దం అధికము కానుకాను, స్వామి ఒకరోజు ఎవరికినీ చెప్పక కావేరి పాకము వదలిపోయెను.

రెండు మూడు నెలలు స్వామి ఉన్నచోటు తెలియ లేదు. వందవాసిలో ఉన్నారు, కాదు చెంగల్పట్టులో అన్న వదంతులు పుట్టెను. నిజానిజములు ఎవరికిని తెలియదు. తరువాత స్వామిని కొందరు తిండివనములో చూచిరి. స్వామి మౌనదీక్షలో నుండెను. శివాలయములోని యాగశాలలో ఒకగదిని స్వామికి ఇచ్చిరి. ఒక నెలరోజులు తాను నిష్ఠలో నుందుననియు, గదితలుపులు బీగము వేసుకొని వెళ్ళవచ్చునని స్వామి వ్రాతమూలకముగా తెలిపెను. స్వామిని లోన ఉంచి బీగము వేసిరి. ఐదారురోజులగు సరికి అర్చకునకు దిగులు తోచెను. స్వామి గతించిన, ఆలయమునకు ప్రోక్షణచేయవలసి వచ్చునని అతడు భయపడి తెగించి గది తలుపులు దీసెను. స్వామి తీవ్రనిష్ఠలో నుండెను. సందడికి సమాధినుండి మేల్కాంచి, అర్చకుని కలవరముచూచి, ఆచోటు వదలి తిరు వణ్ణామలైకు బయలు దేరెను. వాలాజామీదుగా వేలూరు, ఆంబూరు, తిరువత్తూరు, జవ్వాజిమలె, కన్నియంబాడి, పోళూరు మొదలగు ఊర్లను చూచుకొని 1888 లో తిరువణ్ణామలై వచ్చి చేరెను. ఇది పంచలింగ క్షేత్రములలో నొకటి. స్మరణ మాత్రమున ముక్తినిచ్చు క్షేత్రమిది. స్వామి తిరిగి తిరిగి అరుణాచలమున స్థిరపడెను.

లలాటే త్రైపుండ్రీ నిటలధృత కస్తూరితిలకః
స్ఫురన్మాలాధారః స్ఫురితకటికౌపీనవసనః।

దధానో దుస్తారం శిరసి ఫణిరాజం శశికలాం
ప్రదీప స్సర్వేషాం అరుణగిరి యోగీ విజయతే॥

ఈశ్లోకం వ్యాసమహర్షి అరుణాచలక్షేత్రము వర్ణిస్తూ వ్రాసినది. అనుదినమూ ఈశ్లోకం పారాయణ చేసియే ముక్తి పొందవచ్చునని స్వామి అనేవారు.

వరుణాది సురారాధ్యాయ తరుణాదిత్య వర్చసే।
అరుణాచలనాథాయ కరుణామూర్తయే నమః॥

అరుణాచల దీపదర్శనం చేసేటప్పుడు పఠించవలసిన శ్లోకం ఇది.

అరుణాచలపదికము వ్రాయుచూ రమణభగవానులు ఇట్లు వ్రాసిరి.

కనితి ప్రాణులలాగికొని కాంతిశిఖర
మనుక్రొత్తదాని దీనినొక మారెంచు
ప్రాణిచేష్ట నణచి వానిలాగికొని
హానికభిముఖముగా నొనరించి
తనవలెయచలముగా నదిచేసిబలి
గొనునా యర్హజీవుని నిది యేమొ
మెలకువమనుడి జీవుల హృదిలోన
అలరు జీవహారి ఘనారుణగిరి యె.

'అసాయస్తామో౹ అరుణ' అని రుద్రాధ్యాయము. 'స్వామీ! ఎన్నో ఊర్లు ఉండగా మీరు అన్నిటినీ వదలి అరుణాచలం ఎందుకు వచ్చిచేరారు?' అని శేషాద్రిస్వామిని అడుగగా, 'ఈ ఊరిలోనే కదా శివశక్తులు మోక్షం మేమిస్తామంటే మేమిస్తామని పంతాలు వేసుకొంటున్నారు. అనిస్వామి బదులిచ్చారట.

అరుణాచలేశ్వరుని ఆలయము వెనుక వేణుగోపాలుని గుడి ఒకటి యున్నది. వంశీమోహనుని వేణుగానలహరిలో చొక్కి అరుణాచలుడు అచలుడైనట్లు ఊహించుటకు అవకాశ మున్నది.

అరుణాచలక్షేత్రమున శేషాద్రిస్వామికి ఒక చోటు లేదు. ఎచట చూచిననూ ఆయనే. విరామము లేనినడక, అనడకలో నిదానముండదు. పరుగులే. రాత్రిళ్ళు నిదురలేదు. అప్పుడూ సంచారమే. సన్నిధి వీధిలో మొదటి ఇల్లు సూర్యనారాయణశాస్త్రి గారిది. ఆయనకు స్వామి వివరములు తెలుసును. కాని స్వామి తిరువణ్ణామలెకు వచ్చినది తెలియదు. ఆవిషయము చెవిని పడగానే వెదకుటకు ప్రారంభించెను, ఒకరోజు స్వామి మండపము వద్ద ఉండగా శాస్త్రి సంధించెను. సమీపమున ఏదుగాడిదలు మేయు చుండెను. స్వామి గాడిదలను తాకి, తాకి కన్నుల కద్దు కొనుచుండెను. "ఏమి? శేషాద్రీ! గాడిదలను కళ్ళకు అద్దు

కొనుచున్నావు' అని శాస్త్రి అడుగగా, 'ఇవి గాడిదలు కావు సప్తఋషులు, ఇది వసిష్ఠుడు. ఇది అగస్త్యుడు' అని స్వామి గాడిదలకు సాగిలబడెను. శాస్త్రి స్వామిని ఇంటికి పిలిచెను. స్వామి శాస్త్రిని పో పో అని అదిలించివేసెను. స్వామిది 'బాలోన్మత్త పిశాచవత్'-స్థితి. కాని ఎవరును ఆయన ఉన్మాదుడని అనుకోలేదు. జ్ఞాని అనియే అనుకొనిరి.

స్వామి పొడుగరియూ కాదు. కురుచయూ కాదు. సాధారణమైన ఎత్తు, ముఖము సంతత దరహాసదీపితము. కన్నులు అర్ధనిమీలితములై దృష్టి ఏవస్తువుపైనను ఉండక ఎక్కడో దవ్వులను చూచిన ట్లుండును.

స్వామికి గుడ్డలపై అమిత ఉదాసీనము. ఒక గుడ్డను మొలకు చుట్టుకొని మరియొకదానిని ఉపవీతమువలె ధరించును అవి దుర్భగములై ధూళిధూసరితములై యుండును. క్రొత్త గుడ్డ లెవరైన ఇచ్చిన అవికూడ మరుసటిక్షణము మురికికూడి యుండును. శౌచమును లెక్కింపడు. ఏచోటైనను సరిగో కూరుచుండును. ఏదైనను తినిన పిదప చేతులను కట్టుకొన్న బట్టలకే తుడుచుకొనును. బిచ్చగాండ్రు యాచించిన తన వస్త్రములను వారికిచ్చి వారి గుడ్డలను తాను ధరించును. దేహాభిమానము లేనివానికి వస్త్రాభిమాన మెక్కడిది ?

స్వామి నడక జంఘాలుని పోలినది. గాలిలో తూలికవలె లఘువుగా నడుచును. నడుచునపుడు శబ్దముండదు.

ఉండుటకు ఒకచోటులేదు. 'అనికేత శ్చరిద్ధ్యః!' ఆయనను వెదకి పట్టుట శ్రమతోడిపని. పదినిమిషములలో పదిచోటులలో నుండును. స్వామి కూరుచుండుట విచిత్రముగానుండును పృష్ఠము నేలమీద ఆనక మోకాళ్ళను మడుచుటచే మడమలపై ఆనియుండును. యోగశాస్త్రము దీనిని స్వస్తి కాసన మనును.

స్వామిమధురభాషి. స్వరము మంద్రము. కాని మాటలలో పూర్వాపర సంబంధముండదు. కొన్ని వేళల అడిగిననూ ఉత్తరముండదు, బదులిచ్చిన రెండుమాటలలో ముక్తసరిగ సరిపుచ్చును. ఎవరైననూ పాడమన్న అంబశివే అని పల్లవిని మాత్రము పాడి నిలిపివేయును. ఇది కామకోటి శాస్త్రి వారిపాట అనిచెప్పును. పాడినది అరనిముసమైననూ శ్రావ్యసుందరమై యొప్పును. కూరుచున్న స్థలమునందే మంచముపైననో, స్తంభము పైననో చేతివ్రేళ్ళతో తాళము వేయును. ఎవరైన సమీపించిన తాళగతిని నిలిపివేయును.

స్వామి యొక విచిత్రప్రకృతి. అరక్షణము ఊరక కూరుచొనడు. ఏదైన వస్తువును భూమిమీద ఉంచిన దానిని వెంటనే తీసుకొనును. మరల క్రిందపెట్టును. మరల తీసికొనును. ఇట్లు పలుమారులు చేయును. తూర్పు ముఖముగా కూరుచుండి వెంటనే పడమటకు తిరుగును. మరల ఉత్తరమునకు తిరిగి చేతులపై ఊని ముందునకు జరుగును.

ఉన్నట్టుండి లేచి ఆకసమువంకకు చూచును. లేనిచో స్తంభ
మును పట్టుకొని ఉన్న పాటునలేచును. చేతులను వెనుక
కట్టుకొని మరొక స్తంభము వద్దకు వెళ్ళి క్రిందా పైనా
చూచును. ఆకాశమువంక చూచుచూ ఏబదిమారులు
తిరుగును. అర చేతులను కన్నుల కద్దుకొనును. లేదా
హఠాత్తుగా ఆశ్చర్య కరమయిన విషయమును చూచినట్లు
పెద్దపెట్టున నవ్వును. అరగంటకుకాని ఆనవ్వుకు అంతముం
డదు. ఏమి నవ్వుచున్నారని అడిగిన బదులుండదు. కొన్ని
సమయములలో పిల్లియో ఉడతయో పరుగెత్తిన దానివెంట
పరుగెత్తును. అది బొరియలో దూరిననూ, చెట్టు ఎక్కిననూ,
ఆచోట అరగంట సేపు స్వామియూ నిలుచుండును. జట్కా
బండి వీథులో పోవుచుండిన చెంగున ఎగిరి దానిలో కూరుచుం
డును. ఎదురుగా మునిసిపాలిటీ కుప్పబండివచ్చిన, జట్కా
నుండి దానిలోకి మారి, 'చూచితివా? కోచి బండి' అని
తమాషా చేయును.

కాఫీ హోటళ్ళు, మిఠాయి అంగళ్ళు, దిన వెచ్చపు
కొట్టము, ఏవైననూ సరే స్వామి నిరాతంకముగా వెళ్ళును.
సామానులను తీసి క్రిందచల్లును. లేదా డబ్బుపెట్టె తెరచి
నాణెములను పేర్చి పిల్లవానివలె ఆడుకొనును. ఏమిచేసిననూ
స్వామిని పల్లెత్తుమాట అనరు. వీథులలో స్వామి కనబడిన
అందరూ నమస్కరింతురు. స్వామియు తనపాదములను తాకి

నమస్కరించుటకు అనుకూలుడై యుండును. వచ్చినవారి గుణశీలములు మంచివి కానిచో ఆచోటునుండి పరుగెత్తును. బలవంతముగా నాను దాపునకు వచ్చిన గూష్టూడా పోపో అని తరిమివేయును. లేదా రాళ్ళెత్తి రువ్వును. అట్లుకాక వచ్చిన వారు మంచివారైనచో వారిని కౌగిలించుకొని మాట లాడును. నఖశిఖపర్యంతము తడివినట్లు చేతులను త్రిప్పును. ఆయనకు స్త్రీ పురుష భేదములేదు. స్త్రీలమీద చేతులు వేసుకొని వారిని త్రోసికొని పోవును. లేదా వారిని కూర్చొనమని, ఒకదాని కొకటి సంబంధము లేని మాట లాడును. మన్నెత్తి వారిచేతులలో పోసి, తన చేతులలోకి తీసుకొనును. వారి ఒడిలో తలపెట్టుకొని పండుకొనును. ఉన్న పాటున వారికి నమస్కరించును. 'నీవు మా అమ్మ కల్యాణివలె ఉన్నావే!' అని అనును, 'కల్యాణీ!, అని వారిని పిలుచును. వారికిని స్వామియందు సంకోచముండదు. ఆయన యందు శిశుభావమే. అందరి ఇండ్లలోనూ స్వామికి స్వేచ్ఛయే.

స్వామికి ఎండలేదు, వానలేదు. ఎప్పుడూ ఒకటేనడక. పిల్లలతో పందెములువేసి పరుగులు తీయును. అపరాహ్ణ సమయములో సూర్యుని చూచుచు నిలుచుండును. లేదా రాత్రిచంద్రునిచూచి నక్షత్రములను వల్లెవేయును. వానవచ్చి నచో స్వామికి పండుగయె. వాననిలిచినకాని స్వామి అరుగు మీదకు రాడు. వర్షము కురిసినంతసేపు వాననీటిలో అభిషే

కమే, వీధులలో నీరు ప్రవహించిన ఆనీటిలో ఎగురుచు, తుమ్ముకుచు పిల్లవానివలె ఆడుకొనును. గుడ్డలను పిండుకొనడు. అవి ఎండువరకు ఆ గుడ్డలనే ధరించును. స్వామి నిర్లిప్తుడు. వాన, గాలి, మంచు, ఎండ, చలి ఏదియు ఆయనను లెక్క-లేదు.

ఏచోట పెళ్ళిజరిగిననూ స్వామి హాజరు. వధూవరుల సమీపమున కూర్చుండి వారినిమాటిమాటికి తాకినవ్వుచుండును. గంధపుగిన్నె తెచ్చిన దోసిలి గంధము తీసుకొని నెత్తిమీద పులుముకొనును. దంపతులు నమస్కరించి ఆశీర్వచనము లడిగిన, 'నూరేండ్లు, నూరేండ్లు' అని ఆచోటునుండి పరు గెత్తును. ఊరేగింపులోనూ స్వామి ఉండవలసినదే. ఎవరి శంటనైనా పీనుగ వెళ్ళిన, అచ్చటా స్వామిహాజరే. ఆశవము నకు ముందు వెళ్ళి దానికి నమస్కరించును. అశౌచము, ఎంగిలి. మైల, మడుగు, ఏదీలేదు.

కొన్ని సమయములలో స్వామికి బలవంతముగ కొందరు తైలాభ్యంగనము వేయుటకద్దు. అదొక ఉత్సవము. టన్నుల కొద్దీ ఆయనకు నూనె తెచ్చి దేహమునకు పూయుదురు. స్వామి మధ్యలో లేచిపోవును. తైలాంజనమేకానీ అభ్యంగన ముండదు. ఆవేషముతో స్వామి పదిరోజులు తిరుగుచుండును, మొదలే స్వామి దేహముపై మురికికి లెక్క-లేదు. ఇక తైలాంజన

ముతో వీథిలోని దుమ్మంతయు స్వామి దేహముపైననే. దేహవిస్మరణలో ఆయనకు ఆయనే సాటి.

తిరువణ్ణామలై వాసులలో రామయ్య ఒకడు. స్వామి అన్నచో అతనికి చాలభక్తి. దాదాపు పదేళ్ళుగా స్వామితో పరిచయము. కానీ స్వామికి మాత్రము రామయ్య నిత్యనూతనుడే. రామయ్య రాగానే స్వామి అతనిని "మీ రెవరూ? మీదే యూరు?" అని ప్రశ్నించును. రామయ్య స్వతంత్రించి పరిచయమును చూపిన - 'ఛీ పోపో' అని స్వామి కసరుకొనిన రామయ్య పిక్కబలము చూపవలసినదే. స్వామి వ్యవహారము ఈ విధముగా నుండును. కాని ఊరివా రందరికి స్వామిపట్ల ప్రేమా, గౌరవమూ. ఆయనను చూచిన కాని వారికి దినము గడువదు.

స్వామి ఒకమారు ముఖముచూచిన ఆగంతుకుని పుట్టు పూర్వోత్తరము లాయనకు తెలిసి పోవును. ఒక్కొక్క మారు చూచీ చూడనట్లుండును. లేదా వారి ప్రచ్ఛన్న పాపములను బయటబెట్టి అవమానము చేసిననూ చేయును. అందుచే జనులు సాధారణముగా ఆయన ముందు వచ్చుటకు భయపడే వారు.

స్వామి ఒకరోజు వీథి తిన్నెమీద కూరుచుని యుండిరి. పొరుగూరునుండి ఐదారుగురు తిరువణ్ణామలైకు వచ్చి వీథిలో పోవుచూ, స్వామిని చూచి దర్శనార్థము దాపునకు వచ్చిరి

స్వామి అందులో ఒకనిని చూచి, హఠాత్తుగా 'మహాపాపి. మహాపాపి. ఏమి ? సొంతకోడలే భార్యయా ?' ఛీ పోపో !' అని మొగము దిప్పికూరుచుండెను. వచ్చినవారు నిర్విణ్ణులైరి. మాపితుడు గిఱ్ఱున తిరిగిపోయెను. తరువాత స్వామి చెప్పినది నిజమే నని తెలిసినది.

స్వామి ఎవరినీ పేరుపెట్టి సాధారణముగా పిలువరు. యోగక్షేమములను విచారించుట ఉండదు. 'కూర్చో రేపు లే' అన్నమాట లేదు. ఉదాసీనముగా నుండును. అపకారి ఉపకారి అన్యవ్యత్యాస ముండదు. ధనికుడూ దరిద్రుడూ సమానులే. 'యస్సర్వత్రానభిస్నేహః' అను గీతావాక్యమునకు స్వామి ప్రతీకము.

వారి ఆహారవిహారములా అంతే–యుక్తాహార విహార ములు వారికి ఏకోశముననూ లేదు. ఆకలిదప్పులు దాదాపు ఆయనకు లేవనే చెప్పవలెను. ఒక నెలరోజులు ఉపవాస ముండును. మరికొన్నివేళల రెండుగంటలసేపు ఐదారుగురు తినగల అన్నమును దినును. ఆహారమునకు నియమమైన వేళ లేదు. ఎవరు ఏది ఇచ్చిననూ తినును. తినునపుడు ముఖమున ఏవిధమైన భావనయూ ఉండదు.

విస్తరివేసి ఎవరైనా వడ్డించిన అన్ని అరువులూ కలిపి ఒకముద్ద చేయును. కొన్ని పిడికెళ్ళు విస్తరికి అటూ ఇటూ చల్లి రెండుమూడు కబళములను మాత్రము నోట వేసు

కొనును. లేనిచో వడనపూర్తి కాగానే లేచి పారిపోవును. "అన్నమును ఎందుకు ఇట్లు చల్లెదరు?" అని ఎవరైనా ప్రశ్నించిన 'యోభూతాః ప్రచర్తని దివానక్తం బలిమిచ్ఛంతో'—బలి వేయక పోయిన రుద్రునకు కోపమువచ్చును. అని బదులిచ్చును. ఒకమారు అరుణాచలయ్యారు ఇంటికి స్వామి వెళ్ళెను. యథాప్రకారము విస్తరి చుట్టూ మెతుకులుచల్లెను. 'ఇది భూతములకు బలి. ఇది దేవతలకు బలి దేవతలకుబలి వేయనిచో వారి కాహార మెట్లు?' అనిఅరుణాచలయ్యారును అడిగెను. 'నాకనులకు కనపడలేదే' అని అయ్యరు. 'చక్కగా చూడు. స్తంభము ప్రక్కనే నిలుచుని వున్నారు' అనిస్వామి. స్వామితిననపుడురుచిని గమనింపరు. ఏదో నిర్బంధముతో వ్యాధి గ్రస్తుడు మందుపుచ్చుకొన్నట్లు ముఖము పెట్టి ఆహరించును. కొందరు స్వామికని కడుశ్రద్ధతో పాలను కాచి తీసుకొని వచ్చుటకద్దు. ఆయన ఏచోటులోను అగపడడు. వెదకుట పెద్దపని. కంబత్తి లయనారు * గుడికి రాత్రి వచ్చును కనుక పాలతో జనులు అచటికి హాజరయ్యేవారు. స్వామి రాగనే వారిని పోపో అని కసరివేయును. ప్రతిమాలి జనులు లోటాలనుఅందింతురు. స్వామి లోటాను తీసుకొని పాలను క్రింద పోయును. లేదా పాలనుచేతితో కలియబెట్టి క్రిందపోయును. లేదా నోట పాలను పోసుకొని పుక్కిలించి ఉమ్మివేయును. క్షీరముతో దంతధావన, ముఖప్రక్షాళనము చేయును. తెచ్చిన పాలకు ఇది వినియోగము. చుట్టూ, ఎనిమిది గంటలైనచో

భైరవ మూర్తులు పోజరు. ప్రతిరోజు శ్వాన సంతర్పణ జరుగును. పాలు కాని పంచామృతముకానీ సరే స్వామికి జిహ్వా చాపల్యము లేదు.

---

* ఇలయనార్ అనగా చిన్నవాడు. కంబత్తిల్ ఇలయనార్ అనగా స్తంభములో కనిపించిన చిన్నవాడు; సుబ్రహ్మణ్యుడు ప్రౌఢ దేవరాయలు విజయనగర సామ్రాజ్యము పాలించు సమయమున అరుణగిరినాధుడన్న సుబ్రమణ్యస్వామి భక్తుడు. అరుణాచలవాసియై యుండెను. తమిళమున ఇతడు వేలకొలది కీర్తనలు పాడెను. వానిని. తిరుప్పుగళులని అందురు. ఇవి త్యాగరాజు కీర్తనలవలె ద్రావిడ భాషలో శాశ్వతగౌరవము కలవి. రాయలకు అరుణగిరి అన్న అభిమానము, భక్తి, సంబంధ అండా అను జైనునికి ఈ సంఖ్యము ఈసుపుట్టించెను. రాజు అరుణగిరిని ఒకరోజు పొగడగా, 'అరుణగిరి అంత మహనీయుడైనచో తనదైవమును నీకు చూపలేడా ?' అని సంబంధుడు ప్రశ్నించెను. రాయలు స్వామిని చూడవలెనని, అరుణగిరిని ప్రార్థించెను. 'నీవు ఐహిక జీవివి. స్వామి దర్శనము నీవు భరింపలేవు' అని అరుణగిరి అనెను. 'కండ్లు పోయిననూ సరే స్వామిని నేను చూడవలసినదే అని' రాయలు పట్టుబట్టెను. అరుణగిరి ప్రార్థనను మన్నించి, ఇలయనార్ కంబమున గోచరించెను. అందుచే క్షేత్రమూర్తి కంబత్తి లయనారయ్యెను.

రామనాథపురం మాణిక్యస్వామి కాలికట్టిన పరదేశి, అతనికి స్వామి అనినచో ప్రేమ. భిక్షమెత్తి భిక్షాన్నమును స్వామికి సమర్పించును. స్వామి ఆహారము తీసుకొన్న కానీ తాను తీసుకొనడు. నాలుగు రోజులు స్వామి కనిపించనిచో మాణిక్యస్వామికి నిరాహారమే. అతనికి ఇదొక వ్రతము. స్వామి కనపడనిచో, భిక్షమెత్తిన అన్నమును భద్రపరచున్నే కాని మరల భిక్షమునకు వెళ్ళడు. ఒకరోజు కంబత్తిలయనారు గుడిలో స్వామి ఉండగా, తాను నాలుగురోజుల క్రితము సేకరించిన అన్నమును స్వామి ముందుంచెను. పాత్రపై మూత తీయగానే గుప్పు మనెను. వాసన, వానిలో క్రిమిసంతతియు కలదు. ఐదారు రోజులుగ నిలువ చేసిన అన్నము. దానిని తాకుటకు కూడ మనస్సు ఒప్పదు. కాని స్వామి మాణిక్య స్వామి భిక్షనంగీకరించి ఆకులో వేసుకొని తినుటకు ప్రారంభించెను. ఇతరులు వద్దన్ననూ వినలేదు. మాణిక్య స్వామినీ తినమని ప్రోత్సహించెను. ముఖము మృష్టాన్నము తినుచున్నట్లుండెను. స్వామి జిహ్వాజయ మట్టిది.

ప్రాణికోటికి నిద్రఅవసరము....కాని అది మితిలో ఉండవలెను. కాయకష్టముచేసిన వారికి, మితిమీరి తినన వారికి నిద్ర అధికము. మితిమీరిన నిద్ర తామసికమే. స్వామి నిద్రాజయము గొప్పది. మధ్యాహ్నమైనను సరే, నడిరేయి ఐననూ సరే. ఆయన నిదురపోడు. అర్ధరాత్రి ఆసనమున కూరు

చుండి సమాధినిష్ఠుడై యుండును. ఎవడైన తూగుచుండెన - 'నిద్రపోకు. యముడు నిన్ను పట్టుకొని పోవును' అని బెదిరించును.

స్వామి అనుగ్రహమున నొకనికి పదివేల రూపాయల నష్టము తప్పెను. తన కృతజ్ఞత చూపుటకు, స్వామికి భూశయ్యతక్క వేరేమియు లేదే యని, ఒక దూది పరుపు తయారుచేసి కంబత్తిలయనారు గుడికి తెచ్చెను. స్వామియు నిరాకరించక దానిని వాడుకొను చుండిరి. ఆ పడక పడుకొనుటకే కాదు-కూర్చొనుటకు కూడ, భోజనమూ దానిమీద నే. వారము రోజులలో ఆపడకలో చేరిన మురికికి అంతు లేదు. గుడికి వచ్చినవారు ఈ శయ్యకుకూడా కలిపి ఒకనమస్కారము పెట్టుదురు. ఈ శయ్యాగాథ 1921 నుండి, 1925 వఱకు జరిగినది.

మధ్యాహ్నము సాధుసత్రము పెరటిలో స్వామి విశ్రాంతి. చీపురు, చేట, బుట్ట, తట్ట, గంప, గడ్డపార ఎక్కడ వక్కడ ఉన్న వానిమధ్య స్వామి సేదతీరును. చుట్టూ ప్రాకుతున్న చీమలకూ స్వామిసొంతమే వానిమధ్య -"అల వైకుంఠపురంబులో నగరిలో ఆమూల సౌధమ్ములో" అనునట్లు స్వామి హాయిగా పండుకొనును.

స్వామిచుట్టూ ఎప్పుడూ జనమే. ప్రాపంచిక విషయములతో అక్కరలేని స్వామి, వీరి బాధ తప్పించుకొనుట

ఒక విచిత్రసంభాషణ సాగించును. ఆ సంభాషణకు ముందు వెనుక లుండవు. అర్థమూ, అన్వయమూ ఉండదు. ఉదాహారణకు :

'వాడెవరు ? వీడెవరు ? సొంతమనుష్యులా మాట్లాడుతున్నారు. కాలమూ గీలమూ ఉంటేమాత్రం ఏమి ? అవసరమా ? అబ్బ అని నిట్టూర్చి, ఇల్లు చక్క బెట్టుకొని ఉద్యోగం చేయనలె. ఊరు చేరితే వివాహమే. గుడీగంటా, కోతికుక్కా అన్నీ ఒకటేనా ? నిద్రపోతే వడలూ, వడియాలూ, బండ్ల బండ్లగా పీనుగలు, దేశాంతరం పోతే గార్దభ మేమి చేయగలదు. స్వామీ ? తెల్లచీరకట్టుకొని సొగసుగా, అక్కా చెల్లెలు మామా మరిదీ, రైలుబండిపోగా తెల్లవాడుకడా చేసినది. బేమాని వదులుతాడా ? ఉస్తికాయ ఉస్తికాయనే కాని ఉద్యోగమాత్రం గొప్ప, రాత్రీ పగలూ కొక్కొరోకో. నూలు వడికితే కాలణా సంపాదన. నూనె రాచుకొని బతులిస్తే వాడు వింటాడా ? వంకాయ, గుమ్మడికాయా, కడపటికి అంగడికే వచ్చింది. పూజా ఉడుక కొట్టినాడు, అరరే దేవ విమానం, విశ్రాంతియూ తీరుబడియూ ? ఏమి చెప్పటం ఏత్రోవా కనబడదు. అభిసారిక కచ్చేరికిపోయి ఔపాసన వేస్తే విధవ ఉయ్యాల లూగుతుందా ? పట్టణాత్తు స్వామి తాయు మానవరు. ఆదిశంకరులు. ఏమి చేసాం ? రేపురా అని చెప్తే బోడిముండ మాటవింటుందా? రావణుడు

సీతను ఎత్తుకొని పోయాడు. వానకురిసి ఆకలెత్తితే తిరుపతి వెంకటాచలపతి ఏడుకొండలపైననే తిష్ఠ బాడుగ బండి రైలుస్టేషనుకు. కుప్పదిబ్బమీద కాపురం. చీపురుకట్టా కోచి బండీ ఇంటికి వస్తుందా? ఆమె ఊరకే వదులుతుందా? నాగతి ఏమి అని అడుగుతుంది. మీరు భోజనము చేస్తు న్నారా? ఎలుకను పిల్లి పట్టుకొంది. రాక్షసీ అని వాడు పిలుస్తున్నాడు. మీ ఇంటిలోనూ అంతేనా? ఎందుకు వినడు స్వామీ? మగవానికి ఆడది కావాలి. ఇక్కడ పదిమంది అక్కడ పదిమంది అక్కడ ఏనుగు వచ్చి నిలిచింది. ఊ ఊ కాశికి పోయినవాడు తిరిగి వస్తే మాత్రం ఏమి? రాముడు ధీరోదాత్తుడు. ఆక్షేపమేమి? అందుచేత తిరునాళ్ళకుపోనక్కర లేదు. కాళిదాసు మహాకవి."

స్వామి సంభాషణ ~~ఈ~~విధంగా సాగేది.

* * *

భగవాన్ రమణమహర్షులు శేషాద్రిస్వాములూ సమ కాలికులు. వయస్సులో శేషాద్రిస్వామి పెద్ద. అపరోక్షాను భూతిలో ఇరువురూ సమానులే. వారికి పరస్పరము గౌరవ భావ మెక్కువ. తరచు అవినాభావ సంబంధముతో వారు మాట్లాడుకొనే వారు. వారిస్థితి అద్వైతస్థితి అందు భేదము నకు తా వెక్కడిది. ?

భక్తులు ఒకప్పుడు ఒక క్రొత్త సోఫాను తెచ్చి రమణులకు సమర్పించారు. దానిని ఉపయోగించవలసినదని ప్రార్థించారు. అందులకు భగవానులు అన్నారట, ఎదురుగా వేసియున్నది సోఫా అనీ, అందులో నేను కూచోవలెననీ, నాకు తెలియదా ఏమి ? దేహమును మరచుటకు నేను శేషాద్రి స్వామినా ?'

లక్ష్మి అమ్మాళ్‌కు రమణులయందు గాఢమైన భక్తి. ఆశ్రమములో పరిచర్య చేసేటపుడుకూడ భగవానులపైననే ధ్యానము. ఆమె శేషాద్రి స్వామిని చూచినదిలేదు. ఒకరోజు ఆయన దర్శనంచేయవలెనని బయలు దేరినది. ఎంత వెదకిననూ స్వామి కనుపించలేదు. ఏడవరోజు స్వామి కనపడ్డారు. రమణులనే ధ్యానించుచూ స్వామి ముందు లక్ష్మి అమ్మాళ్ నిలబడ్డది. అక్కడైతే నేమి? ఇక్కడైతేనేమి ; రెండూ ఒక్కటే అని స్వామి అన్నారట.

ఈ అభేద భావానికి మరొక దృష్టాంతము. సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ఆస్తికులు. వారికి ధ్యానము చేయవలెనని తోచినది. 'పూర్ణాది లేహ్యమును సేవించిన ధ్యానసిద్ధి అగునని అందురే ? దీని నిజమేమి ? అని ఆయన భగవాన్లను ప్రశ్నించెను.' అదేమీ అక్కరలేదు. ఆయోచన కూడ వద్దు అనిభగవాన్లు బదులిచ్చారు. శాస్త్రి ఇంటికి వెళ్ళిన పిదప, భగవానుల హెచ్చరికను లెక్కచేయక లేహ్యం సేవిం

చారు. వెంటనే ఆయనకు విపరీతపు టాలోచనలు మొదలు పెట్టి, తలచుట్టు నారంభించెను. ఆబాధ భరింప రాకుండెను. రాత్రి తొమ్మిది గంటలకు శేషాద్రి స్వామిని చూడవలెనను సంకల్పం కల్గింది. శాస్త్రి స్వామిని అన్వేషిస్తూ ఇలయనారు గుడికిరాగా, అక్కడ ఆయన తన విచిత్ర సంభాషణ చేస్తున్నారు, శాస్త్రిని చూడగానే 'నేను ఆ లేహ్యం తినవద్దని చెప్పానుగదా ? బుది లేక ఎందుకు దానిని తినినావు?' అని అడిగారు. శాస్త్రి, 'రమణులు కదా లేహ్యం తినవద్దన్నారు, పోనీ ఎవరు చెప్పితే ఏమి? మహనీయుల వాక్కులంతా ఒక్కటే' అని సరిబుచ్చుకొన్నారు.

కావ్యకంఠ గణపతిముని సిద్ధకవి. రమణులు సుబ్రహ్మణ్యాం అంశయనీ, గణపతిముని గణపతి అంశయనీ ప్రతీతి గణపతి ముని భగవానులకు శిష్యుడు. బాల్యముననే పంచాక్షరి తారామంత్రము ఆయనకు ఉపదేశమై యుండెను. ఆయన లక్షల కొలది జపము చేసెను. నవద్వీపమందు పండిత సభలో ఆయనకు కావ్యకంఠు డన్న బిరుదు నిచ్చిరి. అచ్చట గణపతి రితి కవికులపతి రలిదక్షో దాక్షిణాత్యోహం' అని దర్పముగా ఆయన సభలో చెప్పుకొనెను. 1903 లో తిరువణ్ణామలెకు వచ్చి రమణులను గురువుగా స్వీకరించి భగవానుల ఉపదేశము లను ఛందోబద్ధముచేసి రమణగీత అను పదునెనిమిది అధ్యాయముల పుస్తకము నొకటి వ్రాసెను. కావ్యకంఠులకు భగవానులు కులదైవమైనచో, శేషాద్రి స్వామి ఇష్టదైవము.

స్వామిని గూర్చి ఆయన తరచు సంభాషించును. పాంగు ఊరు ఎవరైనావచ్చి స్వామిని గూర్చి అడిగిన, "శేషాద్రి స్వామియా? ఆయనకు పిచ్చికదా? ఆ పిచ్చివానిని చూడనేల?" అని అడుగును. అందులకు వారు నొచ్చుకొని స్వామిపక్షమున తీవ్రముగా వాదించిన, వారి భక్తికి మెచ్చు కొని సమాధానపరచును. కుండలినీ ప్రసాదలబ్ధమైన దివ్యశక్తి స్వామికి కలదని గణపతిశాస్త్రి లందురు.

ఒకప్పుడు శాస్త్రిగారు శక్తి తత్వముపై వరుసగా పదిరోజులు ఉపన్యాసమిచ్చిరి. వారికుమారుడు మహాదేవునికి పెళ్ళి నిశ్చయమై యుండెను. కడపటిరోజు ఆయనకు బహూ కృతిగా ఏబది రూపాయలు వసూలుచేసిరి. ఉపన్యాసము జరుగుచుండగా స్వామి హఠాత్తుగా అక్కడకు వచ్చెను. వివరములను ఏవియు తెలుపక, అడబ్బును వారి చేతిలో ఉంచిరి. స్వామీ ఎందులకిది? అని అడుగగా మీ ఇష్ట మొచ్చిన వారికి ఇవ్వండి-అని అన్నారట. వెంటనే గణపతి ముని చేతిలో ఆ పైకమును వేసి స్వామి;

వాగర్థా వివ సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే।
జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ ॥

అని శ్లోకముచదివిరి. దీనిలో మహాదేవుని కల్యాణము సూచితమైనది.

మరొకమారు శాస్త్రి రామస్వామి శాస్త్రిలతో కలిసి 'రమణ సమితి' అన్న సంఘము స్థాపించదలచిరి. ఈవిషయము భగవానులకు తెలుపవలెనని బయలుదేరిరి. దారిలో స్వామి కనబడి—సంఘము స్థాపించ బోవుచున్నారా ? మంచి కార్యమే. అని వారితో అన్నారట ! అరగంటకు ముందు తీర్మానించిన ఈవిషయము స్వామి కెట్లు తెలిసినదని ఆశ్చర్య పడిరి.

స్వామి వత్తురని అంగడి వారందరూ కాచుకొని వుందురు. ఆయన అంగడిలో అడుగు పెట్టిన, ఆ నాడు లాభము ద్విగుణీకృతముగా నుండును. కాని స్వామి చిత్తవృత్తి ఆయనకే ఎఱుక. ఏదో తోచిన అంగడిలోనికి వెళ్ళును. సామానులను దోసిళ్ళతో ఎత్తి క్రిందపోయును. ధాన్యమును క్రింద చల్లును. సాధారణముగా ప్రతి అంగడిలోనూ స్వామి పటముండును. ఆపటమునకు కర్పూరహారతి ఇచ్చినగాని వ్యాపారము ప్రారంభించరు.

ముత్యాలు చెట్టిగారి అంగడికి మాత్రము స్వామి పిలువకనే వెళ్ళెదురు. స్వామికి చెట్టిగారన్న ప్రీతి. చెట్టి గారికి జవిళీ, దినవెచ్చపుకొట్టు – రెండూ కలవు. ఆయన సిబ్బందియూ అధికము. చెట్టిగారికి దైవభక్తి ఎక్కువ. కర్పూరమును మాత్రము చెట్టి తనచేతిక్రిందనే ఉంచుకొని స్వయముగా అమ్మును. కాలణాకర్పూర మడిగిన కాలురూ-

పాయ కర్పూర మిచ్చును. కర్పూరము అరుణాచలుని సన్నిధికి పోవును. అందుచే చెట్టి నష్టమునకే అమ్మును. సిబ్బందిలో కొందరు డబ్బునూ వస్తువులనూ కాజేయుదురు. చెట్టి వారిని మందలించును. కాని పనినుండి తొలగింపడు. చెట్టి అంగడిలో స్వామికి అమిత స్వాతంత్ర్యము. చెట్టిగారి డబ్బు పెట్టె తెరచి నాణెములను క్రిందకుమ్మరించిన చెట్టి ఊరకుండును. స్వామి అనుగ్రహమున వ్యాపారములో చెట్టికి ఏడాది మిది లక్షల లాభము వచ్చినది. ఒకరోజు స్వామి నిండిన నేతిడబ్బాను బయటకు తీసుకొనిపోయి వీథిలో కుమ్మరించి తన దారిని పోయెను. మరుసటిదినము రాదని నిరాశ చేసుకొన్న ఖాతా ఏడువందల రూపాయలు చెట్టిగారికి జమ ఆయెను. మరొకమారు చెట్టి జవిళీ అంగడినుండి వెలగల ఒక పట్టు దుప్పటము స్వామి గ్రహించి దానిని పేలికలు పేలికలుగా చించి ఎచ్చమ్మగారి బజ్జె కొమ్ములకూ కాళ్ళకూ తోకకూ, కట్టెను. ఆరోజు చెట్టిగారికి వ్యాపారమున రెండు వేలరూపాయలు లాభము వచ్చెను.

తిరువణ్ణామలెలో ఒకమామిడి పళ్ళవర్తకుడు వెలకలిగిన నాలుగైదు పండ్లదినుసులను వ్యాపారమునకై కొనితెచ్చెను. ఉదయమున త్రోవలో పోవుచూ స్వామి ఒకపండు నెత్తుకొనెను. దుకాణాదారుడు ఆ సమయమున లేడు. సేవకునికి స్వామిని గుర్తించి తెలియదు. అతడు కోపించి చేతిలోఉన్న

పండును లాగుకొని బుట్టలో పడవేసెను. ఇరుగు పొరుగు వారు చెప్పినను వినలేదు. అంతే మరుసటి దినమునుండే ఆ పళ్ళలో ఒక్కటియు విక్రయము కాలేదు. అన్నీ కుళ్ళినష్ట మాయెను. దుకాణాదారుడు సేవకుని చీవాట్లు వేసెను.

మురుగన్ బండితోలేవాడు. వాని తల్లిపేరు ఉణ్ణామలై. వీథిపై మురుగడు నిద్రపోతూ వుండగా స్వామి అతని ఇంటికి వెళ్ళారు. ఉణ్ణామలై స్వామిని ఆహ్వానించింది. గంజి ఉన్నదా? అని స్వామి ఉణ్ణామలైను అడిగిరి. వెంటనే ఒకలోటా గంజి తెచ్చి ఉణ్ణామలై స్వామి ముందుంచి కొడుకును లేపి ది. మురుగడు 'స్వామీ క్షమించవలె నిద్రపోయాను. అని వచ్చి నమస్కరించెను.

'ఏమి ! బండి తోలడము లేదా ?'

'లేదు. గిరాకీ ఏమీ దొరకడము లేదు'

'ఇంకేం. ఐతే బండినీ ఎద్దునూ అమ్మివేయి' అని స్వామి బయలుదేరినారు.

మరుసటివారము మురుగనికి అదృష్టము తన్నుకొని వచ్చినది. మురుగని దూరపుబంధువు చెన్నపురి చింతాద్రి పేటలో ఉండెను. పదివేల రూపాయల ఆస్తి కలవాడు. ఒక్కతే కూతురు. వేరుసంతతిలేదు. ఆ పిల్లను మురుగనికిచ్చి పెళ్ళిచేసెదనని కబురంపెను. స్వామి చెప్పిన విధముగనే

మురుగడు బండిని ఎద్దునూ అమ్మి చింతాద్రిపేటలో తల్లితో బాటు శ్రీమంతుని ఇల్లరికపు టల్లుడుగా స్థిరపడెను. !

చొక్కలింగము మంగలి. ఈ నాపితునికి స్వామిని చూచిన రోజు పంట. స్వామికి క్షవరము చొక్కలింగమే చేయును. స్వామిక్షవరము చేసుకొనుచూ, ఒకచెంప ఒకవంక మీసము తీయగానే దడాలున లేచి వెళ్ళిపోదురు. ఆ వేష ముతో ఒక పక్షము రోజులు స్వామి వీధులలో పచార్లు చేయును. క్షవరమునకు వలసిన శుల్కము, దుకాణాదారుడు కుప్పుస్వామి యో, చిన్నగురుకులో ఇచ్చుట వాడుక.

ఒకనాడు స్వామి, 'చొక్కలింగమూ ! క్షవరము చేయుదువా ?' అని అడిగిరి. 'సొంతము చేసుకొన్నచో చేసెదను' అని చొక్కలింగ మనెను. స్వామి కట్టుబడి ఆరోజు పూర్తిగా వపనము చేయించుకొనిరి. కానీ ఆరోజు చొక్కలింగమునకు డబ్బు ఇచ్చువారు కనపడలేదు. సాయం త్రము ఇంటికి వెళ్ళుచుండగా స్వామి సేవా ఫలితమో అన్నట్లు చొక్కలింగమునకు ఐదురూపాయల నోటు దొరికినది.

అలుమేలు తిరువణ్ణామలైలో దాసీవృత్తిచేసి జీవిం చేది. స్వామి ఒకనాడు ఇప్పచెట్టుక్రింద సుఖాసీనులై కూరు చుని యుండగా అలుమేలు వెళ్ళి నమస్కరించెను. స్వామి తనముందు పడివుండిన ఎండిన చామంతి పువ్వునుదీసి గణిక

శిరస్సుపై వాసనచూసి వేసెను. ఆవారములో ఒకధనికుని మూలమున ఆగణికకు గొప్ప ధనలాభము కలిగెను.

స్వామికి అన్నివృత్తులూ సమానమే. అందరి ఎడలనూ అనుకంపయే. స్వామిని సేవించిన వారికి, వారి వారి వృత్తులలో ఏదో ఒక విధముగా అభివృద్ధి కలిగేది. స్వామికృపచే చాలమందికి ధనలాభమూ పైపదవులూ కలుగుట సాధారణముగా నుండెను.

దివాన్‌బహదూరు సుందరశెట్టి, 1909–1910 లో తిరువణ్ణామలైలో న్యాయాధికారిగా నుండెను. స్వామివారి యోగసిద్ధినిగూర్చి చెట్టిగారికి తెలిసెను....స్వామిని దర్శించవలెనని ఆయన అనుకొనెను. స్వామి తనంతట చెట్టి ఇంటికి వెళ్ళెను. స్వామిని చూడగనే, తన ఇష్టదైవమే స్వామి రూపమున వచ్చినట్లు చెట్టిగారికి తోచినది. ఆసనమిచ్చి, ఆతిథ్యమును స్వీకరించవలసినదని వేడుకొనిరి. స్వామియు అంగీకరించి విస్తరిముందు కూర్చుండెను. స్వామి యథాప్రకారము మెతుకులను ఇటూ అటూ చల్లి, భోజనము చేసెను. భోజనానంతరము ఒక క్రొత్త పంచను తెచ్చి స్వామికి చెట్టి సమర్పించెను. స్వామి దానిని కట్టుకొని తన వస్త్రమును స్వయముగా చెట్టికి అంగవస్త్రముగా వేసెను. దానిని తీసి మరలవేసి, మరలతీసి మరలవేసెను. తర్వాత చెట్టి ఇంటినుండి బయలుదేరెను.

1927 లో చెట్టి దక్షిణ ఆర్కాటు జిల్లాలో జిల్లాజడ్జీగా పనిచేయుచుండెను. విశ్రాంతి కొరకు కొన్నిరోజులు సెలవుతీసుకొని ఊరికి పోవుచూ తిరువణ్ణామలైకు వచ్చెను. స్వామి వద్దకు నమస్కరించపోగా స్వామి అటు ఇటు పరుగె త్తెను. చెట్టిగారున్నూ స్వామిని వదలలేదు కొంతసేపటికి స్వామి చెట్టిని చేతులు చాచమని చెప్పి, తనచేతులతో గ్రహించి పైకీ క్రిందికి ఎత్తి దింపెను. కొంతసేపు తన విచిత్ర ధోరణిని మాటలాడి బయలుదేరెను.

జడ్జి అంతక్రితమే సేవకుని ఒకనూతన వస్త్రమును తెమ్మని చెప్పిపంపియుండెను. 'అయ్యో! వస్త్రము వచ్చు టకు ముందే స్వామి వెళ్ళిపోయిరికదా! అని చెట్టి విచారించు చుండగా స్వామికి సేవకుడు ఎదురు పడెను. స్వామి స్వయ ముగా సేవకుని వద్దనుండి వస్త్రమును దీసుకొని మెడపై వేసుకొనెను. చెట్టి చూచిసంతోషించెను. తిరువణ్ణామలైనుండి అనుకొనినరీతి చెట్టి విశ్రాంతికై స్వగ్రామమునకు వెళ్ళెను. సెలవుపూర్తి అగులోపల ఆయనను హైకోర్టు జడ్జీ పదవికి నియమించినట్లు వార్త వచ్చెను.

శివప్రకాశము పోలీసు శాఖలో సబ్ ఇన్స్పెక్టరుగా పనిచేయుచుండెను. నెలకు డెబ్బది రూపాయల వేతనము. ఒకనాడు ఏదో పనిమీద అతడు సర్కిల్ ఇన్స్పెక్టరు ఇంటికి బయలుదేరెను. దారిలో స్వామి ఎదురై 'నీకు పదిరూపాయ

లిచ్చెదను తీసుకొందువా ? అని అడిగిరి.' పై అధికారి ఉన్న ఉద్యోగము ఊడబీకకున్న చాలును, హెచ్చు జీతము కూడనా ?' అని ఎదురు ప్రశ్న వేసెను. 'అధికారి ఇచ్చిన ఏమి ? ఇవ్వకున్న నేమి ? నేను ఇచ్చెదను తీసుకో'అని స్వామి అతని టోపీని తనతలపై ఉంచుకొని తన ఉత్తరీయమును అతని మెడపై వేసి ఆవేశముతో ఇరువురూ కలసి సర్కిల్ ఇన్స్పెక్టరు ఇంటికి వెళ్ళిరి.

ఇన్స్పెక్టరు భార్య శివప్రకాశమును చూచి 'మీకు మంచికాలం వచ్చినట్లున్నది. ప్రమోషన్ అవుతుందిలెండి' అని చెప్పినది. దానికి స్వామి నవ్వుచూ, 'ఔను, ఔను' అని తల ఊపిరి. పిదప మొదలియారు వేదాంత విషయముగా స్వామిని ఏదో ప్రశ్నించెను. అంతటితో స్వామి తటాలున లేచి అతని తలపాగను అతని తలమీద ఉంచి, తన ఉత్తరీయమును తీసుకొని-'ఇదో ఇందుకే పోలీసువారి సహవాసం కూడదు అని చెప్పటం. నయవంచకులవలె గ్రుచ్చి గ్రుచ్చి ప్రతివిషయమూ తెలుసుకొంటారు' అని వెళ్ళిపోయెను.

ఆదినమే అతనికి జీతము, 70 రూపాయలనుండి 80రూపాయలకు అధిక మయినట్లు వార్త అందెను. **Dsp**, శివప్రకాశమునకు ప్రమోషను ఇవ్వకూడదని ఉండగా **Asp**, శివప్రకాశము పక్షమున మాట్లాడి **Dsp** ని వేతనాభివృద్ధికి సుముఖముగా ఒనర్చినట్లుతర్వాత తెలిసినది.

వెంకటరామయ్యరు డేనిష్‌మిషను స్కూలులో ఉపా ధ్యాయుడు. ఏకారణముచేతనో పై అధికారులు తాత్కాలిక ముగా అతనిని పనినుండి తొలగించి మూడు మాసముల జీత మును ఇవ్వకుండిరి. అధికారులలో కొందరు అతనిని ఉద్యో గమునుండియే తీసివేయవలెనని పట్టుబట్టియుండిరి. పాపము అతనికి నిత్యగండము, పూర్ణాయుస్సుగ నుండెను. స్వామి భూత నారాయణుని ఆలయమువద్ద ఉండగా, వెంకట్రా మయ్యరు తన పాదరక్షలను వదలి స్వామికి నమస్కరించిరి. నమస్కారముచేసి లేచెనో లేదో, స్వామి అతని పాదరక్షలలో నొకటితీసుకొని వెంకట్రామయ్యరు నెత్తిమీద బలముగా కొట్టిరి. వెంకట్రామయ్యరు ప్రాణములు విలవిలలాడెను.

అన్నీ మంచిదే అని ఆయన తనపాఠశాలకు పోయి చేరగా మేజాపై ఒకకవరు ఉండెను. దానిని చూడగనే వెంకటామయ్యరుకు ముచ్చెమటలు పోసెను. కవరును తెరచు టకు కూడ భయపడెను. ఎటో గుండె ధైర్యము చేసుకొని కవరును చించిచూడగా వెంకట్రామయ్యరును ఆ బడికే హెడ్‌మాష్టరుగా నియమించినట్లు దానిలో ఉండెను. ఉద్యో గమే పోవునని భయపడిన వానికి ప్రమోషను ఆకాశము నుండి ఊడిపడినట్లుండెను. స్వామి తనకు చేసినపాదరక్షపూజ, ప్రధానోద్యోగ పదవి తెచ్చి పెట్టెనని వెంకట్రామయ్యరు నలుగురితో చెప్పుకొనెను.

ఐరావతమయ్యరుకు వేలూరిలో స్కూలు మాష్టరు ఉద్యోగం. ఆయనకు చాలరోజులుగా శ్రీవిద్యాదీక్ష పొంద వలెనని ఆశ. ఒకమారు రమణమహర్షినీ, కావ్యకంఠులనూ దర్శించి వచ్చెదమని ఆయన తిరువణ్ణామలెకు వచ్చెను. అయ్యరు హోటలులో కాఫీ త్రాగుచుండగా స్వామి గబగబ వచ్చి తినుబండారములున్న అలమారు సమీపించి రెండు మూడు మిఠాయి తునకలను తీసుకొని, ఒకటి నోటిలో వేసు కొని మిగత ఐరావతమయ్యరు చేతిలో వేసెను. అయ్యరు అక్కడనే సాగిలబడెను. అచ్చటినుండి కావ్య కంఠులున్న చోటికి పోగా ఆయన ఇంటిలోనే వుండిరి. అదొక శుభసూచ నగా అయ్యరుకుతోచెను. కావ్యకంఠులకు నమస్కరించి లేవగానే, ఆయన స్వయముగా–'నీకు, పంచదశాక్షరి ఉప దేశించెదను. దానివలన నీకు మేలు కల్గును' అనిరి. తన చిర కాలాభిలాష సులభముగా నెరవేరినందులకు శేషాద్రి స్వామి దర్శనమే కారణమని అయ్యరు అనుకొనెను. వేలూరు చేరిన వెనుక ఆయనకు ఒకవారములో వేతనాభివృద్ధియు కల్గెను.

వైష్ణవు లొకరు తిరువణ్ణామలెలో పోలీసు ఇన్స్పెక్టరుగా ఉండిరి. స్వామి అన్నచో చాలభక్తి. ఒకరోజు తనచేతి బెత్తముతో ఎవనినో గద్దించు చుండిరి. స్వామి వెళ్ళి ఆయనచేతిలోని బెత్తమును లాగుకొని దానితో ఇన్స్పెక్టరుగారికే నాలుగు వడ్డించిరి. ఏమి అపచారమో–

అని ఇన్స్పెక్టరు నమస్కరించి దూరముగా నిలుచుండెను. ఇది జరిగిన కొద్దిరోజులకు మైసూరు సంస్థానమున ఆయనకు ఒక పెద్దపదవి లభించెను.

సబ్ మేజస్ట్రీటుగారికి ఒకరికి ఉద్యోగము పోయినది. పై అధికారులకు అప్పీలు చేసుకొని స్వామి దర్శనార్థము ఆయనవచ్చెను. ఏడురోజులైనను స్వామి కనిపించలేదు. ఎనిమిదవరోజు స్వామి శివగంగతీర్థమున ఉండగా మేజస్ట్రీట్ ఆదారిని పోవుచుండెను. ఆయనను చూడగానే స్వామి తన ఉత్తరీయమును నీటిలో తడిపి, తడిగుడ్డను ఆ మేజస్ట్రీటు నెత్తి మీద పిండిరి. మంచి కాలముకనుక మేజస్ట్రీటుకు కోపము రాలేదు. ప్రక్క నున్నవారు ఆయనే స్వామి యని తెల్పిరి. ఆయన స్వామిని అనుగమింప యత్నించెను. కాని స్వామి చిక్కలేదు. మేజస్ట్రీటు ఊరికి తిరిగిపోయెను. రెండు రోజులలో పై అధికారులు ఆయన అప్పీలును ఆమోదించి తిరిగి ఉద్యోగమిచ్చినట్లు వార్త వచ్చెను.

శ్రీ బి. వి. నరసింహస్వామిగారు సేలము నగరములో ఒక పెద్ద న్యాయవాది. ఒకప్పుడు మద్రాసు శాసనసభలో ఆయన సభ్యులుకూడ. దేశ సేవలో కూడ పాల్గొనినారు. ఒకేరోజు వీరు పుత్రులిద్దరు ఆడుకొనుచు ఇంటి వెనుక నున్న నూతిలోపడి మరణించిరి. ఆ నాటినుండి నరసింహస్వామి గారిలో ఒక విచిత్ర పరివర్తన ఏర్పడెను. లౌకిక జీవితముపై

విరక్తి, వైరాగ్యము కలిగెను. ఆయనకు శ్రీరామచంద్ర మూర్తిపై భక్తి, గృహవిషయములలో నిర్లిప్తతుగా నుండెను.

రమణమహర్షులను దర్శించవలెనని కోరికపుట్టి ఆయన తిరువణ్ణామలెకు వచ్చెను. ఒక్కమారు శేషాద్రి స్వామిని కొన్ని క్షణములసేపు చూడగల్గిరి. రమణాశ్రమము కొంత కాలముండి రమణమహర్షి జీవితాంశములను సేకరించి వారి జీవితచరిత్ర వ్రాసెను. హరిద్వారమువరకు ఉత్తర దేశ యాత్రలు సహితము చేసిరి. సాయిబాబ బోధలను సాయి భక్తిని బహుళ ప్రచారము చేసినవారువీరే.

ఒకమారు నరసింహస్వామి తనకు శేషాద్రిస్వామిని దర్శించి కొంతసేపు ఇష్టాగోష్ఠి జరుపవలెనని ఆశగా ఉన్నది అని నారాయణశాస్త్రితో అన్నారట. "మీరు రామభక్తులుకదా రామనామజపం చేయండి. మీకోరిక సిద్ధించక పోదు' అని నారాయణశాస్త్రి అన్నారు. అటుపైన నరసింహ స్వామిని దర్శించే అవకాశం ఏర్పడ్డది. స్వామి మాటలాడు లేదు. కాని, 'పూర్ణమైన భక్తి భగవంతుని యందుంచిన అన్నియు సమకూరును' అన్న భావము సంజ్ఞలచే తెలిపిరట.

టి. వి. సుబ్రహ్మణ్యయ్యరు తిరువణ్ణామలె తాలూకా బోర్డు ఆఫీసులో గుమాస్తా. సూర్యోదయము ముందే లేచి

ఆయన ప్రతిదినము గాయత్రీ జపము చేయును. దైవభక్తి కలవాడు. స్వామి అన్నచో పరమభక్తి. స్వామియు సుబ్రహ్మణ్యయ్యరు ఏదైనా ఇచ్చిన స్వీకరించును. ఒకరోజు అయ్యరు తాలూకా బోర్డుప్రెసిడెంటు ఇంటి అరుగుమీద కూర్చుండి ఏదో పని చూచుకొనుచుండెను. సుబ్రహ్మణ్యయ్యరు చాల రోజులగ కాశీయాత్ర చేయుటకు ఆరునెలల సెలవు ప్రెసిడెంటును అడుగుచుండెను. కాని ప్రెసిడెంటుకు సెలవు ఇచ్చుటకు ఇష్టములేదు. పైగా బోర్డుధనమును కాజేసినందువల్ల అయ్యరు సెలవు అడుగుచున్నాడని అపవాదును కల్పింప నిశ్చయించెను. అంతేకాక అభియోగమును తెచ్చుటకు ప్రయత్నించుచుండెను.

స్వామి ఎచ్చట నుండియో విసవిస నడచివచ్చిరి. 'ఒరేయ్! తిన్నెమీద కుదుచున్నవాడు సాధు బ్రాహ్మణుడు, వానికి అపకారం చేయాలని చూస్తున్నావు. నీవేమైనా అతనికి చేసినావంటే, నీ ఇంట పీనుగు పడును. జాగ్రత్త!' అని హెచ్చరించి వెళ్ళిపోయెను.

స్వామి మాటలు విన్నంతనే ప్రెసిడెంటుకు గుండె లాగి పోయెను. వణుకుపుట్టి ఏడురోజులవరకు జరగ్రస్తుడై వలె మంచముపట్టెను.

కొన్నిరోజులకు స్వామి అయ్యరును చూచి, 'ఈ ఉద్యోగం తప్పిస్తే, వేరే ఉద్యోగం దొరకదా? ఈ ప్రెసి

డెంటు నీకు ఏసహాయమూ చేయడు. వేరే ఉద్యోగము, చూచుకో. వాడు నీకు ఏదైనా అపాయం తలపెట్టితే వాని ఇంటిలో పీనుగు పడుట నిశ్చయం. భయ పడకు పో!' అని అన్నారు. కొంతకాలమునకు అయ్యరు తిరుచినాపల్లిలో మరొక ఉద్యోగములో స్థిరపడెను.

భానుకవి తిరువణ్ణామలైలో ఒక విద్వాంసుడు, కొందరు సారస్వతాభిమానులు అతనిని 'యోగము, యోగి' అను విషయముపై ఉపన్యసింప గోరిరి.

భానుకవికి ముందు ఒకరిద్దరు ఉపన్యసించారు. రాబోయేది భానుకవివంతు. ఆసభకు చిందబరములోని మహామహోపాధ్యాయ దండపాణి దీక్షితులు అధ్యక్షుడు. దీక్షితులు ఏదో చులకనగా ప్రక్కనున్నవారితో 'ఎవ్వరో భానుకవి అట. యోగము యోగినిగూర్చి ఉపన్యసించునట. ఒక యోగము చాలదా? ఇక యోగికూడ ఎందులకు?' అని పరిహాసముగా మాట్లాడెను. ఇదివినగానే భానుకవికి ఉన్నధైర్యముపోయెను. సభలో లేచినిలుచున్నాడేకానీ నోట మాటరాలేదు. కొందరు భానుకవి పాటును చూచి, ఇంటికి వెళ్ళుటకు సన్నాహపడిరి.

ఇంతలో ఎచ్చటనుండియో స్వామివచ్చిరి. స్వామిని చూడగానే భానుకవికి పోయిన ప్రాణములు లేచి వచ్చెను. స్వామి పాదములకు మానసికముగా నమస్కరించి, ఉపన్యాసము మొదలు పెట్టెను. విషయముతో బాటు

భావము, భావముతో పాటు ధార—ఉపన్యాసము శ్రోతలకు రంజకముగా నుండెను. దీక్షితులు భానుకవి ఉపన్యాసధోరణికి ఆశ్చర్యపడెను. సభికుల ఆమోదమును, భానుకవి స్వామి పాదములకు సమర్పించెను.

పరశురామయ్యారు కొమార్తె ప్రసవించినట్లు అపాయ స్థితిలో ఉన్నట్లు, కడపటి చూపులకు రావలసినదని, అల్లుని వద్దనుండి తంతి వచ్చెను. అయ్యారుకు ఏమియు పాలుపోలేదు. స్వామివద్దకు తంతితో పరుగెత్తిరి. స్వామి ఇలయనార్ కోవిలలో నుండిరి. అయ్యారును చూడగానే—'పోపో అపాయ మేమీ లేదు. నీభార్య ఏడుస్తూ ఉన్నదా? భయంలేదని చెప్పు' అని అన్నారట. దానితో అయ్యారు ప్రాణములు కుదుట బడెను. రెండు రోజులతర్వాత అల్లుని వద్దనుండి నెమ్మదిగా ఉన్నట్లు వార్త వచ్చెను.

కృష్ణస్వామి కంట్రాక్టరు, అతని దాపున ఉన్న తిరుకోయిలూరులో కంట్రాక్టుపని. కాని మధురాంతకం అన్న చోటుకు వెళ్ళి ఏదైనా పనిచూచుకొందామని అనుకొని స్వామిని అడిగినాడు. ‚అంతదూర మెందుకు? ఇక్కడ ఉన్నపని చాలదా? చూచుకో' అని అన్నారట. కాని కృష్ణస్వామికి ఆమాటలు రుచించలేదు. అతడు మధురాంతకము వేలూరు మొదలైన ఊరులు తిరిగి కడపటకు తిరువణ్ణామలైకే వచ్చిచేరినాడు. 'ఔను, వానివానికే స్వయంగా అనుభవం ఐతేకాని తెలియదు.' అని స్వామి అన్నారట.

ఒకరోజు కంట్రాక్టు విషయంగా ఉద్యోగులు తనిఖీకి వచ్చి ఏవిధముగా నైనా ఇతనిపనిలో లోపము కనిపెట్ట వలె నని తీర్మానించియుండిరి. కృష్ణస్వామి వీథిలో పోతువుండగా స్వామి - 'పోరాపో నిలువకుండాపో' అని అన్నారట. కృష్ణస్వామి త్వరపడి సకాలములో చేరుకొని అధికారుల ప్రశ్నలకు సరియైన ఉత్తరముల నిచ్చి వారిని మెప్పించ గలిగెను. లేనిచో అతనికి నష్టము కలిగియుండెడిది.

కృష్ణస్వామి శాస్త్రిలు స్వామి దగ్గర బంధువు. అతడు సుబ్రహ్మణ్యస్వామి భక్తుడు. సనాతన ధర్మము పాటించే నిష్ఠగలవాడు, ఒకరోజు స్వామిని దర్శనముచేసుకోగా ఆయన కుంకుమను నొసటపూసి, విభూతిని దేహమంతాపూసి 'కాశీ రామేశ్వర యాత్రలు చేయిపో' అని అన్నారట. 'యాత్రలు చేయడానికి డబ్బులేదు స్వామీ' అని శాస్త్రిలు అనగా 'అంతా దొరుకుతుందిలే పో' అని స్వామి అన్నారు.

తిరిగి వెళ్ళుతూ ఒకచోట నిలిచి మాట వరుసకు స్వామి చెప్పినది ఒకరితో చెప్పగా, అతడు వెంటనే యాత్ర లకు అగు ఖర్చు తాను భరించెదనని ఒక నూరు రూపాయల నోటు కృష్ణ స్వామి చేతిలో ఉంచెను. శాస్త్రి భార్యతో యాత్రలు చేసెను. స్వామిని దర్శించి ఈ మాట చెప్పగా, 'నీవు బాగా ఉంటావు. లే పో-నీకు ధనప్రాప్తి సంతానమూ వున్నది.' అని అన్నారట. ఈ ఆశీర్వచనఫలితముగా కృష్ణ

శాస్త్రికి పుత్రసంతానమూ, ఎప్పుడో కట్టిన లాటరీ చీటీలో మొదటి బహుమానమూ కొంతకాలమునకు కలిగినది.

ఒకరోజు స్వామివీధిలో పోవుచు రెండురాళ్ళను తీసి రోడ్డుకు ఒకప్రక్కగా వేసెను. త్రోవలో పోవుచున్న ఒక పిల్లవాడు ఆరాళ్ళలో ఒకటి ఎత్తుకొన్నాడు. స్వామి వానికొక లెంపకాయ వేయగా వాడు చెంపతడుము కొనుచూ, 'స్వామీ నేను ఈ సంవత్సరము ప్యాసవుతానా?' అని అడిగినాడు. స్వామి నవ్వి - ఖండితముగా ప్యాసవుతావు అని అన్నారట.

వానికి పరీక్షలో సున్నామార్కులు, చదువులలో మందకొడి. కాని అతని ఆర్థికదుస్థితిని చూచి పరీక్షాధికారులు ఆ సంవత్సరము అతనిని పై తరగతిలో వేసిరట.

ఒకప్పుడు సూర్యనారాణయ్యారు అనే ఆయన స్వామి వేపచెట్టు క్రింద ఉండగా వెళ్ళిచూచిరి. 'అందరూ మిమ్ము లను మహనీయులని చెప్పుకొంటారే? మీరు నాకు ఏదైనా ఆశ్చర్యకరమయిన విషయమును చూపి మీ మహత్యమును ప్రకటింపరాదా యని అడిగిరి.' స్వామి క్రిందపడి ఉన్న ఒక వేపాకు రెమ్మను అయ్యరు చేతిలో వేసి తినమన్నారు. అయ్యరు జంకుతూ రెండు ఆకులు నోటిలో వేసుకొని నమలగా అవి తియ్యగా నుండెను. ఆనాటినుండి అయ్యరుకు స్వామియందు నమ్మకము కుదిరెను.

## స్వామి వైద్యమహిమలు

స్వామి ఈ విధముగా తన మహిమలను చూపి, ప్రజలకు దైవమునందు నమ్మకము పుట్టించి వారి బాధలను తొలగించేవారు. వైద్యులు చేయివదలు కొన్న రోగములన్నీ స్వామిచేతిలో చిటుకలో నివారణ అయ్యేవి. అందు మందు కాదు ప్రధానము. వారి అనుగ్రహమే. ఒకొక్కప్పుడు తాను తినుచున్నది వచ్చినవారి చేతిలో బెట్టగా, అదే మందుగా పనిచేసేది. ఒకొక్కొక్కప్పుడు ఆకులు, మూలికలు పేర్లనుచెప్పి వానిని సేవించమనేవారు. ఈ వైద్య కాండలోని అనుభవములు కొన్ని.

తాండ్ర గ్రామములోని కృష్ణస్వామి భార్యకు పాండు రోగము. ఒళ్ళువాచి వాంతులగుచుండెను. వమనములో పురుగులు పడెడివి. ఎందరు వైద్యులకు చూపినను ప్రయోజనము కనపడలేదు. ఈబాధ చూడలేక భార్యను గుఱ్ఱపు బండిలో పిలుచుకొని వచ్చెను. స్వామి ఏదీచూడమని బండి ఎక్కి ఆవ్యాధిగ్రస్తురాలి కాళ్ళను కడుపును గొంతును త్రొక్కుకొనుచు బండి ముందుకు జరిగి, గుఱ్ఱపుబండిని వడి వడిగా సత్రము వఱకు తోలి, దడాలున దుమికి రెండు పిడి కెళ్ళ మన్నును బండిలోనికి విసిరిరి. పిడికెడు మన్ను ఆమె నోటిలో పోసిరి. రెండు పిడికెళ్ళ మన్ను ఇచ్చి మూడు రోజులు వరుసగా ఒంటికి పూసుకొనమనిరి. ఈ చికిత్స చేసిన నాలుగవరోజున ఆమెకు వ్యాధి నిమ్మళించి స్వస్థురాలయ్యెను.

చెంగల్వారాయుడు తిరువణ్ణామలై క్రిమినల్ కోర్టులో ప్లీడరు. కొంతకాలమునకు ఈయన సన్యాసము కూడ పుచ్చుకొన్నాడు. రావుబహాదూరు శివచిదంబరంపిళ్ళై ఈయనకు స్నేహితుడు. పిళ్ళై కుమార్తెకు సన్నిపాతజ్వరము. వైద్యులు బ్రతుకుట కష్టమనిరి. పిళ్ళై చెంగల్వా రాయనితో ఈ విషయం చెప్పుకొన్నాడు. స్వామి ఇలయనార్ గుడిలో ఉండగా చెంగల్వారాయుడు స్వామితో పిళ్ళైకుమార్తె దేహస్థితిని చెప్పి మీరు అనుగ్రహించవలెనని ప్రార్థించెను. స్వామి ఆలయమందున్న మూర్తినిచూపి, "అక్కడ చెప్పుకో, నాతో చెప్పి ఏమిప్రయోజనం?" అని అన్నారు.

వెంటనే చెంగల్వారాయుడు ఒక వెణ్బావృత్తమును (వెణ్బా అనునది ద్రావిడభాష ఛందస్సులో ఒకవృత్తజాతి) నాలుగైదు మార్లు సుబ్రహ్మణ్యేశ్వరుని ముందు పఠించి కర్పూరహారతినిచ్చి స్వామివద్దకు రాగా 'పో పో' 'సాయంత్రం లోపుగా గుణమౌతుంది' అని అన్నారట. ఆరోజుసాయంత్రమే ఎదురుచూడని రీతి ఆ అమ్మాయికు నయమయినది.

మరొక సమయంలో పిళ్లై రెండవ కుమార్తెకు వదలక వాంతులగుచుండెను. స్వామిని అడుగగా ఉసరికకాయ, మిరప కాయలనూ వాడితే నయమౌతుందన్నారు. మూడేళ్ల పసి పాపకు ఈవైద్యం చేయుట ఎట్లు అని ప్రశ్నించగా భస్మము చేసి ఇస్తే సరిపోతుందని స్వామి అన్నారు. ఈచికిత్సతో పిళ్ళై కుమార్తెకు పూర్తిగా నయమయినది.

చెంగల్వారాయనికే ఒకమారు వాయువునొప్పులు వచ్చి కాళ్ళువాచి నడువలేకుండెను. స్వామి అతని కాళ్ళను తడిమి 'సరిపోతుందిలే' అని అన్నారు. సాయంత్రం అయ్యేసరికి కాళ్ళ వాపుతీసి సులభముగా అతడు నడువగల్గెను.

కృష్ణమూర్తి గ్రామమున్సిఫ్. ప్రతిసంవత్సరమూ అతడు గజ్జితో బాధపడేవాడు. ఈగజ్జి ఒకనాటిదికాదు. పదేళ్లుగా ఉంది. స్వామివ్యాధులను అన్నిటినీ తీరుస్తున్నాడు అన్న వార్త విని తిరువణ్ణామలె వచ్చినాడు. అతడు స్వామిని చూచినదిలేదు. హోటలులో అతడు సర్వరును కాఫీ తెమ్మనెను. సర్వరు మేజాపై కాఫీ ఉంచినాడోలేదో, ధూళి ధూసరితుడైన ఒకవ్యక్తి ఆలోటాను లాగుకొని తననోట పోసుకొన్నాడు. కృష్ణమూర్తికి కోపంవచ్చింది. ఎట్లాగో అణచుకొన్నాడు. ఆమనిషి–'గజ్జియా? పాపం చాలబాధ కదూ? కుంకుమపూవు పూయరాదూ? పోతుంది.' అని వెళ్ళి పోయాడు. తర్వాత సర్వరు ఆమనిషి శేషాద్రిస్వామి అని కృష్ణమూర్తితో చెప్పాడు. 'అయ్యో! మనం ఆయనను పూర్తిగా కాఫీత్రాగమనికూడ చెప్పలేదే?' అని కృష్ణమూర్తి నొచ్చుకున్నాడు. కాని ఈచికిత్సతో అతని వ్యాధి శాశ్వతంగా నయమైంది.

సుబ్రహ్మణ్యయ్యరు మరదలుపిల్లకు నిషేకమాది పది సంవత్సరములు ఒక పిశాచము ఆవహించి యుండెను. సంతతి

లేదు. వికారప్రవర్తనలు, అకారణ రోదనము, దేహకార్శ్యము తీర్థయాత్రలు సేవలు చేసిరి. ప్రయోజనము కనుపించలేదు. మంత్రవైద్యులూ చేయి వదులుకొన్నారు. స్వామివద్దకు ఆపిల్లను పిలుచుకొని పోయిరి. స్వామి ఐదారు పసుపుకొమ్ములు తెమ్మని చెప్పి వానిని తనరొమ్మునకు రాచుకొని వానిని ఇచ్చి వానినిరాచి గంధపుపూత ఒంటికి పూయమనిరి. అట్లుచేయగా ఆపిల్ల ఒక పెద్ద గావుకేకపెట్టి. 'ఆకలి, ఆకలి'అని అరచినదట. ఆహారము తీసుకొనిన పిదప ఆపిల్ల స్మృతికి వచ్చెను. ఆనాటి నుండి ఆరోగ్యము కోలుకొని అచిరకాలములో స్వస్థురాలు కాగలిగెను.

ఎచ్చమ్మ రమణభక్తురాలు. ప్రతిరోజూ రమణమహర్షికి ఆహారము పంపుట ఆమె నియమము. ఒకపుడు ఆమెకు ఒకనెల దినములు జ్వరముకాచినది. స్వామి తరచు ఆమె ఇంటికి వెళ్లుటకద్దు. ఆనెలరోజులు స్వామి వెళ్ళనందున ఎచ్చమ్మ పెంపుడుకూతురు చెల్లమ్మ స్వామిని దర్శించి 'అమ్మకు. నాపాపకు ఒళ్ళుబాగాలేదు. అమ్మ మిమ్ములను ఒకమారు రమ్మన్నది' అని చెప్పినది. 'రేపు వస్తానుపో' అన్నారు స్వామి.

మరుసటిరోజు ఉదయం ఆరుగంటలకు స్వామి ఎచ్చమ్మ ఇంటికి వెళ్ళారు. ఎచ్చమ్మ పడకలో ఉన్నది. స్వామి ఎచ్చమ్మా! పెరుగన్నము తింటావా?' అని అడిగి చెల్లమ్మను

పెరుగన్నము చేసి తెమ్మనెను. చెల్లమ్మ పెరుగన్నము తీసు కొని రాగా ఒకకబళము తననోటవేసుకొని మిగిలినది ప్రసాద ముగా నిచ్చెను. ఆనాటినుండి ఎచ్చమ్మకు ఆమె మనుమనికి సుగ్మత తొలుగుటకు ప్రారంభించెను.

ఎచ్చమ్మ మనుమడు రమణునికి కాలుబెణకినది. పిల్ల వాడు లేవకుండెను. వానినెత్తుకొని ఎచ్చమ్మ ఆసుపత్రికి బయల్దేరెను. స్వామి త్రోవలో కనపడి రెండుచేతులతో మన్నుతీసి బాలునికాలుపై పోసి, ఆమట్టినే బాలునినోసట బొట్టుపెట్టిరి. 'ఆసుపత్రికి పోవుచున్నావా? పోపో' అనిరి. ఆసు పత్రిలో డాక్టరు పిల్లవానిని నడువమనగా, ఏబాధయూలేక నడువసాగెను. పిల్లవానికి ఏమీ లేదని డాక్టరు అనగా స్వామి మృచ్చికిత్సతో పిల్లవానికి నయమైనదని ఎచ్చమ్మ గ్రహించెను.

తాలూకాబోర్డు ప్రెసిడెంటు వెంకటసుబ్బయ్య భావమురొ దికి దేనియందును నమ్మకములేదు. మొరటుతనము వితండ వాదము చేసే స్వభావము కలవాడు. స్వామి అనిన భక్తికాని గౌరవముకానీ లేదు. ఒకరోజు మధ్యాహ్నము అతనికి చేతిలో తేలుకుట్టినది. బాధకు కుయ్యోమొర్రో అని ఏడ్చుచుండగా స్వామి ఎచ్చటనుండియో వెంకటసుబ్బయ్య ఇంటికివచ్చిరి. స్వామిని చూడగానే-అందరూ మిమ్ములను 'స్వామి, స్వామి అంటున్నారుకదా? నాబాధ పోగొట్టండి చూద్దాం' అని స్వామిచేతులు పట్టుకొన్నాడు. స్వామి నవ్వుచూ 'సరే. ఎడమ

చేతితో మన్ను తీసి కట్టినచోట పోయి' అని అన్నారు. అతడు మన్ను తీసుకొని 'ఏం మంత్రం చెప్పండి.' అన్నాడు. స్వామి 'శేషాద్రి-అని నాపేరుచెప్పు' అని నవ్వుతూ అన్నారు. అతడట్లు చేయగానే చిత్రముగా అతనిబాధ తగ్గిపోయెను. ఆనాటి నుండి అతనికి స్వామిపై నమ్మకము కుదిరి అత్యంత సన్నిహితుడాయెను.

విషబాధ స్వామి ఇతరులకు తొలగించటమే కాదు. స్వవిషయమునకూడ ఆయన విషజయము కలిగి యుండెను. ఒకపుడు పై చెప్పిన వెంకటసుబ్బయ్యారు అలమారు తెరచి, ఒక సీసా క్లోరోడైన్, మరొకసీసా టించర్ అయోడిన్ ఉండగా వానినెత్తి గుటగుట త్రాగి వేసెను. వెంకటసుబ్బయ్య ఏమగునో యని తత్తరపడుచుండగా మరొక సీసా తెరచి, దానిని నెత్తిమీద పోసుకొని పులుముకొని తనదారిని వెళ్ళిపోయెను. త్రాగిన మందులు వారిని ఏమీచేయజాలక పోయెను.

* * *

## స్వామి జ్ఞానదృష్టి

జ్ఞానదృష్టి అనగా తనసూక్ష్మబుద్ధితో త్రికాలవిషయములను తెలుసుకోగలిగిన ప్రతిభ. దూరదృష్టి, దూరశ్రవణము ఈజాతికి చేరినవే. దివ్యమూలికలు, మంత్రసాధన, యోగాభ్యాసమువలన ఈశక్తి కలుగుతుందని చెప్పుదురు. సూర్యోదయముముందు ఉషోరేఖలు అలముకొని దిశామండలము

ఎట్లు రాగరంజితమగునో, అట్లే ఆత్మసాక్షాత్కారమునకు ప్రాతిపదికగా జ్ఞానదృష్టి కలుగుచున్నది. భగవదుపాసన చేసే వారికి సిద్ధులు అయత్నముగా లభించును. ఋషులు, యోగులు సిద్ధులు అవసరమైన సిద్ధులను నాడుకొందురు.

స్వామికి ఇట్టిసిద్ధులు కైవసము. చిటుకలో ఆయన ఇతరుల చిత్తవృత్తులను ఎరుగును. దేశాంతర లోకాంతర విషయములు, దేవతావిశేషములు ఉన్నపాటున చెప్పును. స్వామి జ్ఞానదృష్టికి సంబంధించిన అనుభవములు కొన్ని.

నారాయణశాస్త్రి, గీతాపారాయణ చేయుచుండగా స్వామివచ్చి, 'గీతాపారాయణమునకు ఏకాగ్రత అవసరమ'నిరి. స్వామికి తాను గీతాపారాయణచేస్తున్నట్లు ఎట్లు తెలిసినది ?

ఒకమారు శాస్త్రిలు నాలుగుకానుల మల్లెపూలుకొని, అరుణాచలేశ్వరునికి, అమ్మవారికి, రమణులకు అర్పించి మిగి లిన దానిని స్వామివారికి ఇవ్వవలెనని సంకల్పించెను. కాని స్వామి మాత్రం కనపడలేదు. తీసిన పూలు తక్కిన మువ్వురికి సమర్పించెను. సాయంత్రము స్వామికనపడి-'కాలణాపూలు అయితే ఏమి? భక్తిప్రధానము' అని అనిరి.

తిరుప్పుగళ్ స్వామి అని ఒకరు ద్రావిడదేశమున ఇటీ వల వరకు ఉండిరి. వారికి విద్యాగంధములేదు. కాని సుబ్రహ్మణ్య భక్తులు. ఆయన తిరుప్పుగళ్ పాడేవారు. శ్రావ్య

మైన కంఠం. వారిపాటలువిన్న, నా సికులూ ఆస్తికులు కావల సినదే. వారు తిరువణ్ణామలై రాగా, స్వామి-'తిరుప్పూగళే మీాకు మంత్రం' అని అన్నారట. స్వామి మరల 'మీాపూర్వులలో కొందరు సన్యాసము తీసుకొన్న వారేకదా?' అని అడిగారు. "ఔను శ్రాద్ధము పెట్టునపుడు 'బ్రహ్మీభూతులైన-అను పద మును వాడుచుంటిని-' అని తిరుప్పూగళ్ స్వామి అనెను. "ఈ మాటతో-నీవూ వారివలె సన్యాసి ఐపో" అన్న ఆదేశము తిరుప్పూగళ్ స్వామికి వినవచ్చెను. తరువాత వారు వళ్ళిమ లైలో స్థిరపడి ప్రఖ్యాతిబడిసిరి.

చెంగల్వరాయులు చిదంబరమున సన్యాసము తీసుకొని జ్ఞానగురువును అన్వేషిస్తూ తిరువణ్ణామలై వచ్చెను. గురు లాభమునకై అతడు సుబ్రహ్మణ్యేశ్వరుని ప్రార్థించుచుండెను. మూడురోజులు ఉపవాసముండి సుబ్రహ్మణ్యుని ఆలయము నకు రాగా, స్వామికనపడి, 'నాయనా! మూడురోజులుగా నీవు భోజనమేచేయలేదా?' అని అడిగిరి. చెంగల్వరాయునికి భావముతో కనులనీరు నిండెను. 'నీవు ఈసుబ్రహ్మణ్యేశ్వరుని వద్దనే ఉండిపో' అని అనిరి. నాటినుండి చెంగల్వరాయనికి స్వామియే సుబ్రహ్మణ్యుడు.

చెంగల్వరాయుడు పూర్వాశ్రమములో న్యాయవాది. సుబ్బరామయ్య అనే పురోహితుని భార్య ఒకపుడు ఏదో విరక్తితో ఆత్మహత్య చేసుకొనుటకు ప్రయత్నించింది. ఊరి

పోసుకొని చూరునుండి (వేలాడుచుండగా ఇరుగుపొరుగువారు ఆమెను రక్షించి చీవాట్లు వేశారు. ఈవార్త పోలీసుకు తెలిసి ఆమెపై అభియోగం తెచ్చారు. చెంగల్వరాయుడు ఆమె పక్షంలో వాదించవలసి వచ్చింది. దారిలో ఆమెను చూచి నప్పుడు ఎన్నో ఏండ్లనాటి ఈ పాతసంగతులు అతనికి జ్ఞప్తికి వచ్చింది.

చెంగల్వరాయుడు స్వామి దగ్గరకు వచ్చి నిలువగానే, స్వామి చుట్టు ప్రక్కనున్న వారితో 'ఒక అమ్మాయి ఉరిపోసుకొన్నది కానీ ఆయత్నం ఫలించలేదు. ఉరిలో తగుల్కొన్నప్పుడు కాని ఉరిఅంటే ఏమిటో తెలియలేదు. ఆపిల్లకు కేకలువేస్తే జనమూ పోలీసులూ రాకుండా ఉంటారా? కావలిస్తే ఈ చెంగల్వరాయణ్ణి అడగండి. ఆకథ చెప్పుతాడు' అని అన్నారు.

తాను త్రోవలో అనుకొన్న విషయము స్వామి ఏకరువు పెట్టుతున్నారని చెంగల్వరాయుడు గ్రహించాడు. 'నీది వాలాజాపేట నీపేరు అబ్బాయికదా!' అని స్వామి అడిగారు. తలిదండ్రులు చిన్నతనములో చెంగల్వరాయనికి పెట్టిన ముద్దుపేరు. అబ్బాయి. ఆపేరు ఎప్పుడో వాడుకలో నుండి పోయినది. ఇది స్వామి ప్రతిభకు తార్కాణం.

రాజుశాస్త్రి తన శిష్యులకు శిశుపాలవధ మాఘుకావ్యాలు బోధిస్తున్నారు. ఒకరోజు 'కాయమానము' అన్న

పదము కనపడినది. దానికే గుడారమని అర్థం. దానిని నిఘంటువును చూచి చెప్పవలసినదే. వాడుకలో లేనిమాట అది. శిబిరము, కుటీరము, పటగృహము అనేవి పర్యాయపదములు. రాజుశాస్త్రి పాఠం చెప్పుతుండగా స్వామి వీధిలో వెడుతున్నారు. వేడుకకు రాజుశాస్త్రి "గుడారానికి" ఏదైనా పర్యాయపదం చెప్పండి" అని అడిగారు. స్వామి నిలువనైనా నిలువక-"కాయమానము" అని చెప్పి వెళ్ళారట. తాను తలచిన పదమే స్వామిచెప్పుట శాస్త్రికి వింతగా తోచినది.

ఒకరోజు పెరుమాళ్ళస్వామి స్నానంచేస్తూ "ములై పాల్" తీర్థముగట్టులో తన విభూతిసంచీ, అందులోని డబ్బూ పెట్టి మరచిపోయినాడు. స్నానమైన వెనుక ఊరిలోనికి వస్తూ స్వామినిచూచి, "స్వామీ! అంగడిలో ఏవైన భక్ష్యములు కొనిఇస్తాను రండి" అని అన్నారు. స్వామి కొంతదూరం అతనితో పోయి, "నీదగ్గర డబ్బెక్కడ? ములై పాల్ తీర్థంపో" అని వెళ్ళిపోయారట. అప్పటికిగాని పెరుమాళ్ళస్వామికి తన విభూతిసంచి జ్ఞాపకం రాలేదు.

సుబ్రహ్మణ్యం మొదలియారు సేలం వాస్తవ్యులు. వకీలుఉద్యోగం. స్నేహితులతో బంధువులతో స్వామిదర్శనార్థం వచ్చారు. స్వామిని ఎంత వెదకినా కనబడలేదు. సరాకే చేసుకొని పోసి కంచివరకువెళ్ళి తిరిగివచ్చేటపుడు చూద్దామని అందరూ కారుఎక్కి- కాంచీపురం పోయేసంబరంలో ఉన్నారు.

ఎవరూ ఆగమనించని సమయంలో స్వామి అక్కడకు వచ్చి "ఈకారు కంచిపోతుందా?" అని అడిగారు. మొదలికారు నుండిదిగి సపరివారముగా అక్కడే స్వామికి నమస్కరించారట.

టి. కె. సుందరేశమయ్యారు చిన్నతనంలో ఏడవతరగతి చదువుతూ ఇంటి అరుగుపైన లెక్కలు వేసుకొంటూ వున్నాడు. స్వామి "ఏమిచేస్తున్నావు?" అని అడిగారు. "ఇవన్నీ లెక్కలు స్వామీ లెక్కలు మీకు తెలియవు" అని గంభీరంగా అన్నాడు. "ఓహో అట్లనా? జవాబులు చెప్తాను రాసుకో" అని అన్నారు. బాల్యచాపల్యంతో, సుందరేశం మొదటిలెక్కకు ఉత్తరం ఎంత? అని అడిగాడు. "రెండు" అని అన్నారు. "రెండో లెక్కకు? నాలుగున్నర" మూడో లెక్కకు? '634'—ఈవిధంగా జవులిచ్చారు. సుందరేశం గణిత పుస్తకంలో చివరనున్న జవాబులపట్టికలో చూడగా స్వామి చెప్పిన జవాబులు సరిగానుండెను. ఏబడిలోనూ జరుగని విధముగా స్వామికి లెక్కలపరీక్ష సుందరేశంచేత జరిగెను.

ఈ సుందరేశమే పెరిగి పెద్దవాడైనపిదప ఇతనికి సందేహం వచ్చింది. "వర్ణాశ్రమవ్యవస్థ చెడిపోవుచున్నది. కదా? దీనిని రక్షించుటకు ఒక అవతారపురుషుడు పుట్టకూడదా కాని జనులు సమష్టి కర్మను చక్కగా నిర్వర్తిస్తేకదా అట్టి అవతారపురుషుడు రాగలడు? అట్లైనచో ఆసమిష్టికర్మ ఏమి?" అన్న ప్రశ్న లుదయించినవి. కాని సుందరేశమునకు స్వామిని

అనుగ్రహించెనన్న సంకోచము. ఆలయానికి సుందరేశము వెడు తున్నప్పుడు స్వామికనపడ్డారు. "నీసందేహాలు సన్నడుగు నేను చెప్పుతాను. నీవనుకొనే సమిష్టికర్మ యజ్ఞం. ఇక ఆ వతార పురుషుడు పుట్టడానికి చాలకాలం ఉంది" అని అన్నారట.

ఒకమారు ఒక పశువులకాపరి కొండచరియలలో పశు వులను మేపుతున్నాడు. ఆచోటికి చిరుతపులి వచ్చింది. దానిని చూడగానే క్రిందు పైనాచూడక వాడు కాళ్ళకు బుద్ధిచెప్పి నాడు. ఈసంబరములో అతడు రాతిపైనుంచి దుముకడములో కాలికి దెబ్బ తగిలింది. ఏలాగో బ్రతుకుజీవుడా అని ప్రాణ ములు రక్షించుకొని బయటపడ్డాడు. అతడు వీథిలో పోవు చుండగా స్వామి చూచి "నీవు పశువులనుమేపడానికి అడవికి వెడుతావుకదా? అక్కడ చిరుతలూ అవీ ఉండవ్వూ? జాగ్రత. ఐతే ఇవి నిన్ను ఏమీచేయవులే-' అని అన్నారట. నిన్నజరి గిన విషయం స్వామికి ఎట్లా తెలిసిందని ఆశ్చర్యపోయాడు.

జి. నరసింహయ్యరు తనకుమార్తెకు పెళ్ళిచేశారు. స్వామి దంపతులను ఆశీర్వదిస్తే మంచిదని బలవంతపెట్టి బండిలో పిలుచుకొనిపోతూ, నాకు వీరుఏదైనా ఉపదేశం చేయరాదా అని మనస్సులో అనుకొన్నారట. స్వామివెంటనే "నీవు అరుణాచలేశ్వరుని సేవ అన్నివేళలాచేస్తూ ఉండు. గిరి ప్రదక్షిణము ప్రతిమంగళవారమూ చేస్తూరా? అని అన్నారట.

స్వామి తన మనోభావం తెలుసుకొని ఉపదేశమిచ్చినందులకు ఆయన చాల సంతోషించాడు.

ఒకమారు అర్ధనారి అనే ఆయన స్వామి తన అరుగు మీద కూర్చుని ఉండగా స్వామిని ఇట్లే ఒకఫోటోతీసి పూజలో ఉంచుకొంటే బాగాన్నంటుంది. అని అనుకొన్నాడు. స్వామివెంటనే 'నాఫోటో వెంకటసుబ్బయ్య ఇంట్లో ఉంది ఆయనను అడుగు ఒక కాపీ ఇస్తాడు. దానిని ఉంచుకో' అని అన్నారట. అతడు వెంకటసుబ్బయ్యను అడిగి స్వామి ఫోటోను పూజాగృహంలో వుంచుకున్నాడు.

రామభద్రశర్మ సోదరికి పోరుగూరిలో ప్రసవకాలం సమీపించింది, శర్మకు పోదామా వద్దా అని విచికిత్స. స్వామి శర్మనుచూచి 'నీవేమీ దిగులుపడకు. ఈసరికి ప్రసవమై ఉన్నది." అని అన్నారట. శర్మకు సంతోషమూ, ఆశ్చర్యమూ కల్గింది.

తిరువెంకట మొదలియారు మానసికముగా పంచాక్షరీ జపంచేస్తున్నారు. స్వామి ఆయన వీపుతట్టి-'ఈరోజు నీవు పంచాక్షరి జపించవద్దు. రామనామం చేయి' అని అన్నారట,

F. T. పీటర్సు అనే ఆయన పోస్టుమాస్టరు జనరలుగా వుద్యోగం చేసేవాడు. వారిబావగారు ఆరోజుల్లో స్టేషన్ మాస్టరుగా వున్నారు. ఒక పెద్దస్టేషనులో ఒకగుజరాతీ వర్తకుడు రవాణాచేసిన సామాను తప్పిపోయింది. దానికి స్టేషన్

మాస్టరు అజాగ్రత్తయే కారణమని అతడు కోర్టులో కేసు వేశాడు. స్టేషను మాస్టరుకు వ్యతిరేకంగా తీర్పు అయ్యే పక్షంలో ఆయన పదివేల రూపాయలు కట్టవలసిన పరిస్థితి ఏర్పడింది. స్టేషనుమాస్టరు తన ఉద్యోగాన్ని సక్రమంగా నిర్వర్తించినట్లు ఋజువు చేసే రికార్డులను దాఖలా చేశారు. కాని అవి మధ్యలో ఎక్కడో తప్పిపోయి కోర్టువారి చేతికి అందలేదు. ఇందుచేత కోర్టువారికి స్టేషనుమాస్టరుపట్ల మరింత సందేహం వృద్ధికావడానికి కారణమయింది.

ఈ సమయంలో స్వామి విషయం పీటర్సుగారికి తెలిసింది. స్వామినిచూచి ఈకేసు పర్యవసానం ఏమవుతుందో తెలుసుకోసిరమ్మని ఆయన తనదగ్గర పనిచేయుచున్న ఒక ఉద్యోగిని పంపారు. ఆయన తిరువణ్ణామలై వచ్చారు. వారిని చూడగానే స్వామి–'బుస్, బుస్, బుస్, బుస్–గుస్ గుస్ గుస్– కూకూ–'అని రైలుబండి ధ్వనులను అనుకరణం చేసి 'అట్లాపోయింది. ఇట్లాపోయింది ఏమైతే నేం? కడపట దొరికింది.' అని చెప్పి వెళ్ళిపోయారట.

ఆ ఉద్యోగి ఈవిషయం పీటర్సుగారికి తెలియచేస్తూ, రికార్డులు ఈసరికి దొరకి ఉండవలెనని స్వామి చెప్పినట్లు అర్థం ఔతుందని తంతికొట్టారట. అదే సమయానికి తప్పిపోయిన రికార్డులు దొరికినవని మరొకతంతికూడ పీటర్సుగారికి అందినది. స్టేషన్‌మాస్టరుపైన కేసు కొట్టివేయబడింది.

జిల్లాజడ్జి సుందరేశయ్యారుకు ఒక కుమార్తె-వివాహము నకు యుక్తవయస్కగా నుండినది. ఆయన వరాన్వేషణ చేస్తున్నారు. తిరుపత్తూరులో సీతారామయ్యా అనే సంపన్న గృహస్థునికి ఒక కుమారు డుండెను. సుందరేశయ్యారు సీతా రామయ్యాను పెళ్ళిచూపులకు పిలిచినాడు. పిల్లను చూచి వయస్సు కొంచెం అధికంగా వున్నందువల్ల తాను అంగీకరింప నని సీతారామయ్యా అన్నాడు. ఈ విషయంలో కొంచెం వాదు లాటజరిగింది. ఆసమయంలో స్వామి అక్కడకు వచ్చారు. అందరూ ఆయనకు నమస్కరించి కాఫీ ఫలహారాలు తెచ్చి పెట్టారు. స్వామి ఉన్నట్టుండి సీతారామయ్యాను చూపి సుంద రేశయ్యారుతో-'నీ అమ్మాయిని వీరింటికి శుభ్రంగా పంప వచ్చును'-అని అన్నారు. స్వామి వాక్కులను త్రోసివేయ లేక సీతారామయ్యాయూ అంగీకరించవలసివచ్చెను.

ముత్తుసామి మొదలియారుభార్య పేరు తాయమ్మ. ఆమె షష్టీవ్రతాలు ఆచరించేది. ఒకరోజు తాయమ్మ పాలు, పండ్లు. పూలు తీసుకొని ఇలిమనాకగుడికి వెళ్ళింది. 'ఓహో! స్వామి కైంకర్యం చేయవచ్చినావా ? నేనే సుబ్రహ్మణ్యుడిని. ఇంకేం అవన్నీ తీసుకొనిరా!' అని పూలను నెత్తికి చుట్టుకొని, పండ్లను చుట్టూ ఉన్న పిల్లలకు పంచిపెట్టి, పాలను సగం త్రాగి, సగం ఆలోటాలోనే వుంచి ప్రసాదంగా ఇచ్చివేశారు. కలియుగంలో సుబ్రహ్మణ్యుడు ప్రత్యక్షదైవమని ప్రతీతి. ఆమె అదృష్టమే అదృష్టం.

కాని తాయమ్మకు తాను తీసుకొనిపోయిన పూజా ద్రవ్యములు స్వామి తీసుకోవడం కానీ, ఆయన ఉచ్ఛిష్టమును తాను స్వీకరించడం కానీ మనస్కరించలేదు. ఇంటికి వెళ్లి ఆపాలను క్రిందపోసి, ఆపాత్రనుకూడ వాడుకొనక ఒకమూల పెట్టినది - మరుసటిరోజు స్వామినిచూడటానికి వెళ్ళినపుడు- తాయమ్మను చూడగానే-'పోపోగాడిదా! నీకు చాలమడుగు కదూ? ఆచారం కదూ? పాలను పారబోసి పాత్రనుకూడ ఆవల కు పెట్టినావు 'పోపో' అని కసురుకొని ఒకరాతి నెత్తికొని అంద లించినారట. ఆరునెలలవరకు స్వామి ప్రసన్నుడు కాలేదు. తరువాత పూర్వం వలెనే వాత్సల్యం చూపేవారు.

## స్వామి అతీంద్రియశక్తి

స్వామివారికి అతీంద్రియశక్తులుండుట అందరికీ తెలిసిన విషయమే. ఈలోకమందు జరిగేవేకాక పరలోకమందు జరిగే విషయాలను, స్వాప్నిక విషయాలనూ ఆయన గ్రహించే వారని కొన్ని దృష్టాంతాలు ఈక్రింద ఇవ్వబడును.

సుబ్రహ్మణ్యయ్యరు బంధువు ఒకాయన, తనపిల్ల వాడు ఇల్లువిడచి పరుగెత్తి పోయాడనీ అతడు తిరువణ్ణా మలెకు వచ్చినాడనీ, వాడు కనపడితే వానిని వెంటనే తనవద్దకు పంపమని ఒక ఉత్తరం వ్రాశాడు. ఆపిల్లవానిని సుబ్రహ్మణ్య య్యరు ఏదో విధంగా తిరువణ్ణామలెలో కనిపెట్టారు. అతనిని పిలుచుకొని స్వామివద్దకు రాగా, 'వీనితండ్రి వీడురాగానే వెంటనే పంపమని నీకు ఉత్తరం వ్రాశాడుకదా? నీవు ఎందుకు ఇంకా వీనిని పంపకున్నావు' అని అడిగారట.

శ్రీరంగం సుందరంపిళ్ళై శ్రీమంతుడు. వివాహంకాగానే తిరువణ్ణామలై వచ్చి కొన్ని రోజులుంటినాడు. అతని భార్యకు దాదాపు పదివేలరూపాయల కిమ్మతుగల నగలున్నవి. అతని నౌకరుకు ఆనగలపైన ఆశ. అతడు నగలను తస్కరించి, ఇంటి వెనుక మురుగుకాలువక్రింద గుప్తంచేసి ఏమీ తెలియని వానివలె మసలినాడు. పిళ్ళై ఏమిచేయటకూ తోచక స్వామి వద్దకు వచ్చాడు. ఆయనతో బాటు దొంగనౌకరుకూడ వచ్చాడు. స్వామి వానినిచూడగానే—' దొంగ వెధవా? నీకు సిగ్గులేదూ? మురుగుకాలువక్రింద పెట్టిన నగలన్నీ ఒక్కటి వదలక తెచ్చి ఇయ్యి' అని అన్నారట. వాడు నేరమును ఒప్పుకొనక బింకము చూపినాడు. పోలీసుల దండోపాయంతో ఆనగలన్నీ స్వయంగా తెచ్చి ఇచ్చినాడు.

ఈసంఘటన జరిగే దానికి ముందు, స్వామి—అతనిని చూచినపుడంతా, 'నీవు చేతికి బంగారుమురుగులు వేసుకో పోతావా? వ్రేళ్ళకు ఉంగరాలు ధరిస్తావా?' అని అడిగే వారట. స్వామిఘోరణి వారికి అప్పుడు అర్థంకాలేదు. తర్వాత ఆనౌకరుచర్య, ఆయనవాక్కును ఋజువు పఱచినది.

తిరువణ్ణామలైకు సమీపంలో శీలైపందిల్ అని ఒక గ్రామం. ఆగ్రామంలో జగదీశయ్యరు అనే ఆయన ఉండేవారు వారి ఇంటిలో దీక్షితులు పూజారి. దీక్షితులంటే అయ్యరుకు గురుభావం. కాని దీక్షితుల సంస్కారం అంత మంచిది కాదు. అయ్యరుపట్ల అతనికి ద్రోహచింతన ఉండేది.

అయ్యరు ఇంటిలో ఎనిమిదిసవరనుల నగ ఒకటి దీక్షితులు దొంగిలించి ఆఊరి గ్రామదేవత ఉన్న ఆవరణంలో దాచిపెట్టినాడు. ఇంట్లోని వారు నగకోసం వెదకి వెదకి నిరాశ చేసుకొన్నారు. ఒకరోజు అయ్యరు తన గుఱ్ఱపుబండిలో తిరువణ్ణామలై వచ్చారు. తిరిగి పోతున్నపుడు, అయ్యరును చూచి స్వామి 'ఈబండిలో నేనురావచ్చునా?' అని అడిగారు. 'దానికేమి? ధారాళంగా రావచ్చును' అని స్వామిని అయ్యరు బండిలో ఎక్కించుకొన్నారు.

బండి పోతూవుండగా అయ్యరు స్వామికి తనఇంటిలో జరిగిన దొంగతనంగూర్చి చెప్పుకొన్నారు. స్వామి 'అందుకే కదా నేను రావటం' అని అన్నారు.

శీలై పందిల్ చేరగానే స్వామి – 'నీఇంటిలోనే దొంగ ఉన్నాడు. ఇంకేం నీకు కుదురుకుంది కదా? నేను వెళ్ళుతాను' అని బయలుదేరారు. 'ఆరుమైళ్ళదూరం మీరు నడువలేరు నేను బండి పంపుతాను.' అని అయ్యరు చెప్పినా వినక స్వామి విసవిస నడిచివెళ్ళిపోయారు.

జగదీశయ్యరు ఇంటికివచ్చి కొంతసేపటికి, ఊరివారు, 'దీక్షితులవాలకం సందేహంగా వుంది, అతనిని గమనించడం మంచిదని' అప్పుడే అతనిని పిలువనంపి తీవ్రంగా ప్రశ్నించేసరికి అతడు తనదోషాన్ని ఒప్పుకొని దొంగలించిన నగలను తెచ్చి ఇచ్చి మన్ననవేడుకొన్నాడు.

తిరువణ్ణామలైలో స్వామివారు దాదాపు నలభై ఏళ్ళు న్నారు. ఈకాలంలో శీత్రై పందిలికి వెళ్ళిరావటం తప్ప, ఆయన తిరువణ్ణామలై ఎల్లవిడచి బయటకు ఎప్పుడూ పోయినది లేదు.

ఇక స్వామివారి అనాగతజ్ఞానమునుగూర్చి మరికొన్ని ఘట్టములు,

అలుమేలు ప్రసవించి కాయిలాలో ఉండగా స్వామి ఆమె మంచముప్రక్క కూర్చుండి ఆమెచేతిని తాకినారట. ఆమె భయపడి కేకలువేసింది. అలుమేలు అన్న నరసింహా రావు వచ్చి స్వామిని దూషించినాడు. స్వామి ఏమీ బదులు చెప్పక వెళ్ళిపోయారు. మరునాడు ఎచ్చమ్మ స్వామినిచూచి 'అలుమేలుకు ఒళ్ళు బాగా లేదటనే! నయమవుతుందా?' అని అడిగెను. స్వామి 'అలుమేలు చనిపోయినదని అందరూ చెప్పు కొంటున్నారే?' అని అన్నారట. ఆరోజు రాత్రియే అలుమేలు గతించింది.

ముత్తుస్వామి మొదలి స్వామికి శిష్యుడు. స్వామిని భక్తితో సేవించేవాడు. అతనిపై అతనిదాయాది ఒక వ్యాజ్యంవేశాడు, 'స్వామీ నాపై వచ్చిన వ్యాజ్యం గతిఏమి?' అని అడిగాడు. 'నీకేమి భయంలేదు. వానికి అనుకూలంకాదు' అని స్వామి అన్నారు. అదేవిధంగా కేసు మొదలిపక్షలోం నెగ్గింది.

దానితో దాయాది హైకోర్టుకు వెళ్ళాడు. మొదలి మరల స్వామివద్దకు వచ్చి, 'కేసు ఇపుడు హైకోర్టుదాకా వెళ్ళింది' అని అన్నాడు. 'ఆ కేసును ఎప్పుడో త్రోసివేశా రయ్యా! నీకు భయం ఎందుకు?' అని అన్నారు స్వామి. హైకోర్టులోకూడ మొదలి పక్షంలోనే నెగ్గింది.

శివప్రకాశం మొదలియారును చూచి ఒకరోజు, స్వామి 'పెద్దమంట అంటుకొన్నది' అని అన్నారు. మొదలికి ఆమాట సరిగా అర్థంకాలేదు. మరుసటిరోజు మొదలికుమార్తె పట్టమ్మ గతించినట్లు వార్త వచ్చింది. పదిరోజులు గడచిన పిదప మొదలి స్వామిని దర్శించారు. 'ఏవస్తువూ మనం సొంతం అని అనుకోడానికి వీలులేదు' అని స్వామి అన్నారట.

శ్యామారావుతల్లి వృద్ధు. అపుడపుడు ఆరోగ్యంలో తొందరలు. శ్యామారావు స్వామినిచూచి 'మా అమ్మ చెల్లి పోతుందా?' అని అడిగారు. "తిరువణ్ణామలెకు టిక్కెట్టు తీసి ఐంది. ఇదే కదా తిరువణ్ణామలె?" అని అన్నారట. శ్యామా రావు 'నాకు అర్థంకావటంలేదు' అని అన్నాడు. స్వామి ఊర కున్నారు.

ఆరోజు సాయంత్రం ఆమె మరణించింది. మరుసటిదినం దహనం ఐంది. శ్యామారావును చూచినపుడు స్వామి 'ఇపుడు అర్థమయినదా?' అని అడిగారట.

సుందరేశయ్యరు ఐదారు రూపాయలు వెలగల రుద్రా క్షమాలలను ధరించి ఒకపుడు స్వామివద్దకు వెళ్ళి నమస్క-

రించారు. మెడలోని మాలను చూచి స్వామి, 'ఈమాలను అమ్మితే నలుగురికి అన్నంపెట్టవచ్చునే?' అని అన్నారు. 'ఇది ఏమంత వెలగల్గినది కాదు. అమ్మితే రెండు మూడురూపాయలుకూడ రావు' అని అయ్యరు బదులిచ్చినారు. మూడు రోజుల పిదప ఆయన తిరుచునాపల్లికి వెళ్ళవలసి వచ్చింది. అక్కడ నదిలో స్నానంచేస్తున్నపుడు మాలజారిపోయి'నదీనాం సాగరోగతిః' ఐనది.

మరొకమారు ఈవిధంగానే దాసికన్నామ్మాళ్ ను స్వామి 'జాగ్రత, దొంగరాబోతున్నాడు. దొంగతనం జరుగుతుంది' అని హెచ్చరించారు. కన్నామ్మాళ్ ఎంతజాగ్రతగా ఉన్నా రెండువందలరూపాయల నగల దొంగతనము ఆమె ఇంటిలో జరిగినది.

మంగళూరు రఘునాధరావు రామభక్తుడు. స్వామియందు విశేషమైన భక్తిగలవాడు. ఒకరోజు స్వామిని దర్శించడానికి వెళ్లగా ఒక పెద్దరాయి తీసుకొని స్వామి అతనిని కొట్టవచ్చెను. రఘునాధరావు చలించలేదు. 'ఇదేమి సేతుబంధనమా? సముద్రలంఘనమా?' అని అన్నాడట. స్వామి రాతిని దూరముగా పారవేసి-''పోపో కోతీ'' అని అన్నారట. ఆరోజునుంచి ఆయనకు రఘునాధరావు అన్నపేరు పోయి హనుమంతరావు, మారుతి అన్నపేర్లు వ్యవహారమయింది. దానికి సార్ధకముగా ఆయనకు ఆంజనేయస్వామిపైన భక్తి మరింత వృద్ధి ఐనది.

రామారావు పోస్టాఫీసులో గుమాస్తా. అతని తమ్ముడు తిరుపతిలో సంస్కృతం అభ్యసిస్తూ వున్నాడు. కానీ చదువు ఎక్కడికాదు. తమ్ముని తిరుపతినుంచి పిలుచుకొని వచ్చి స్వామి వద్దకు పిలుచుకొని పోయాడు. స్వామి ఆపిల్లవానిని చూడగానే-'వీడు ఆరు నెలలలో మృత్యువాత పడుతున్నాడు. ఏమి ప్రయోజనం?' అని అన్నారట. వానికి ఆరు నెలలు తీర లేదు. చనిపోయాడు పాపం.

నటేశయ్యారును చూచి స్వామి అప్పుడప్పుడూ 'నీకు నామం వేసుకొన్నకొడుకు పుట్టిపోతాడు.' అనే వారట. స్వామి చెప్పిన కొన్ని నెలలకు మూడునామములు వేసుకొన్నట్లు నల్లరక్తం ప్రవహించే నాళములతో ఒక కుమారుడు అయ్యారుకు కలిగినాడు.

సుందరశాస్త్రి వైదికనిష్ఠాపరుడు. రామభక్తుడు. స్వామి అతనినిచూచి నీకొక సత్పుత్రుడు పుట్టుతాడు. వదలక లలితాసహస్రనామం పారాయణచేస్తూరా అని అన్నారట. స్వామి అనుగ్రహఫలితంగా శాస్త్రికి స్వామి జన్మనక్షత్రమైన హస్తనక్షత్రంలో పుట్టినాడు. వానికి శాస్త్రి శేషాద్రి అని నామకరణం చేశాడు.

అప్పాచెట్టి అనే ఆయన అరుణాచలేశ్వరునికి ఒకరథం నిర్మించి దాని ఊరేగింపునాడు, స్వామిని ఊరేగింపులో కలసి

కానవలసినదని ప్రార్థించాడు. స్వామి వెంటనే చెట్టితో యిది అల్పాయుష్షుదే. త్వరలో స్వాహా కాబోతుంది. 'దీనికి లక్ష్మి శాపం' అని అన్నారట. చెట్టి ఈమాటలకు ఖేదపడ్డాడు. స్వామి చెప్పినట్లే మూడేళ్ళ పిదప ఒకరోజు పిడుగుపడి ఆరథం కాలిపోయింది. కాలుతున్న రథంచూపి స్వామి, 'చూడు, రథం ఎట్లా కాలుతున్నదో! లక్ష్మి శాపం' అని అన్నారట.

మెయ్యప్ప చెట్టియారు అరుణాచలేశ్వరుని ఆలయంలో విద్యుద్దీపాలను అమర్చినాడు. ప్రారంభోత్సవమునాడు చెట్టి స్వామిని ఆహ్వానించగా—"పోపో. చక్రం తిరుగదు." అని అన్నారట. చెట్టియారు దిగులుపడి ఆలయానికి వెళ్ళితే అక్కడ పనివాళ్ళు విద్యుద్యంత్రాన్ని త్రిప్పలేక ముప్పతిప్పలు పడుతున్నారు. ఇక స్వామిని విడిస్తే గతిలేదు. అని మరలావచ్చి బ్రతిమాలినాడు. స్వామి చెట్టివెంటవచ్చి యంత్రచక్రమును చేతితో తడివి, దానికి సాష్టాంగపడినారట. వెంటనే పెద్ద శబ్దంతో ఆయంత్రం గడగడ పనిచేయడానికి ప్రారంభించింది.

స్వామి ఒకమారు నారాయణశాస్త్రిలను చూచి – 'యేకే చాస్మత్ కులేజాతా' అని పితృదేవతల నుద్దేశించిన శ్లోకం చదివి 'నీవు సంతకు వెళ్ళినావా? నూరుతమ్ముళ్ళు నూరుసహోదరులు అక్కడ నూరు ఇక్కడ నూరు. ఆదేశంలో నూరుమంది జనం అంతాకలిపితే ఏంత?' అని అడిగారు. శాస్త్రికి ఈసంభాషణ అర్థంకాలేదు.

నాలుగు నెలలపిదప శాస్త్రిల ప్రియసహోదరుడు మరణించినాడన్న వార్త వచ్చింది. అప్పటికి కాని అంతరార్థం శాస్త్రికి బోధపడలేదు. ఆశ్లోకం చదటంలో-నీ ఆత్మీయుడు మరణిస్తాడన్న భావం ఇమిడివుంది. నూరుతమ్ముళ్లు-అని అంటే ఆచనిపోయేవాడు నీతమ్ముడు, అని అర్థం. సంతకుపోతావా! అంటే చావుకు సంతవలె జనం కలుస్తారనిఅర్థం. నూరు అనే మాట చాలమార్లు వాడటంలో-లోకంలో ఉన్న వారందరూ సహోదరులే అనీ-ఎన్నో జన్మలలో ఎంతోమంది మనకు సహోదరులని, ఆత్మీయులు పోయినా శోకించడం అజ్ఞానమనీ భావం. "గతాసూ నగతాసూంశ్చ నానుశోచంతి పండితాః" ఔను మరి.

నారాయణశాస్త్రిలు భార్యతో బాటు స్వామిని వెళ్ళి చూచాడు. 'మిమ్ములను ఇరువురినీ చూడాలనుకొంటే మీరు నన్ను త్రోసివేస్తున్నారే?' అని స్వామి అన్నారు. ఈమాట అర్థంకాలేదు. నీవు మళ్ళా పెళ్ళిచేసుకోబోతున్నావా?' అని నారాయణశాస్త్రిని అడిగారు. ఇదిజరిగిన మూడవమాసంలో నారాయణశాస్త్రిలభార్య పాపం గతించినది.

కుమారపిళ్ళై పెళ్ళిచేసుకొని పదేళ్ళకాపురం చేసినాడు సంతతిలేదు. భార్యచనిపోయింది. మళ్ళా రెండోపెళ్ళి చేసుకొన్నాడు. ఆపిల్లకూడ సంవత్సరం దాటక మునుపే చెల్లిపోయింది. పిళ్లై మూడోపెళ్ళి యత్నంలో ఉన్నాడు.

పోళూరులో ఒకపిల్ల, తిరుక్కోయిలూరులో ఒకపిల్లనూ చూచినాడు. పోళూరుఅమ్మాయి అందగత్తె. డబ్బుగలమనిషి. తిరుక్కోయిలూరు పిల్ల బీదది. సాధారణంగా వుంటుంది. పిళ్ళై మనసు పోళూరిపిల్లవైపే మొగ్గింది. కానీ గృహస్థ జీవితం ఇంతవరకు వడిదుడుకులతో నడవడంవల్ల స్వామి సలహా తీసుకొందామని వెళ్లాడు.

"తిరుక్కోయిలూరు కాకినే చేసుకో అది నిన్ను కాపాడుతుంది. పోళూరు చిలుకను చేసుకొన్నావంటే ఎవరో ఒకరు దానిని పట్టుకొనిపోతారు" అని అన్నారట. పిళ్లై తిరుక్కోయిలూరు అమ్మాయినే వివాహంచేసుకొని భార్యతో సుఖంగా కాపురం చేసినాడు.

ఒకరోజు స్వామి వెంకటసుబ్బయ్యరు ఇంటిలో ఉన్న పుదుచ్చేరినుండి ఒక ధనికుడైన కుష్ఠురోగిని అతని స్నేహితులు స్వామివద్దకు తీసుకొనివచ్చారు. ఈవ్యాధికి ఏదైనా మందు చెప్పండి అని ప్రార్థించారు. స్వామి శ్వానగంధిని సేవించిన నయంకావచ్చును అని అన్నారు. శ్వానగంధి ఎక్కడ దొరుకుతుందన్న ప్రశ్నకు గంగానదీ తీరంలో కాశీకి మూడుమైళ్ళ దూరంలో దొరుకుతుందని చెప్పారు. వెంకటసుబ్బయ్యరు వనమూలికలను గూర్చిన గ్రంథము తిరుగవేయగా శ్వానగంధి Avilable near Benares కాశి సమీపములో దొరుకును అన్న వివరణచూచి ఆశ్చర్యపోయాడు.

"శ్వానగంధిని సేవించినన్నూ, సగము మాత్రము కోలుకోగలడు. తక్కినసగము ఇతడు అనుభవించవలసినదే. ఇతడు కర్మి" అని స్వామి తర్వాత అన్నారట.

'మీరు కంచినివదలి తిరువణ్ణామలైలో స్థిరపడితిరికదా? మీకు ఈమూలిక కాశీలో దొరుకుతుందని ఎట్లా తెలుసును? అన్న ప్రశ్నకు స్వామి జవాబుఇవ్వలేదు.

సేలం పోలీసుడిపార్టుమెంటులో శేషాద్రిఅయ్యరు అనే ఆయన ఉద్యోగం చేస్తున్నారు. ప్రప్రథమం ఆయన స్వామికి నమస్కరించగా, 'నీవూ శేషాద్రివి, నేనూ శేషాద్రిని. నీవు రామనామజపం ఎందుకుచేయరాదు?' అని అడిగారట. ఆ రోజునుంచి శేషాద్రి రామనామజపం చేస్తూ వచ్చారు.

శంకరానందస్వామి అనే ఆయన ఒకరు స్వామివద్దకు వచ్చి 'ఈఊరిలో చెట్టియారు కాశీయాత్రికులకు అన్నసదుపాయంచేస్తారటనే నాకొక పదిరోజులకు చీటీలను ఇప్పించండి' అని అడిగారు. 'ఇదో, ఇపుడే చెట్టి రైలుబండిదిగి స్టేషనులో గుఱ్ఱపుబండి ఎక్కినాడు. నీవు ఆయన ఇంటికి వెళ్ళితే ఆయన నీకు చీటీలిస్తారు.' అని అన్నారట.

త్రోవలో శంకరానందం చెట్టి బండిలో ఇంటికి పోవుట చూచినారు. బండివెంట చెట్టి ఇంటికివెళ్లి ఈమాట చెప్పగా చెట్టి పదిరోజులకు బదులు సంవత్సరకాలము శంకరానందమునకు అన్నివసతులను ఏర్పాటు చేసెను.

తిరువెంకట మొదలియారు బంధువుల పెండ్లికి పోగా ఆయనకు మూడు లడ్డులను ఇచ్చిరి. వానిని తెచ్చి ఆయన అల మారులో జాగ్రత్తచేసినాడు. ఇంతలో స్వామి ఇంటికివచ్చి 'నాకు లడ్డు ఇస్తావా?' అని అడిగారు. మొదలి స్వామికి ఏది ఇచ్చిననూ అటూ ఇటూ పారవేయునని ఒక లడ్డుమాత్రం తెచ్చి ఇచ్చినాడు. స్వామి దానిని తీసుకొని, ఏమి? ఒకటే తెచ్చినావు? మిగతా రెండు ఎక్కడ?' అని అడిగారు. మిగిలిన లడ్లనుకూడ మొదలి స్వామిచేతిలో ఉంచెను. అతడు ఎదురు చూచినట్లే స్వామి లడ్లను ఇటూ అటూ పారవేసి వెళ్ళి పోయిరి.

మరొకమారు కొండపైన గుహలో ఉన్న ఒక సాధు వుకు భక్తులు 'మైసూరు పాకు' అనే భక్షణచేసి తెచ్చి ఇచ్చారు. దానిని ఆయన ఒక మూల దాచియుంచెను. ఒక రోజు వాన. స్వామి ఆ వానలో తడుసుకొంటూ గుహకు వెళ్ళి నాడు. 'మీావద్ద మైసూరు పాకు ఉన్నదికదూ? మీాకు అదంటే ఇష్టమూ? నాకు చాలఇష్టం అని అనిరి. ఆసాధువు ఆశ్చర్యపడి లోనికి వెళ్ళి కొన్నిభక్ష్యములు స్వామికిచ్చెను.

జయరామమొదలికి స్వామి అన్నచో ప్రాణమే. సాధా రణముగా ఆయన స్వామికి ఆతిథ్యమిచ్చుటకు యత్నించు చుండును. ఒకరోజు చంద్రగ్రహణము. గ్రహణకాలము పూర్తి అయిన పిదప చాలమంది భక్తులు స్వామికి వివిధము లైన ఆహారములను తెచ్చి బలవంత పెట్టుచుండిరి. మొదలి

రాగానే స్వామి మొదలినిచూచి, 'నీవు కొంచెము అన్నము, చారు, కందపప్పుపచ్చడి పట్టుకొని రా' అని అనిరి. మొదలి ఇంటికివెళ్ళగా అతనిభార్య స్వామికోరిన వంటకములే చిత్రముగా చేసి యుండెను. అతడు ఆశ్చర్యపడి స్వామికి తెచ్చి నివేదించెను.

మొదలిభార్య మరొకమారు ఒకలోటా పాలు తెచ్చి స్వామికి నివేదించెను. స్వామి ఆపాలను త్రాగి 'నీవు ఇంటికి వెళ్ళకు. ఇంట్లో పామువచ్చివుంది. వెళ్ళినావంటే కరుస్తుంది. అని అన్నారు. మొదలిభార్య ఏమీతోచక అక్కడే చతికిల బడ్డది. కొంత సేపయిన పిదప–'ఇప్పుడుపో–పామును చంపివేసినారు.' అని అన్నారు. ఆమె ఇంటికి వెళ్ళగా ఇరుగుపొరుగువారు చచ్చిపడివున్న పామును ఆమెకు చూపారు.

ఒకరోజు జయరామమొదలినిచూచి, 'ఒకమామిడి పండు ఉంటే బాగావుండును' అని అనిరి. 'స్వామీ ఇది కాలంకాదే! మామిడి పండు మందుకుకూడ దొరకదే, పాలు తెచ్చి యిస్తాను త్రాగండి.' అని మొదలి అన్నాడు. 'ఔను కానీ మామిడిపండును తిన్నపిదప పాలుత్రాగితే బాగా వుంటుంది. పోయి వెదకు. వెదకితే దొరకకపోదు.' అని అన్నారు స్వామి. మొదలి పెద్దదుకాణాలన్నీ గాలించినాడు. ఒక అంగడిలో అబ్బురంగా ఒక్క పండుమాత్రం ఉండినది. దానిని కొని పాలతో సహా మొదలి స్వామివద్దకు వచ్చాడు.

ఒకమారు నడివీధిలో స్వామి పడిపడి సాష్టాంగనమ స్కారాలు చేస్తున్నారట. 'స్వామీ ఏమి ఇట్లా నమస్కారాలు చేస్తున్నారు.' అని జనం అడిగినారు. "కంచిలో ఏకామ్రనాథుడు రథం ఎక్కుతున్నాడు. అందుకోసం నమస్కరిస్తున్నా. మీరూ ధారాళంగా ఈశ్వరుణ్ణి సేవించవచ్చును." అని స్వామి బదులుచెప్పారు.

మాణిక్యస్వామిని చూచినప్పు డంతా స్వామి, నిద్ర బోకు. యముడు నిన్ను పట్టుకొనిబోతాడు అని అనేవారు. ఒకరోజు రాత్రి తొమ్మిదిగంటలకే తిన్నెమీద కూరుచుని తూగడానికి ప్రారంభించాడు. కొంతసేపటికి అతనికి ఒక కల వచ్చింది. ఆకలలో యమదూతలు భయంకరాకారములతో అతనికి కనపడ్డారు. వారి యజమాని ఎనుముపై ఎక్కి వస్తున్నాడు. యముడు వారిని పట్టుకో వీరిని పట్టుకో అని పురమాయిస్తున్నాడు. ఇంతలో మాణిక్యస్వామి యముడి కంట్లో పడ్డాడు. "ఈసోమరినికూడ బంధించండి" అని యముడు భటులకు ఆజ్ఞాపించినాడు. అపుడు మాణిక్యస్వామి, ఎక్కడనుంచో వస్తున్న స్వామిని చూశాడు. "స్వామీ! మీ శిష్యుడనుకదా రక్షించండి." అని స్వామి పాదములు మాణిక్యస్వామి పట్టుకొన్నాడు. స్వామి అతని వీపుతట్టి "నీవు భయపడకు" అని ధైర్యంచెప్పారట. ఇంతలో కలమెలకువ అయింది.

అపుడే స్వామివచ్చి అరుగుమీద కూరుచున్నాడు. "ఏమి? మాణిక్యస్వామీ! యమదూతలు చాలభయంకరంగా

ఉన్నారా? పట్టుకొనిపోతా మన్నారా? నిద్రపోవద్దని నేను చెప్పలేదూ? నీవు మాటవినలేకపోవా?" అని మందలించారట. మాణిక్యస్వామి, "స్వామీ! బుద్ధివచ్చింది" అని అన్నాడు. ఆభయంతో పన్నెండుగంటలైన మాణిక్యస్వామి కన్ను మూయలేదు. "ఆ! పన్నెండుగంటలైంది. ఇక నిద్రపో" అని అన్నారు. 'ఊహూ! నేను ఇక నిద్రపోను.' అని మాణిక్య స్వామి నవ్వుతూ మంచిది. నిద్రపోయేముందు, నన్ను స్మరించి విభూతి పూసుకొని పండుకో. యముడు నిన్ను పట్టుకొనిపోడు.' అని అభయవాక్కులు పలికినారట.

చెంగల్వారాయనికి మహాగణపతిపై భక్తి. స్వామివద్దనే చాలసేపు గడిపేవాడు. సెలవుతీసుకొని ఇలయనార్ గుడికి వెళ్ళి పడుకొన్నాడు. అతనికి ఒకకల.

కలలో పెద్దఏనుగు. ఆఏనుగు భూనభోంతరాళమునిండి వున్నది. దానితొండము తాళప్రమాణముగా నున్నది. దాని ప్రక్కన ఒకస్త్రీ మూర్తి. స్వప్నంలోనే చెంగల్వారాయనికి జగన్మాతతో గణపతి దర్శనమిస్తున్నట్లు అనిపించింది. కలలో నుంచి మేల్కొన్నపిదప చెంగల్వారాయుడు ఆనందంలోమునిగి నాడు. మరల నిద్రపోవుటకు అతనికి మనస్కరించక, అట్లాగే కాలంగడిపి ఉదయంకాగానే కాలకృత్యాలను తీర్చుకొని స్వామివద్దకు వెళ్ళాడు. స్వామి అతనిని చూడగానే-'నీవు చూచిన ఏనుగు బ్రహ్మాండంగా ఉందికదూ! తొండం తాటి

చెట్టుఅంత పెద్ద. దానిమహిమ నీకు తెలుసా? అది 'అణోర ణీయాన్ మహతో మహీయాన్' అని అన్నారట. తన స్వప్న వృత్తాంతము స్వామి అంతవిశదంగా చెప్పుట విని చెంగల్వ రాయుడు ఆశ్చర్యపోయాడు.

సబ్ రిజస్ట్రారు సుందరేశం చెట్టికి ఇరువురమ్మాయిలు. జానకి, పార్వతి అని వారిపేర్లు. ఇద్దరూ అవివాహితలు. స్వామివద్దకు వస్తూపోతూ వుండేవారు. ఒకరోజు జానకికి కల. పార్వతీ తనూ శివగంగతీర్థంలో స్నానం చేస్తున్నపుడు పార్వతి జారినీటిలోపడి రెండుమునుకలు వేసినదట. స్వామివచ్చి పార్వతిని గట్టులోనికి లాగివేసిరట. ఇద్దరూ కలిసి ఇంటికి తిరిగివస్తూ ఉండగా త్రోవలో ఒక పెద్దతొండ జానకిని తరు మసాగింది. స్వామి మళ్లావచ్చి తొండను తోలి జానకిని సమా ధానం చేశారు. తెల్లవారిన పిదప జానకి తన కలను పార్వతికి చెప్పింది. ఇరువురూకలిసి స్వామిని చూడడానికి వెళ్ళినపుడు జానకిని చూచి స్వామి-'శివగంగతీర్థం చాలలోతని నీవు పార్వ తిని జాగ్రత్తగా ఉంచవలెనని మందలించలేదా? దానిని పట్టు కోడానికి వచ్చిన యముడు తొండరూపంలో నిన్ను పట్టుకొని పోవాలనిచూచాడు. ఫరవాలేదు. ఇకమీాదట భయంలేదు. అని స్వామి అన్నారట.

ఇందువల్ల తన ఆశ్రితులపట్ల స్వామికి ఎంత అప్రమ త్తతనో, అనుగ్రహమో, రావలసిన అపమృత్యువునుకూడ్చి

వారు ఎట్లు స్వప్నమూలకంగా తెలియచేసి హెచ్చరిక చేసే వారో తెలుస్తున్నది.

ఇంతేకాదు. ఇతరుల స్వప్నములను తెలుసుకోవటం ఇతరులకు అట్టిస్వప్నములను కలిగించడం — వీనితోబాటు సూక్ష్మదృష్టి అనగా భౌతికం కానిరూపాలను, అతీంద్రియ శక్తులతో కనిపెట్టేశక్తి స్వామికి కలదనీ, స్వామి దివ్యదృష్టికి అర్చిరాది మార్గములలో ప్రయాణంచేసే జీవకోటి వృత్తాంతాలూ గోచరించేవనీ ఈక్రింది సన్నివేశములవలన వ్యక్తమవుతున్నది.

## స్వామి అతీంద్రియ శక్తి

చిన్నగురుకులు తల్లి కడువృద్ధ. అతని అత్తగారూ వృద్ధురాలే. పైగా ఆవిడకు కనులు తెలియవు. తల్లి రుజాపీడితయై నేడో రేపో కనులుమూసే స్థితిలో ఉన్నది. తల్లిపేరు మీనమ్మ. అత్తపేరు స్వర్ణాంబ. ఒకరోజు స్వర్ణాంబ భుజములపై ఒరిగి ఉన్నపుడు మీనమ్మ శాశ్వతముగా కనులుమూసినది. దృష్టిలేని స్వర్ణాంబ ఆభారాన్ని అలాగే రెండుమూడు గంటలసేపు మోసుకొని ఉన్నది. మీనమ్మ గతించిన విషయము అంధురాలైన ఆవృద్ధురాలికి తెలియదు.

ఏనిమిషములో మీనమ్మ ప్రాణములను వదలినదో ఆసమయములో స్వామి ఆకాశం చూస్తూ "అదో మీనమ్మ స్వర్గం పోతున్నదే" అని చుట్టుప్రక్కల వారితో అన్నారట.

ఎవరో ఈవార్తను చిన్నగుసగుసలు చెవిలో వేశారు. ఆయన త్వరపడి ఇంటికి వెళ్ళగా, అత్తగారి భుజములపై ప్రాణములు వదలిన తల్లికనపడింది.

ఇట్లే మరొక సమయములో తిరువణ్ణామలై సమీపము లోని ఊరులో "విఠోబా" అనే ఒక పుణ్యాత్ముడు సిద్ధిపొంది నాడు. స్వామి వీధులలో తిరుగుతూ—"అదో విఠోబా పోతు న్నాడే. జోరుగా పోతున్నాడే" అని నాలుగైదుసార్లు గట్టిగా అన్నారట. తర్వాత విఠోబా కాలమయినవిషయం ఊరివారికి తెలిసింది.

స్వామి సూక్ష్మదృష్టికి ఇవన్నీ యధాతథంగా కనిపిం చేవి కాబోలు.

తిరువణ్ణామలైలో ఎండలు ఎక్కువ. వర్షాకాలంలో కూడ ఎక్కువ వానలుండవు. నీటికి కష్టం. వర్షాభావం కల్గి ఎండలు ఎక్కువైనప్పుడు భక్తులు స్వామిని వానకోసం ప్రార్థిం చడం కద్దు. ఒకమారు అర్థనారి అనే శిష్యుడు, "స్వామీ ఎండలు మండిపోతున్నవి. నీళ్లులేక ప్రజలు చచ్చిపోతున్నారు. వానపడితేకానీ దేహమూ, దేశమూ చల్లపడదు. అనుగ్ర హించాలి." అని అన్నాడు. స్వామి పైనచూచి, "ఆకాశం నిర్మలంగా ఉంది. వాన వస్తుందిలే" అని అన్నారట. అన్నారో లేదో, పదినిముషములకు, మబ్బులేసింది. మహావిష్ణువు దేహ చ్ఛాయలను అనుకరించే వలాహకమాలికలు తిరువణ్ణామలైకు,

ఘాతంపట్టినవి. చిటపటమని చినుకులు. పన్నెండుగంటలనుండి మూడుగంటలసేపు అంగదేశంలో దుర్భిక్షం వచ్చినప్పుడు ఋష్యశృంగుని రాకచే వచ్చిన వర్షంవలె వర్షంకురిసింది.

నారాయణస్వామిశాస్త్రిలు 1921లో తిరుచునాపల్లి నుండి తిరువణ్ణామలై పోయి స్వామి దర్శనం చేసుకొంటూ కొంతకాలం అక్కడ ఉండి పోయారు. ఒకరోజు భాగవతం చదువుతున్నారు. స్వామి వచ్చారు. భాగవతం తటాలున తెరచి, పుస్తకం చూడకుండానే, ఒకశ్లోకం చూపి ఈశ్లోకం చదువు అని అన్నారట. చూడగా అది దశమస్కంధం. పంచమాధ్యాయంలో "నందస్వాత్మజ ఉత్పన్నే" అనే మొదటిశ్లోకం సాంప్రదాయంగా ఉపదేశించే శ్లోకం. స్వామితనకు ఉపదేశమిచ్చారని శాస్త్రి సంతోషించారు.

ఆయన తెచ్చుకొన్న డబ్బు ఐపోయింది. తిరుచినాపల్లికి వెళ్ళవలెనంటే టిక్కెట్టుకు కూడ డబ్బులేదు. ఏమిచేసేది తెలియక స్టేషనుకు వెళ్ళారు. అక్కడ మొగమెరుగని ఒకపెద్దమనిషి విల్లుపురమువరకు టిక్కెట్టుతీసి పెట్టారు. విల్లుపురమునుండి టిక్కెట్టులేక ప్రయాణం చేయవలసివచ్చినది. పెట్టెలో కూరుచున్నజనం అంతా దారిలో దిగిపోయారు. స్వామి ఇచ్చిన కొబ్బరికాయ, తనభాగవతము ఉంచిన సంచిని ఎవరో తస్కరించినారు. శాస్త్రి సంచిపోయినందుకు దుఃఖిస్తూ కూరుచున్నారు. ఇంతలో ఎవరో రుద్రాక్షలు విభూతి ధరించిన సాధువు. మంచివర్చస్వి. పెట్టెలో ఎంతోచోటు ఉన్నా

శాస్త్రిప్రక్కనే వచ్చి కూరుచున్నాడు. శాస్త్రిని చూచి, "ఎందుకు ఈవ్యసనం? చిదంబరంలో ఉన్న నటరాజును దర్శిస్తే ఎంత విచారమైనా పారిపోతుంది." అని వీపుతట్టి అన్నారు. శాస్త్రి ఆశ్చర్యపడి, తన సంచీ అందులో స్వామి ఇచ్చిన కొబ్బరికాయ, భాగవతమూ పోయినవిషయం సాధువుతో చెప్పారు.

"అనుగ్రహం భాగవతంలో ఉందా? కొబ్బరికాయలో ఉందా? అది కంటికి తెలియరానిది. మీకు స్వామి అనుగ్రహం ఇచ్చి ఉంటే అది ఉండనే వుంటుంది. అది ఎక్కడికి పోదు." అని చెప్పి మనుసటి స్టేషనులో దిగిపోయాడు. శాస్త్రికి స్వామియే ఆరూపులో వచ్చి తన్ను ఓదార్చినట్లు మనస్సుకు తోచింది. ఇంతలో చిదంబరము వచ్చింది. అక్కడదిగి నటరాజదర్శనం చేసుకొన్నారు. విచార మేఘములన్నీ శాస్త్రి మనోకాశంనుంచీ దూరమైనవి. నటరాజ తాండవసుఖం శాస్త్రి కొన్నిక్షణాలు అనుభవించాడు.

వెంకటాచలమొదలి సుబ్బలక్ష్మి అనే ఇద్దరు దంపతులు. స్వామియందు చాలభక్తి. ఒకరోజు సాయంత్రం స్వామి మొదలి ఇంటికి వెళ్ళెను. మొదలి ఇంటి వెనుక నాలుగైదు చెట్లుండెను. "సుబ్బలక్ష్మి! నీకొక వేడుక చూపిస్తాను రా!" అనిరి. అంతే ఎక్కడినుండియో నూర్లకొలది పక్షులు— చిలుకలు, గోరువంకలు, కోయిలలు, కాకులు—నానాజాతుల

పక్షులు చెట్లపై వచ్చి వాలినవి. స్వామి వానితో ఆడుకోవానికి ప్రారంభించారు. "ఇవన్నీ వానిచోట్లకు పోవనిలేదా? వానిపిల్లలు కాచుకొని ఉండవా?" అని సుబ్బలక్ష్మి ప్రశ్నించింది. "అట్లనా? ఐతేసరి" అని స్వామి ఒక నూలుపోగు తన ఉత్తరీయంనుంచి తీసి విసరి పోపో అని అన్నారట. అంతే. ఎక్కడిపక్షులు అక్కడకు జారుకున్నవి.

సుందరేశంచెట్టి భార్య స్వామిని చూచినపుడంతా, నీవు యమపట్నం చూచినావా? అని అడిగేవారట. 'ఏమైనా మనం చనిపోతామా?' అని ఆమెకు దిగులుతోచింది. మరొకమారు వెళ్ళినపుడు స్వామి అదే ప్రశ్న అడిగినారు. 'లేదు స్వామీ. చూడలేదు' అని బదులు చెప్పింది. 'ఐతే యమపట్నం చూపుతాను చూస్తావా?' అని అడిగారు. ఆమె తలఊపింది. స్వామి ఆమె ఎడమచేతిని గ్రహించి, తన నోరు తెరచి 'ఇదో చూడు' అని అన్నారు. స్వామినోట్లో చెట్టిభార్యకు ఘోర నరకము, వికృతాకారులు, నానావిధములైన రోదనలు, ఒడలుకంపించే దృశ్యాలు కనవిన వచ్చెను. ఇక చూడలేక చెట్టిభార్య మూర్ఛపోయినది. ఐదునిముషములవఱకు స్మృతి రాలేదు. స్వామి తన ఉత్తరీయంతో ఆమె ముఖముపై విసరినారు. ఆమె తర్వాత లేచి ఇంటికిపోయి ఈవిషయం చెప్పింది. అందరూ ఆశ్చర్యపోయారు.

కొన్నిరోజుల తర్వాత మదరాసులో ఒకపెళ్ళికి ఆహ్వానం వచ్చింది. స్వామి ఉత్తరువు తీసుకొని వెడుదామని

స్వామిని అడిగింది. 'నీవు వెళ్ళవద్దు' అని అన్నారు. వెళ్ళ కూడదనే మొదట తీర్మానించు కొన్నది. కాని పెళ్ళికి రెండు మూడు రోజులముందు బంధువులతో మనస్తాపం వస్తుందేమో అని స్వామిమాటత్రోసి మదరాసు వెళ్ళింది. వెళ్ళిన మరు సటి దినమే కలరా తగిలి మరణించింది. యమలోకదర్శనముచే స్వామి ఆమెకు రాబోవు విపత్తును సూచించారు. తిరువణ్ణా మలైలోనే ఉండివుంటే స్వామి రక్షించేవారేమో. విధిబలీయం స్వామిమాట ఆమె చెవికి ఎక్కలేదు.

వెంకటాచలం మొదలి ఒకమారు చెన్నపట్టణం వెళ్ళ వలసివచ్చింది. ఊర్లో అపుడు దొంగలభయం. 'స్వామీ ఐదారురోజులు నేను ఊళ్లోవుండను. ఇంట్లో భార్యవంటరిగా వుంటుంది. మీరు ఆమెక్షేమాన్ని గమనించవలసినది' అని ప్రార్థించినాడు. స్వామి సరే అన్నారు.

ఒకరోజు రాత్రి సుబ్బలక్ష్మితో-'రేపురాత్రి ప్రక్క యింట్లో దొంగతనం జరుగుతుంది. నీవేమీ భయపడవద్దు. నేను తోడుగా ఇక్కడే అరుగుమీద పడుకొంటాను-'అని అన్నారు. ప్రక్క ఇంట్లోని పెద్దమనిషి, తనకున్న బంగారు నంతా కరగించి, మూసపోసి ఆబంగారుకడ్డీని తనతలగడలో దాచి వుంచాడు. ఈకిటుకు తెలిసిన మరొక పెద్దమనిషి దానిని మరుసటిరోజు తస్కరించాడు. దొంగతనము జరిగిన పిదప అతడు లబో దిబో అని ఏడుస్తుంటే-స్వామి 'సుబ్బలక్ష్మి!

చూచినావా? దొంగ రానూ వచ్చాడు పోనూపోయాడు. నీవు దిగులుపడకు. నేను వున్నానుకదా!' అని అభయవాక్కులు పల్కినారట.

ఇది జరిగిన మరుసటిరోజు పదుకొండు గంటలకు రాత్రి స్వామి సుబ్బలక్ష్మి యింటికి వచ్చిరి. ఇంట్లో స్వామి అంటే అందరికీ భక్తి. భక్తి విషయంగా సుబ్బలక్ష్మికూడ ఏవైన ప్రశ్నలు వేస్తూ వుండేది. స్వామి సుబ్బలక్ష్మితో-'నీకు బ్రహ్మ విష్ణుమహేశ్వరులను అమ్మవారిని, ఇంద్రాదిదేవగణాన్ని అందరినీ చూపుతాను. పడుకో'-అని ఆమె ఎదపై తనకుడిచేతి నుంచి-'ఇపుడు చూడు' అని అన్నారట.

ఆమెకు మగతకప్పినది. ఏవో శంఖధ్వనులు, ఘంటా రావములూ వినవచ్చినవి. అమృతప్రవాహము, విద్యుత్కాంతులు, రసమయగోళములు కనపడినవి. వానిమధ్య ఒక తెల్లని ఏనుగు. దానిపై ఒకసుందరాకారుడు. ఇదో చూడు. రుద్రుడు, పార్వతి, విష్ణువు,-అని స్వామి అంటూ ఉన్నారు. ఆమె చూడలేక మూర్ఛపోయింది. వెంటనే స్వామి తనచేయి తీసివేసి, 'ఊ! నీకు చూచేభాగ్యంలేదు. కర్మ క్షయం కాలేదు. బాగా గురకపెట్టి నిద్రపో' అని వెళ్లి పోయారు. ఆరాత్రిఅంతా సుబ్బలక్ష్మికి నిద్రపట్టలేదు. దివ్య దర్శనంతో రెండుకళ్ళుకూ చూపుపోయింది, క్రిందాపైనా పడుతూ, తడుముకొంటూ నడుస్తూ ఉంటే, మరుసటిదినము

11 గంటలకు స్వామి వచ్చి, సుబ్బలక్ష్మిని చూచి 'భయపడకు. నీదృష్టి మరలవస్తుంది.' అని తన ఉత్తరీయముతో ఆమె కండ్లు తుడిచినారు. ఆమెకు పోయినచూపు తిరిగివచ్చింది.

యన్. సుబ్రహ్మణ్యయ్యరు శ్రీవిద్యోపాసకులలో ప్రసిద్ధులు. ఉపాసనా విధులపైన శ్రీవిద్యారహస్యములనుగూర్చి ఆయన ఎన్నో పుస్తకాలను వ్రాశారు. శ్రీనగరవిమర్శ, గురుతత్త్వవిమర్శ అను గ్రంథములు వారివే. మంత్రశాస్త్రములో ఆరితేరిన చేయి. కర్మానుష్ఠానములను అనుసరిస్తూ, శిష్యులకు మార్గదర్శిగా ఉండేవారు. శేషాద్రిస్వామిపై చాలభక్తి.

అయ్యరు ఒకసందర్భములో స్వామిని దర్శించుటకు వచ్చారు. 'రేపు ఉదయం ఇలయనార్ కోవెలకురా' అని స్వామి ఆదేశించారు. బ్రాహ్మముహూర్తంలో అయ్యరు స్వామి దర్శనానికి వెళ్ళారు. అప్పుడొక విశేషం జరిగింది. స్వామిని అయ్యరు చూస్తుండగా, స్వామి వారికి పరాశక్తి రూపంలో దర్శనమిచ్చారట. శ్రీవిద్యోపాసకుడైన అయ్యరుకు బ్రహ్మానందమైనది. స్వామి అప్పుడే వారి కేదో ఉపదేశముకూడ చేసిరట.

నటేశయ్యరు స్వామికి బంధువు. అతని కుమారునకు విషజ్వరమూ దానితోబాటు మసూచియు సోకెను. మసూచితో బాలునికి కనులు గవ్వలవలె పైకిలేచి దృష్టిపోయెను. వైద్యమెంతచేసిననూ ఫలము కనపడలేదు. ఒకరోజు అయ్యరు

స్వామివద్ద మొరపెట్టుకొన్నాడు. 'సరే పిల్లవానిని నావద్దకు తీసుకొనివచ్చి వదలిపో' అని అన్నారట. 'ఇప్పుడే తీసుకొని వస్తాను' అని అయ్యరు బయలుదేరాడు. 'నావద్దకు అనగా ఇక్కడకు కాదు—అమ్మవారి సన్నిధిలో వదలిపెట్టు' అని స్వామి అన్నారు.

అయ్యరు అమ్మవారి ఆలయానికి పిల్లవానిని తీసుకొని వెళ్ళి, అర్చకులతో స్వామిమాటలు చెప్పాడు. అర్చకులు రాత్రి పూజాదికములుకాగానే పిల్లవానిని గర్భగుడిలో వదలి తలుపులుమూసుకొని వెళ్ళిపోయిరి. ఉదయము గర్భగుడి తలుపులు తెరవగానే పిల్లవాని కనులు చిత్రముగా నయమై యుండెను. చాలరోజులు ఊరివారు ఈ అద్భుతమునుగూర్చి చెప్పుకొనుచుండిరి.

వెంకటరామనుకు పదహారేళ్ళు. సంధ్యావందనం పూర్తికాగానే అమ్మవారిగుడికి వెళ్లి దర్శనం చేసుకొనే అలవాటు. గర్భాలయమువద్ద వానికి స్వామి కనపడ్డారు. 'ఎక్కడకు వెడుతున్నావు?' అని స్వామి ప్రశ్న. 'అమ్మవారిదర్శనం కోసం.' 'అమ్మవారిదర్శనం ఇక్కడే చేస్తావా?' 'ఆ. మీరు చూపగల్గితే.' స్వామి వానికడ్డంగా నిలుచుని కండ్లుమూసి, 'ఇపుడు చూడు' అని అన్నారు. వాని మనోనేత్రాలకు అపీత కుచాంబ దర్శనమిచ్చింది. 'అమ్మవారు ఏరంగు చీరకట్టుకొని ఉన్నది.' అని స్వామి ప్రశ్నించారు. 'పసుపుచీర' అని వెంకట

రామను. 'కంఠంలో వున్నది ఏమిమాల' 'మల్లెమాల' 'అమ్మ వారి ఆభరణాలో?' "శిరస్సులో కిరీటం. ఒడిలో వడ్డాణం, కాళ్ళకు గొలుసులు." "ఇక లోపలికి పోయి చూడు" అని స్వామి అన్నారు. ఆపిల్లవాడు లోపలికిపోయి చూచేసరికి, తాను బయట ఏవిధంగా అమ్మవారిని చూచాడో, అదే విధమైన చీరతో, అలంకారాలతో, ఆభరణాలతో, ఆమె వున్నది. వాని ఆశ్చర్యం ఇంతా అంతా కాదు. తన అనుభవాన్ని గర్వంగా స్నేహితులతో చెప్పాలొన్నాడు.

మధురలో ఒకసౌరాష్ట్రి కుటుంబం. వారికి పిల్లలు లేరు. క్షేత్రదేవత మీనాక్షిపై ఆదంపతులకు ఐకాంతిక భక్తి. తమ అనపత్యమును గూర్చి మీనాక్షితో మొరపెట్టుకొన్నారు. ఒకరోజు కలలో మీనాక్షి కనపడి తిరువణ్ణామలై పోయి శేషాద్రిస్వామిని దర్శించండి. అని ఆదేశ మిచ్చింది.

మరుసటిరోజే వారు తిరువణ్ణామలై వచ్చి చేరారు. స్వామికి నమస్కరించి నిలుచున్నారో లేదో, స్వామి—"మిమ్ములను నావద్దకు మీనాక్షి పంపినదా?" అని అడిగారు. వారు చకితులైరి. ఇరువురిని దగ్గరకు పిలిచి కొంగుముళ్ళు వేసి "ఇక పోయి రావచ్చును" అని అన్నారట. వాళ్ళు సెలవుతీసుకొని నాలుగు అడుగులు వేసేసరికి స్వామి వారి దగ్గరకు పోయి కొంగుముళ్ళు విప్పి, "మీ అభీష్టం సిద్ధిస్తుంది. పుత్రప్రాప్తి ఔతుంది" అని అన్నారట. ఇదిజరిగిన సంవత్సరానికి ఆదంప

తులకు ఒక మగపిల్లవాడు పుట్టినాడు. పిల్లవానికి శేషాద్రి అని పేరుపెట్టుకొన్నారు.

పై సంభవములవల్ల, శేషాద్రిస్వామికీ, పరదేవతకూ అభేదమని తెలుస్తున్నది. అందులకే తెలిసిన కాళిదాసు - 'దయమాన దీర్ఘనయనాం దేశికరూపేణ దర్శితాభ్యుదయాం' అని వ్రాసినది. అమ్మగుణనిధియే కాదు, గురుమూర్తి కూడ.

# ఉపదేశములు

ఇంతవఱకు భక్తబృందముల అనుభవములను చూచితిమి. ఇకమీదట స్వామి అప్పుడప్పుడు వారికిచ్చిన ఉపదేశములను అనుశీలనము చేయుదము.

"నహిజ్ఞానేన సదృశం పవిత్ర మిహవిద్యతే" అని గీత. లోకములో ప్రజలకష్టములకు, దుఃఖములకు కారణము అజ్ఞానమే. జ్ఞానలాభము ఉపాసనామూలముగా గల్గును. ఉపాసనా సౌకర్యమునకు పూర్వపుణ్య సంస్కార ముండవలెను. పుణ్య సంస్కారము భగవదనుగ్రహమునకాని లభించదు. ప్రజలు ఇట్లు కార్యకారణచక్రములో చిక్కుకొని తపిస్తూ వుంటారు.

స్వామి ఉత్తమాధికారులకు స్పర్శదీక్ష నిచ్చి అనుగ్రహించుట కద్దు. స్పర్శదీక్ష అనగా గురువు శిష్యుని దేహ భాగము దేనినైనను స్పృశించి శిష్యుని ఆత్మవికాసమునకు అడ్డుపడే ప్రతిబంధకములను తొలగించుట

రామస్వామిశాస్త్రిలు తిరువణ్ణామలైలో సబ్ రిజిస్ట్రారుగా పనిచేయుచుండిరి. వేదాంతగ్రంథపఠన, వైదిక కర్మలు చేయుచూ ధార్మిక జీవితం గడిపేవారు. ఉదయము నాలుగు గంటలకు లేచి, ఏదో లక్ష్యముపై దృష్టినిలిపి ధ్యానము చేయవలెనని వారు తంటాలు పడుచుండిరి. ఆసమయమునకు స్వామి వచ్చి తలుపు తట్టిరి, శాస్త్రిగారు లేచి తలుపుతీసిరి. స్వామికి

నమస్కరించి లోనికి తీసుకొనిపోయిరి. "ఏమిచేయుచున్నావు" అన్నస్వామి ప్రశ్నకు తనఅవస్థను శాస్త్రిగారు చెప్పిరి. ఓహో! అట్లనా! అని తనచేతి రెండు వేళ్ళతో స్వామి శాస్త్రి గారి కంఠభాగమును నొక్కిరి. అంతటితో ఆయనకు ఒడలు కంపించి దేహాధ్యాస తొలగి, అనిర్వాచనీయమైన ఆనందానుభూతి కల్గెను. అరగంటసేపు అయినపిదప శాస్త్రిగారు కండ్లు తెరచిరి. స్వామి 'ధ్యానంచేయడం అంటే ఇది' అని వెళ్లి పోయిరి. ఆనాటినుండి ఆయనలో ఒక ఉదాత్తపరిణామం ఏర్పడింది. వారిలో శాంతి, నిండుదనమూ నెలకొన్నది. వారిలో అధ్యాత్మిక అభ్యున్నతి యొక్క లక్షణములు గోచరించెను. కొన్ని సంవత్సరములకు పిదప శాస్త్రిగారు విదేహ కైవల్య మొందిరి.

చిత్తూరు మురుగేశ మొదలియారు సబ్ రిజిస్ట్రారుగా పని చేసి పెన్షన్ పుచ్చుకొన్నవారు. దైవభక్తి, సాధుసాంగత్యాభిలాష కల్గిన పెద్దమనుష్యులు. వారు తమిళభాషలోని నాలాయిర ప్రబంధములను శ్రావ్యంగా పాడేవారు. స్వామిని వుదయమూ సాయంత్రమూ దర్శించేవారు. తనకు 'జ్ఞానోదయము ఏదైనా కల్గునా?' అని స్వామిని ప్రార్థించిరి.

ఆయన వైరాగ్యమును గుర్తించి స్వామి, ఆయనను ఇలయనార్ గుడికి తీసుకొనివెళ్ళి మొదలి శిరస్సుపై తనకుడి చేతి నుంచిరి. అంతటితో మొదలికి స్వరూపసాక్షాత్కార

మేర్పడి బ్రహ్మానందావేశము కల్గెను. ఆయన బంధువులు 'ఈయన ఇట్లున్నారేమి' అని స్వామిని అడిగిరి.

'సంస్కారమున్నవాడు. వుపదేశము చేయమన్నాడు. నేను చేసితిని, కర్పూరము అంటుకొన్నట్లు వుపదేశము వెంటనే ఫలించినది.' అని స్వామి అనిరి.

మొదలికి ఈభావావేశము సుమారు మూడురోజు లుండెను. ఆమూడురోజులూ మొదలి స్వామివలెనే వీధులలో తిరుగుచూ, రమణాశ్రమము మూడునాలుగు మార్లు వెళ్ళి వచ్చెను. బంధువుల ప్రార్థనపై స్వామి, మొదలిని నీవు యిక యింటికి వెళ్ళవచ్చును' అని అనిరి. అంతటితో అతని భావావేశము తగ్గెను. ఇదిజరిగిన పిదప చాలకాలము మొదలి చితూరులో శాంతముగా పారమార్థిక ప్రవృత్తితో జీవితము నడపెను.

స్వామివద్దకు జనం దాదాపు కామ్యార్థంగానే వచ్చే వారు. ఆధ్యాత్మిక లాభంకోసం వచ్చేవారు అరుదు. వారి సంసార తాపత్రయములను పోగొట్టి స్వామి ఈశ్వరభక్తి యొక్క అవశ్యకతను బోధించేవారు. జ్ఞానలాభమైన కానీ సుఖదుఃఖ ద్వంద్వములు వదలవు. ఒకమారు స్వామి 'తెల్ల వారితే అంగడి తీయటం. రాత్రిఅయితే అంగడి మూయటం. యిలా వున్నది. ఏంప్రయోజనం? అరుణాచలేశ్వరుని చూచే

నాథు కొవరు?' అని అడిగారట. లోకాయతులపై స్వామికి అనుకంప. అందుచేతనే వారి హృదయంనుండి వ్యథతో కూడిన ఈమాటలు వచ్చినవి.

ఒకరోజు నారాయణశాస్త్రిని చూచి స్వామి,
'శుక్లాంబర ధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్న వదనంధ్యాయేత్ సర్వవిఘ్నోప శాంతయే'
అని మూడుమార్లు చదివిరి. విఘ్నోపశాంతికి పై శ్లోకం మూడు మార్లు చదువవలెనని అర్థం.

*   *   *

'మీరేమివ్యాపారం చేస్తున్నారు?'
నారాయణశాస్త్రిని నాలుగైదుమార్లు స్వామి ఈప్రశ్న వేశారు. నారాయణశాస్త్రి 'పైతైనంతవఱకు ఈశ్వరప్రణిధానమే చేస్తున్నాను. వేరు వ్యాపార మేమీలేదు' అని బదులివ్వగా స్వామి మరలమరల అదే ప్రశ్న వేసేవారు. నీవు పూర్తిగా సాంసారిక బంధములను తొలగించుకొని నిరంతరం భగవత్కైంకర్యములో మగ్నుడవు కావలెనని స్వామి ఆదేశమైనట్లు తోచును.

*   *   *

'మీరు ఆముదమును త్రాగదరా? మీకు వ్యాధీకీకి లేకుండా చేయనా? అరగంటసేపయితే అవిమలం. బ్రహ్మం నిర్మలం.

మలమును వదలి నిత్యశుద్ధ బుద్ధమైన బ్రహ్మముచే ఉపాసించవలసినదని స్వామి బోధ.

* * *

'ఈశ్వరుడెవరో తెలుసుకుంటె శరీరం తానుగ పోతుంది' దేహాభిమానం, అహంకారం, మమకారం–ఇవే మృత్యుస్వరూపము. ప్రమాదమే మృత్యువని సనత్సుజాతీయం. దేహాత్మబుద్ధిని వదలటమే మృత్యుంజయము.

* * *

'ఉల్లంఘ్యసింధో స్సలిలం సలీలం'

ఆంజనేయుడు సముద్రమును లీలగా దాటినాడు. సీతాదేవి దుఃఖమును తీర్చి, ఆమె శోకవహ్నిచేతనే లంకను కాల్చినాడు. అట్టి ఆంజనేయునికి నమస్కారం అని శ్లోకము యొక్క తాత్పర్యం. ఆంజనేయుడు రామానుగ్రహముచేతనే సముద్రమును లంఘింప కలిగినాడు. శిష్యుడున్నా గురువు అనుగ్రహం ఉంటేకాని భవజలనిధిని ఆంజనేయునివలె లంఘనము చేయగలడు. అటుతర్వాతనే శోక నిరాకరణమై దేహమైన–నవద్వారపురిలంక జ్ఞానాగ్ని చేత భస్మమవదు. ఈ భావము తెలుపుటకు స్వామి మొదటిపాదమును మాత్రము చదివి ఊరకుండిరి.

'రామాయణం చదవటమెట్లు! రామాయణం చదవటం మెట్లు?

'రామోవిగ్రహవాన్ ధర్మః' రాముడు ధర్మస్వరూపి. వాల్మీకి నారదమునిని 'ఈభూమండలంలో శ్లాఘ్యగుణములు కలవాడు, పరాక్రమవంతుడు, ధర్మము ఎరిగినవాడు, ఉపకారము మరువనివాడు, సత్యవాది, అచలసంకల్పుడు, సదాచార సంపన్నుడు, భూతదయ కలిగినవాడు, విద్వాంసుడు, నేర్పరి, ప్రియదర్శనుడు, ధైర్యశాలి, జితక్రోధుడు, ద్యుతిమంతుడు, అసూయారహితుడు, యుద్ధమున దేవతలనుకూడ భయపెట్టు గలవాడు, ఎవడు?' అని ప్రశ్నించెను. అందులకు నారదుడు పై గుణములన్నీ రామునికి, సత్యపరాక్రమునికి కలవని రామ గుణవర్ణనము చేయును.

రామాయణముచదవటం అంటే రాముని గుణములను ఆచరణలోనికి తేవడం. రామాయణాన్ని అనుష్ఠానంలో ఉంచడం. అదే రామాయణ పారాయణ అని స్వామి బోధిస్తున్నారు.

* * *

ఇది శివలింగం. దీనిని పూజచేస్తే చాలు. జ్ఞానం, మోక్షం, అన్నీ సిద్ధిస్తాయి.

నారాయణశాస్త్రిలు ఒకమారు, స్వామి వద్దకువెళ్ళి 'స్వామీ! నాకు రామకృష్ణాద్యవతార మూర్తులపై భక్తి ఉన్ననూ, మనస్సుమాత్రం ఏఒక్క మూర్తిపై లగ్నం కానంటుంది. అందుచేత మీరు నన్ను అనుగ్రహించాలి' అన్న ప్రశ్నకు స్వామి పై వాక్యం చెప్పినారు.

అనగా గురువే శివస్వరూపమనీ, గురువే శివుడూ, శివుడే గురువు. గురూపాసనే జ్ఞానదాయకము, మోక్షదాయక మని స్వామి వారి బోధ.

*　　*　　*

"జాతిభేదమూ, మాతృభోగమూ వదలితే సమాధి సిద్ధి"

వాడు వేరు నేను వేరు అనే భేదబుద్ధి, గ్రామ్యధర్మముపై కోరిక ఈ రెండు ఆత్మానుభూతికి ప్రతిబంధకాలు. స్వామి 'ఉదరమంతరం కురుతే' అన్న ఉపనిషద్వాక్యానికి అర్థం పై బోధలో క్లుప్తంగా చెప్పినారు. సమాధ్యవస్థపై ఆసక్తికలవారు ఈ బోధను అనుష్ఠించవలెను.

*　　*　　*

'బ్రహ్మ గొప్పనా? వసిష్ఠుడు గొప్పనా?'

వసిష్ఠునికి తండ్రి అగుటచే బ్రహ్మయే గొప్ప అని నారాయణశాస్త్రిలనిరి. స్వామి కాదు కాదు. వసిష్ఠుడే గొప్ప ఎందుకనగా విశ్వామిత్రుని చూచి నీవు బ్రహ్మర్షివైతివి. అని బ్రహ్మ చెప్పిననూ, విశ్వామిత్రుడు వసిష్ఠుని వాక్కులో తాను బ్రహ్మర్షి నైతినని వచ్చినకానీ ఒప్పుకోను అని పంతము పట్టినందున, వసిష్ఠుడే గొప్ప' అని అన్నారు. విశ్వామిత్రునికి వసిష్ఠుడు గురువు. గురువు వాక్కుగుండా తాను బ్రహ్మర్షి అని వచ్చినకానీ, నమ్మలేక పోయినాడు. అందరూ గురుభక్తిని అలవరచుకోవలెను.

*　　*　　*

'మోక్షమంటే ఇదే. మోక్షమంటే ఇదే'

సుబ్బులక్ష్మి ఇంట్లో ఉన్న ఒక పెద్ద నిలువటద్దము ముందు స్వామి నారాయణశాస్త్రిలను కౌగిలించుకొని ప్రతిబింబమును చూపుతూ మోక్షమంటే 'ఇదే, మోక్షమంటే ఇదే'- అని అన్నారు. దీనివల్ల జీవబ్రహ్మైక్యమే మోక్షమని అవిద్య అనే అద్దము తీసివేస్తే ప్రతిబింబరూపుడైన జీవుడు పోయి బింబము మాత్రమే మిగులునని స్వామిబోధ.

*   *   *

'రామరామమహాబాహో' అని చెప్పితే చాలు మోక్షం'

ఆదిత్యహృదయంలో అగస్త్యమహర్షి రాముని 'రామ రామ మహాబాహో' అని సంబోధించును. అగస్త్యమహర్షి వలె మనమూ ప్రీతితో రామనామజపం చేస్తే ముక్తి లభిస్తుందని స్వామివారి బోధ.

*   *   *

"ఆదిత్యహృదయం పారాయణ చేయవలె. సూర్యోదయ సమయంలో అరనిముషమైనా ధ్యానం చేయవలె. రాక్షసుడు చస్తాడు."

ఒకరోజు శేషాద్రి స్వామి సూర్యునిచూస్తూ నిలుచున్నారట. అపుడు నారాయణశాస్త్రిలు వెళ్ళి నమస్కరించారు. స్వామి నారాయణశాస్త్రిలను చూచి పైవిధంగా అన్నారు. కామవాసనలు పోవలెనంటే ఆదిత్యహృదయం

పారాయణ చేయవలె. (అనుబంధము చూడండి) కోపమనే పదానికి స్వామివారి భాష 'రాక్షసుడు' రాక్షసుడు చావడ మంటే కామక్రోధములు నాశముకావటము. జ్ఞానేంద్రియములు ఐదు, కర్మేంద్రియములు ఐదు–పదితలలు రావణాసురుడు. ఈపదితలల రాక్షసుడు చావడానికి ఆదిత్యహృదయ పారాయణ. ఆదిత్యహృదయ పారాయణ చేసియేకదా రాముడు దశగ్రీవుని సంహారం చేసినాడు.

* * *

'సుందరకాండ చదువు. జ్ఞానం కల్గుతుంది.'

* * *

'పరిత్యక్త సర్వాశామపి ఉపగత దక్షిణాసం.'
ఈవిద్యను మీరు చక్కగా అభ్యసించాలి."

ఈవాక్యం రామాయణ చంపువులోనిది. అగస్త్య మహర్షి అన్నిదిశలనూ వదలి దక్షిణదిశకువచ్చి చేరినారట. ఇదొక అర్థం. అగస్త్యులవారు అన్నిఆశలను వదలుకొన్నారు. కాని దక్షిణాశను (దక్షిణతీసుకోవటం) మాత్రం వదలుకో లేదట. ఇదొక చమత్కారపు శ్లేష. ఈశ్లోకార్థం చెప్పడంలో 'నీకు ఆశలు ఉండరాదు. జానెడు పొట్టకోసం అక్కడా ఇక్కడా పరుగెత్తి సంపాదించడ మెందుకు? దొరికిన దానితో సంతోషించు' అని బోధ. 'నిజకర్మోపాత్తం విత్తం తేన వినో

దయ చిత్తం' అని శంకరులు భజగోవిందం శ్లోకములలో బోధించినారు.

* * *

"రాముడు సర్వవ్యాపి. అందుచేత రామనామం ఎప్పుడు స్మరిస్తూ వుండవలె."

రామనామం చాలమందికి ఉపదేశించి ఉన్నారు. కలి యుగములో రామనామం మించినది ఏదీ లేదు. కాలదేశ, నియమములు లేక సదా జపించుటకు వీలైన మంత్రం అదే. ఒకవారము రోజులు ఇలయనాక్ కోవిలలో పడుకోమని స్వామి నారాయణశాస్త్రిలతో అన్నారు. అట్లే శాస్త్రిలు తన శిరస్సు స్వామి చరణములపై ఉంచి రోజూ నిద్రపోయేవారు. మూడవరోజు నారాయణశాస్త్రిలకు ఒక కలవచ్చింది. అరటి తోటలో శాస్త్రి ఉండగా స్వామి ఒక అరటిగెల తెచ్చి ఇచ్చి; ఈకాయలు ఇంకా పండలేదు. అని అన్నారట. గెలలో కొన్ని కాయలు పండి కొన్ని పండక వున్నవి. 'రామనామ' అని చెప్పుతూ వుంటే జోరుగా పోవచ్చును అని అన్నారు. 'నీకు కాషాయములు ఇంకా పక్వముకాలేదు. దానికి రామ నామమే మందని' స్వాప్నిక సందేశమువలె నున్నది.

ఇట్లే ఆరవరోజు మరొక కలవచ్చింది. ఒక చెట్టుక్రింద శాస్త్రికూరుచుని రామనామంచేస్తూ ఉండగా స్వామి ఒక పెద్దకత్తి నెత్తుకొని వెనుకనుండి శాస్త్రిలను చంపుటకు వచ్చి

రట. ఆయన లేవకుండానే తనతలను మాత్రం స్వామిచేతిలో చిక్కనీయక అటూఇటూ తిప్పి చేతులతో స్వామియొక్క హాత్యాకాండను ప్రతిఘటిస్తూ ఉండినారు. కొంతసేపయిన పిదప కత్తిని పారవేసి 'నీవేమిజపం చేస్తున్నావు? నీకు దేహస్మరణ ఉండవచ్చునా? దేహం మరచిపోవలె' అని చెప్పి అదృశ్యమైరి.

ఉదయము తనకలను స్మరించి శాస్త్రి తనకు ఇంకా పరిపక్వత కలుగలేదేయని విచారపడగా 'ఈశ్వరుడున్నాడు. భయమెందులకు?' అని అన్నారు.

ఒకడు కత్తి నెత్తుకొని తన్ను చంపుటకు వచ్చినా దేహముపై ధ్యాసవదలి నిర్భయంగా ఉన్నపుడే దేహాత్మక బుద్ధి పోయినదని అర్థం.

వారము దినములలో అక్కడ పడుకొనిన పిదప స్వామి ఇంక నీవు ఇక్కడ పడుకోవద్దు. పోయి వీధిలో పడుకో అని శాస్త్రిలతో చెప్పినారట. శాస్త్రి అట్లే తాను పారాయణ చేసే భాగవతము స్వామివద్ద ఉంచి బయటకు వెళ్లి పడుకొన్నాడు. ఆభాగవతంలో ఒక చిన్నకాగితంలో శాస్త్రి ఒక శ్లోకంవ్రాసి పెట్టుకొన్నాడు. తెల్లవారిలేచిచూస్తే ఆకాగితం ముక్కలుముక్కలుగా చించబడి యథాస్థానములో ఉన్నది.

సన్నిందా సతినామవై భవకథా శ్రీశేశయో ర్భేదధీః
అశ్రద్ధా శ్రుతిశాస్త్ర దేశికగిరాం నామ్న్యర్థవాదభ్రమః

నామాస్తీతి నిషిద్ధవస్తువిహిత త్యాగౌచ ధర్మాంతరైః
సామ్యం నామని శంకరస్య సహరేర్నామాపరాధాదశ.

బోధేంద్ర సరస్వతులు వ్రాసిన పదినామాపరాధము లను గూర్చి చెప్పేశ్లోకం. నామాపరాధములు పది ఈక్రిందివి.

1. సాధునింద, 2. దుష్టులకు విముఖులకు నామప్రాశస్త్యముగూర్చి చెప్పుట, 3. శివకేశవులయందు భేదబుద్ధి, 4. శ్రుతులలో నమ్మకములేకుండుట, 5. వేదవాక్యలలో నమ్మకము లేకుండుట, 6. గురునింద, 7. భగవన్నామమునందు అర్థవాదకల్పన, 8. నామమున్నదని నిషిద్ధకార్యాచరణ, 9. స్వధర్మత్యాగము, 10. ఈశ్వర నామసంకీర్తన. ఇతర పురుషార్థములతో సమమని భావించుట.

బోధేంద్రులు మోక్షప్రాప్తికి నామకీర్తనమే సాధన మనీ, దానికి కట్టుబాట్లు అవసరమనీ భావించియుండవచ్చును. స్వామి ఆకాగితమును చించివేసి నందువల్ల ఇన్నికట్టుబాట్లు ఉండరాదనీ, ఎప్పుడూ రామనామజపం చేయవచ్చుననీ, దానికి ఏకాగ్రత మాత్రం అవసరమనీ తక్కినవి అనవసరమనీ అభిప్రాయపడినట్లున్నది.

* * *

'సత్కర్మలు చేస్తూ రావాలి.'

ఆపదా మపహర్తారం దాతారం సర్వసంపదాం।
లోకాభిరామం శ్రీరామం భూయోభూయో నమామ్యహం ॥

ఒకరోజు నారాయణశాస్త్రిల జంధెము తీసి తన మెడలో వేసుకొని ఐదునిముషముల కాలము నవ్వుచూ తర్వాత జంధెమును మరలశాస్త్రిల మెడలో వేసి మీరు ప్రాతఃకాలములో సన్యాసం తీసుకొంటారా యని అడిగెరట. అందులకు శాస్త్రి సన్యాసము తీసుకొనుటకు తగిన వైరాగ్యము లేదే అనిస్వామీ! అని బదులిచ్చారట. 'సత్కర్మలు చేస్తూ రావాలి' అని స్వామి అనగా శాస్త్రి 'సత్కర్మ అనగా ఏమి' అని మరల ప్రశ్నించిరి. స్వామి 'అపదా మపహర్తారం' అన్న శ్లోకం చదివి 'సత్కర్మ' అనగా అదే అని చెప్పివెళ్ళిపోయారట. అనగా రామనామ స్మరణ ఆపదలను తొలగించి ఐహిక వాంఛా పూర్తి చేయుటే కాక ఆముష్మికంకూడ ఇవ్వగలదని తాత్పర్యం.

"పాప మెట్లు తొలగును? భారతమును కొని ఇచ్చెదను
శనైఃశనైః అపూజయత్"

వ్యాసులు చాలగొప్పవారు. గొప్పవారంటే ఇంతా అంత కాదు. చాలగొప్ప. చాలగొప్పవారు. అని స్వామిపలికి పై వాక్యములను వరుసగా చెప్పినారు. పాపము తొలగవలె నంటే భారతము చదువవలెను. భారతము చాలపెద్దది కనుక మధ్యలో ఆపక కొంచెముకొంచెముగా చదివి ముగించవలెను. అని స్వామి బోధన. స్వామి భారతమునుకొని ఇచ్చెదను అని చెప్పిన దానికి ప్రతిఫలముగా శాస్త్రిల స్నేహితుడు సేలము

వాస్తవ్యుడు భారతము పదునెనిమిదిపర్వములనూకొని శాస్త్రికి బహూకరించెను.

*　　*　　*

"కావేరీ విరజాతోయమ్ వైకుంఠం రంగమందిరం
పరవాసుదేవో రంగేశః ప్రత్యక్షః పరమం పదం"

నారాయణశాస్త్రిలు శ్రీరంగంవెళ్ళి రంగనాథుని సేవించి తులసి, కుంకుమ ప్రసాదములతో స్వామివద్దకు రాగా పై శ్లోకం చదివారు. కావేరిలో స్నానంచేస్తే పాపనాశం. రంగనాథుని దర్శనం మోక్షదాయకం. చిదంబరమూ అంతే. మీరు రంగని చూచితిరా?' అని అడిగిరి. స్వామి దివ్యదృష్టికి ఆశ్చర్యపడి ప్రసాదములను శాస్త్రి స్వామికిచ్చారు. దీనివలన శ్రీరంగమూ, చిదంబరమూ ముక్తిక్షేత్రము అని వ్యక్తమాతుంది.

*　　*　　*

"మాదృశానా మనాథానాం కా గతిః పురుషోత్తమ?
అహం సన్యాసివేషేణ బోధయామి ధనంజయ."

స్వామి ఒకప్పుడు సాధుసత్రంలో ఉన్నారు. అపుడు ఈ విచిత్రమైన శ్లోకం చదివినారు. కృష్ణా! నావలె దిక్కులేని వారికి గతి ఏమి? అని అర్జునుడు అడుగగా కృష్ణుడు అర్జునా! నేను సన్యాసివేషంలో జ్ఞానోపదేశం చేస్తున్నాను అని బదులిచ్చినాడట. ఇచ్చట కృష్ణుడు స్వామియూ, శాస్త్రి ధనం

జయుడున్నా, ఈవిధంగా స్వామి చమత్కారంగా సంభా వించారు.

*　　*　　*

'కాశికి తర్వాత మీరుపోవచ్చును. రామేశ్వరానికి మీరు తప్పక ఇప్పుడే వెళ్ళండి, రామేశ్వరయాత్ర చేస్తే బ్రహ్మహత్యాపాతకంకూడ తొలగుతుంది.'

నారాయణశాస్త్రిలు స్వామితో ఇట్లా అన్నారు. 'మిమ్ములను ఒకమారు దర్శించి వెళ్ళితే మనస్సు సాత్వికంగా ఉంటుంది. ఆటుపైన యథాప్రకారం దానిత్రోవ అదిపోతుంది. ఈ మనస్సు అణిగేవిధానం ఏది?' అని అడిగారు. స్వామి అప్పటికి ఊరకుండి అటుతర్వాత సైగ చెప్పిన ఆదేశం ఇచ్చి నారు. అయ్యో చేతిలో డబ్బులేదే యాత్ర ఎట్లాచేయడం? అని శాస్త్రి మనసులో అనుకొన్న వెంటనే 'డబ్బు దొరుకు తుంది. యాత్రచేయండి' అని స్వామి అన్నారు. ఇంతలో ఒకరు ఒకవిభూతి పొట్లమును తెచ్చి స్వామివద్ద ప్రసాదముగ తీసుకొందామని అనుకొన్నారు. స్వామి ఆపొట్లము విప్పి, విభూతినంతా తన తలకూ దేహమునకు పూసుకొని క్రిందపడిన విభూతిని నారాయణశాస్త్రిల ఒంటినిండుగా పూసినారు. పొట్లము తెచ్చిన వాడు ప్రసాదము ఏదీతనకు మిగులలేదే యని క్రిందపడిన విభూతిని కొంచెం ఎత్తుకొనపోగా 'ఛీ. అవ తలకు పో' అని గద్దించినారు. అతడు చేయునది లేక క్రింద

ఉండగా పారవేసిన పొట్లము కాగితమును తీసుకొనపోగా 'ఒరేయ్. దానిని తాకవద్దు. తాకితే పాము కరుస్తుంది' అని బెదిరించారు. వాడు నిరాశతో వెళ్ళిపోయాడు. శాస్త్రితో 'నీవు రామేశ్వరం వెళ్ళవచ్చును' అని అనుజ్ఞ ఇచ్చారు. శాస్త్రి తిరుచునాపల్లి చేరుకొన్నాడు. అక్కడ డి. ఇ. ఒ. ఉద్యోగంచేసి విరమించిన నటేశయ్యరును చూడటం తటస్థించింది. అయ్యరు బాగా చదువుకొన్నవాడు. సత్సంగి. పరోపకారి. శాస్త్రికి అయ్యరుతో పరిచయంకద్దు. అయ్యరు శాస్త్రిని ఇంటికి తీసుకొనిపోయి సత్కరించి ఏమితోచినదో ఏమో నూరురూపాయలు ఇచ్చి పంపినారు. శాస్త్రి ఇది గురువనుగ్రహామే అని సంతోషించి రామేశ్వరయాత్ర పూర్తిచేసుకొన్నాడు. యాత్రానంతరం శాస్త్రికి మనశ్శాంతి యేర్పడినది. చిత్తశాంతికి క్షేత్రాటనం, తీర్థసేవ ఉపకారులని స్వామి బోధిస్తున్నట్లు తేలుతుంది.

* * *

"ఒక సన్యాసి నారాయణ నారాయణ అని చెప్పుకొంటూ ఉండినాడు. అంతకంటే వేరు ఏంకావాలి."

విష్ణుసహస్రనామం 'ఆర్తావిషణ్ణా శ్శిథిలాశ్చ భీతాఘోరేషు చ వ్యాధిషు వర్తమానాః—సంకీర్త్య నారాయణ శబ్దమాత్రం విముక్తదుఃఖాః సుఖినో భవంతి.' అని నారాయణస్మరణ పాటవం తెలుపుతున్నది. నారాయణస్మరణ అందరికీ అవసర

మనీ వ్యాధులను పోగొట్టే మంత్రము దేనని స్వామి ఒకప్పుడు సెలవిచ్చారు.

* * *

జ్ఞానానందమయం దేవం నిర్మల స్ఫటికాకృతిం।
ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవ ముపాస్మహే॥

గురవే సర్వలోకానాం భిషజే భవరోగిణాం।
నిధయే సర్వవిద్యానాం దక్షిణామూర్తయే నమః॥

మౌనవ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మతత్త్వం యువానం
వర్షిష్ఠాంతే వసదృషిగణై రావృతం బ్రహ్మనిష్ఠైః।
ఆచార్యేంద్రం కరకలిత చిన్ముద్ర మానందమూర్తిం
స్వాత్మారామం ముదితవదనం దక్షిణామూర్తిమీడే॥

మందస్మితం స్ఫురితముగ్ధ ముఖారవిందం
కందర్పకోటి శతసుందర దివ్యమూర్తిం।
ఆతామ్రకోమల జటాఘటిత శేందురేఖం
ఆలోకయే వటతటీనిలయం దయాళుం॥

పై నాలుగుశ్లోకములు ప్రతిదినమూ చదివి గురువును అనుసంధించాలని స్వామి ఒకరికి బోధించినారు.

* * *

'అనన్యా శ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం'

పై చెప్పిన గీతాశ్లోకం ఎవరెవరు అనుదినం గురువందనం చేసి అనన్యశరణంగా గురువునే నమ్ముకొని తనభారం అంతా గురువుపై వేసి నిత్యయుక్తులై నిశ్చింతతో ఉంటారో వారియోగక్షేమములు ఆగురువే వహిస్తాడని స్వామి ఒక భక్తునికి హామీ నిచ్చినారు.

*　　*　　*

"శ్రీరంగనాథుని సేవించినా మోక్షం; హరికథ చెప్పినా మోక్షం' మీకు నేను పంచాంగం ఇస్తే తీసుకొంటారా?"

ఇవన్నీ నారాయణశాస్త్రిలను చూచి చెప్పిన మాటలు. పంచాంగ మనగా తిథివారనక్షత్రయోగకరణములను తెల్పు పుస్తకముకాదు. శ్రీగోపాలతాపినీ ఉపనిషత్తులో అష్టదశాక్షరియు, పంచపాదియు అగు శ్రీకృష్ణమంత్రమును పంచాంగమని సంకేతంగా స్వామి వ్యవహరించారు.

*　　*　　*

'రాఘవత్వే ఽభవత్సీతా రుక్మిణీ కృష్ణజన్మని।
అన్యేషు చావతారేషు విష్ణో రేషా నపాయినీ.'

ఒకమారు నారాయణశాస్త్రిలు అమ్మవారి ఆలయానికి వెళ్లి కుంకుమ ప్రసాదం తెచ్చుకోగా దానిని శాస్త్రిలనుదుట విభూతివలె పూసి పై శ్లోకం చదివారు. శివశక్తులు ఎట్లు ఒకరి నొకరు వదలక వాగర్థములవలె, ఏకవపుష్కులై ఉంటారో

అట్టే విభూతి కుంకుమలను భేదభావంలేక విభూతివలె పూసు కొనవలె నని స్వామి అభిప్రాయం.

* * *

"మీరు కౌముదిని చదివనారా? నేను కోటి కౌముదు లను చదివినాను."

ఒకమారు స్వామి శాస్త్రిని 'మీరు కౌముదిని చదివి నారా? అని ప్రశ్నించారు. 'ఆ చదివినాను.' అని శాస్త్రి బదులుచెప్పగా, 'ఎట్లా చదివారు?' అని స్వామి తిరిగి ప్రశ్నిం చారు. అ ఇ ఉ ణ్ - హాల్. ఇతిమహేశ్వరాణి సూత్రా ణ్యణాది సంజ్ఞార్థాని. అని శాస్త్రిచెప్పగా, స్వామి 'కాదు కాదు దానికి లెక్కా పక్కా లేదు. అబ్బఅబ్బ' అని తలఆడిం చినారు. కౌముది అంటే వెన్నెల అని ఒకఅర్థం. వ్యాకరణ శాస్త్రానికి కౌముది అనిపేరు. నారాయణశాస్త్రి వ్యాకరణం అనే అర్థం తీసుకోగా స్వామి బ్రహ్మానుభవ మనే వెన్నల అనే అర్థం తీసుకొన్నారు, శాస్త్రి 'మీబ్రహ్మానుభూతి నా కెట్లు వస్తుంది?' అని అడుగగా, స్వామి;

'పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం,
ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే.'

అని బదులిచ్చారు. యుగయుగములలోను ధర్మసంస్థాప నార్థము దుష్టవినాశముకొరకు స్వామి అవతరిస్తూ ఉంటాడు.

అట్లే ఋషులరూపంలోనూ, జ్ఞానులరూపంలోను భగవం తుడు దక్షిణామూర్తియై అవతరించి జ్ఞానకౌముదిని ఇచ్చి అనుగ్రహిస్తూ ఉంటారని స్వామి భావం ఐ ఉంటుంది.

*      *      *

"మీరు ఏదారిలో పోవడమూ అని ఇంకా నిర్ణయించ లేదా? కామాక్షి మీనాక్షి విశాలాక్షి అందరూ ఒక్కటే. వాళ్ళను నమ్ముకుంటే మోక్షం ఇస్తారు."

మోక్షప్రాప్తికి యోగయోగాది మార్గాలు అనుష్ఠిం చడం కష్టం. శంకరులవారు 'మోక్షసాధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసి' అని అన్నారు. అన్నిమార్గాలలోను భక్తిమార్గం సులభం. అందులోనూ అమ్మవారి పూజ చాల సులభం. తండ్రికంటే తల్లికి పిల్లలంటే ప్రేమ. కామాక్షి విశాలాక్షి అని పేర్లు పెట్టుకొన్న సర్వస్వరూపి, సర్వేశి, సర్వ శక్తి సమన్విత యైన జగన్మాత ప్రాపకంపొందాలి. భక్తునికి ఏమూర్తిపై మనస్సు సులభంగా లగ్నమౌతుందో ఆమూర్తిని ధ్యానించ వలసినదని స్వామి అభిప్రాయం.

*      *      *

'శ్రీకృష్ణ కర్ణామృతం-లలితాసహస్రనామం శివసహ స్రనామం-ఈమూడూ తప్పిస్తే వేరే లోకం ఎక్కడ?'

స్వామి తనజీవితంలో మొదట కృష్ణవిగ్రహం పెట్టు కొని పూజచేసేవారు. తర్వాత వారికి బాలామంత్రదీక్ష,

దానితోపాటు శివానుసంధానం ఏర్పడినది. ఈరత్నత్రయాన్ని వారు సాధించినారు. తన్ను అనుసరించేవారు అదేవిధంగా చేసి బాగుపడవలెనని స్వామిబోధ.

* * *

"మనమంతా ఒకరోజు పోవలసిన వాళ్ళమే కదా!"

ఎచ్చమ్మకు పుత్రికావియోగం కల్గింది. అపుడు స్వామి ఈమాట అన్నారు. జీవితంలో అనుదినమూ మృత్యుదర్శనం చేస్తున్నా, ఈలోకం శాశ్వతమన్న అభిప్రాయం మనలను వీడటం లేదు. 'కాలోహి పరమేశ్వరః' ఏచోటునుంచి వచ్చామో, ఆచోటుకు మనం ఎన్నడైనా ఒకరోజు పోవలసినదే.

* * *

'మీరు పెళ్ళిచేసుకో పోతారా?'

స్వామి పరబ్రహ్మానందయోగీంద్ర సరస్వతీస్వామిని చూచి పైవిధంగా అడిగారట. మీరు చెప్పునది నాకేమీ అర్థం కావటం లేదు అని యోగీంద్రులు అనగా స్వామి అహంకార మమకారములను వదలిపెట్టటమే పెళ్ళి. అదే కల్యాణం. ఇంద్రియనిగ్రహమే శోభనం—అని అన్నారట.

* * *

'మనకు ఒక్క వస్తువూ సొంతం లేదు.'

శివప్రకాశం మొదటి కూతురు చనిపోయినపుడు అత నికి ఉపశమనంగా స్వామి పై విధంగా ఓదార్చినారు.

* * *

"రాక్షసుడు చచ్చిపోయాడా?"

స్వామి పరిభాషలో రాక్షసుడు అంటే కోపం. కోపిష్ఠు లను చూచినపుడు అంతా రాక్షసుడు చచ్చిపోయాడా అని అడిగే వారు. చిత్తవృత్తినిరోధం కావాలని కోరేవారు కోపం అణచుకోవాలని భావం.

* * *

'చిగిర్చినపుడంతా ఛేదిస్తూ రావాలి.'

అరుణాచలంలో తంబిరాజా అనే వానికి కొంచెం స్త్రీ వ్యామోహం ఉండేది. ఒకరోజు ఆలయంలో దేవదాసి నృత్యం చేస్తుంటే తంబిరాజా ఆదాసినే గమనిస్తూ వచ్చినాడు. మరు సటి రోజు అతడు స్వామిని చూచుటకు రాగా చిగిర్చినపు డంతా ఛేదిస్తూ రావాలి అని నాలుగు గులకరాళ్ళనేరి వానిపై రువ్వి తరిమివేశారు. సాధుసాంగత్యంచేత క్రమేణ తంబిరానుకు స్త్రీవ్యసనం తగ్గి సన్మార్గంలో పడ్డాడు.

* * *

"రావణుడు చస్తే కానీ తలలు మొలవవు.'

ఇది భార్గవరాముడనే శిష్యుణ్ణి చూచి చెప్పినది. ఇతనికి కొంచెం ఇంద్రియలౌల్యం ఉండేది. రావణుడు అనగా కామం

రావణుడు చావటం అంటే కామాన్ని జయించటం. రావ ణుని పదితలలు దశేంద్రియాలు. రావణుడు చస్తే కాని కామంపోదు. ఇంద్రియజయం సాధ్యంకాదు. దేహాధ్యాస చేతనే కామం కలుగుతున్నది. కామనాశనానికి, ఇంద్రియ విజయానికీ అద్వైతదృష్టి అవసరమని స్వామి బోధన.

* * *

సత్యం శాంతం సహనం ఇవే మనపరిజనం. మన పరి వారం. మన సొంతబంధువులు. ఇవే మనసొంత బంధువులు."

ముముక్షువులకు పై చెప్పిన గుణములు చాల ముఖ్యం. 'సత్యంవద' అని తైత్తరీయము ఆదేశిస్తున్నది. భూతహితమై నదే సత్యం. సాధనపంచకములో ఆచార్యులు 'శాంత్యాదిః పరిచీయతాం' అని సాధకులు సాధించవలసిన గుణాలలో శాంతం ఒకటి అని పేర్కొన్నారు. సహనం అంటే ద్వంద్వా తీతంగా ఉండటం. సమచిత్తత్వమే సహనం. ఔరసులు అను జులు ఎట్లా బంధువులో ఆత్మానుసంధానం చేసేవారికి పై గుణములు సొంత బంధువులు.

* * *

"అంతా ఒకటే కదా:"

స్వామికోసం ఎవరో ఒక లోటా పాలు తెచ్చి ఇస్తే దానిలో సగం పిల్లి త్రాగింది. ఆమిగిలినపాలు స్వామి త్రాగ బోగా, అక్కడ ఉన్నవారు వారించారు. అపుడు స్వామి

'అంతా ఒకటే కదా?' అని అన్నారు. ఈ సన్నివేశం స్వామి సమదర్శిత్వమును, విధినిషేధములందు వారు ఎట్లు అతీతంగా ఉండినారో తెలుపుతుంది.

*　　*　　*

"ఏదిమంచి? ఏదిచెడుపు?"

ఒకమారు ఒక ఇంటిముందు ఎంగిలివిస్తళ్లు ఎవరో వేయగా స్వామి కుక్కలతో బాటు తానూ ఆఉచ్ఛిష్టం అసహ్యంలేక తినడం చూచి గృహయజమాని 'స్వామీ! ఆ ఎంగిలికూడెందుకు? లోన మృష్టాన్నమున్నది రండి.' అని అన్నారట. అతడు ఎంత బలవంత పఱచినా స్వామి ఎంగిలి కూడు తినటం మానలేదు. ఏదిమంచి; ఏదిచెడ్డ? అని ప్రశ్నించారు. స్వామి నిత్యశుద్ధులు కనుక లౌకిక దృష్టిలో హేయమైన కర్మలు ఆయనను ఏవియు అంటవు.

*　　*　　*

"ఈగవలె శుద్ధం, చీమవలె బలం, కుక్కవలె విశ్వాసం, రతీదేవివలె ప్రేమ, ఎవనికుంటుందో వానికి గురుభక్తి సులభం."

ఈగ అమేధ్యవస్తువులపై వ్రాలినా దానికి పరిశుభ్రత జాస్తి. చీమ ఉదయాస్తమానము ఏదో పనివదలక చేస్తూ ఉంటుంది. నాలుగు మెతుకులు వేస్తే కుక్క ఆజన్మాంతము యజమాని యింటిని కావలి కాస్తూ ఉంటుంది. రతీదేవికి పాతి

ప్రత్యేకత. ఇట్లు మనోవాక్కాయకర్మలు గురువుకు అర్పించిన వానికే గురులాభం కల్గుతుంది. ఆధ్యాత్మికపరిణామం గురుభక్తి లేనిదే రాదు.

* * *

'వేగిన గింజ మొలవదు'

కర్మలు ఈశ్వరార్పణబుద్ధితో చేస్తే బంధమోచకం. అట్లుకాక నేను చేస్తున్నాను అన్న కర్తృత్వ భావంతో చేస్తే అది బంధకారకం. అంటే కర్మఫలాన్ని ఈశ్వరునికి అర్పిస్తే కర్మసంగమంలో మనుష్యుడు చిక్కుకోడు. కార్యాన్ని యజ్ఞార్థంగా చేయడమే వేగిన గింజ. వేగినగింజలు మొలకెత్తనట్లు ఈశ్వరునికి ప్రీతిగా చేసినకర్మలు బంధకారకములు కావని అభిప్రాయం.

* * *

"ధ్యానం చేయడం అంటే ఇది"

ఒకరోజు స్వామి ఎచ్చమ్మ ఇంటికి వెళ్ళినారు. ఎచ్చమ్మ సాత్త్విక స్వభావ. రమణభక్తురాలు. 'ఎచ్చమ్మా! ఏమి చేస్తున్నావు?' అని అడిగారు. మీపటమును రమణుల పటమును పూజిస్తున్నాను అని అన్నారు. 'ధ్యానాభ్యాసం చేయరాదా?' అని అడిగారు. 'ధ్యానంచేయడ మెట్లా?' అని ఎచ్చమ్మ తిరుగ ప్రశ్న వేసింది. స్వామి వెంటనే పద్మాసనస్థులై కనులుమూసుకొని నాలుగు గంటలసేపు అలాగే కూర్చుని

పోయారు. అటుపై కండ్లు తెరచి 'ధ్యానం చేయడం అంటే ఇది' అని వెళ్లిపోయారు.

*　　*　　*

"పనసపండు తొనవలె ఈశ్వరుణ్ణి ధ్యానంచేయాలి."

పనసపండుతొన బీజమును ఆవరించి ఉంటుంది. ఈశ్వరుడే జగత్తుకు బీజము. ఆబీజములోనుంచి పుట్టిన జగత్తు ఈశ్వరుణ్ణి ఆచ్ఛాదించుకొని ఉన్నది. పనసపండుతొనలోని బీజముకూడా పంచకోశాంతరస్థితుడైన జీవునివలె—ఈశ్వరుని వలె ఉంటున్నది. ఈశ్వరుని ధ్యానం చేయవలెనంటే పనసపండు తొనలోనుంచి బీజమును వెలికి దీసినట్లు పంచకోశ నిరాకరణ చేసి ఆత్మానుసంధానం చేయవలెనని భావం.

*　　*　　*

"ఆత్మబోధోపనిషత్తు నూరుసార్లు చదవవలెను. నారాయణ నారాయణ అని చెప్పుకొంటూ ఋషులు మోక్షం పొందినారు"

ఆత్మబోధోపనిషత్తు ఓంకారప్రశస్తిని అష్టాక్షరిమహిమను వర్ణించింది. దానిని అనుష్ఠిస్తే హృదయేశుడైన వాసుదేవుని దర్శనము చేయవచ్చుననీ, ఆసాక్షాత్కారంచేతనే ఋషులు ముక్తి పొందిరనీ, మీరున్నా ఋషులు నిర్దేశించిన మార్గాన్ని అనుసరించాలనీ స్వామి బోధ.

*　　*　　*

"కామాక్షి దర్శనంచేశావా? కామకోటి పీఠం చూశావా? కామాక్షి మోక్షాన్నిచ్చే తల్లి."

ఎచ్చమ్మ కంచికి పోయి తిరిగిరాగా పై విధంగా స్వామి చెప్పారు. పీఠమనగా శ్రీచక్రం. కామాక్షిని ఉపాసిస్తే ఆమె మోక్ష మిస్తుందని స్వామిబోధ.

* * *

ఆత్మా త్వం గిరిజామతిః పరిజనాః ప్రాణాః శరీరంగృహం
పూజా తే విషయోపభోగరచనా నిద్రా సమాధిస్థితి,
సంచారః పదయోః ప్రదక్షిణవిధి స్తోత్రాణి సర్వాగిరః
యద్య త్కర్మ కరోమి త త్త దఖిలం శంభో తవారాధనం.

* * *

ఏకాకార సమస్తలోకజనకం హేమాద్రిబాణాసనం
నాగావాస కిరీటకుండలధరం నాగేంద్ర భూషోజ్జ్వలం,
రాకాచంద్ర సమానకాంతి వదనం రాజీవనేత్రార్చితం
శోకారణ్యదవానలం శుభకరం శోణాద్రినాథం భజే.

"అరుణాచలేశ్వరుని సర్వదా సేవిస్తూ, విశేషించి మంగళవారం గిరిప్రదక్షిణం చేయి. భక్తి వృద్ధిఔతుంది."

* * *

"ఈకంబత్తిలయ హాటను ప్రదక్షిణం చేయి. కోపాన్ని వదలిపెట్టు. దుష్టులతో చేరవద్దు."

* * *

'గుహుడు పడవను నడపినాడు. రాముడు గుహుని ఆలింగనం చేసుకొన్నాడు. గుహుడు గంగలోపడి చనిపోయాడు.'

వెంకట్రామయ్యరును, గుహునిశీలముపై ఉపన్యాసమిమ్మని పురజనులు కోరారు. ఆయన ఒప్పుకొని బయలుదేరినాడు. త్రోవలో స్వామి కనపడి 'ఎక్కడకు ప్రయాణం?' అని అడిగారు. వెంకట్రామయ్యరు-'ఉపన్యాసం ఇమ్మన్నారు. ఏమిమాట్లాడవలెనో తోచటం లేదు.' అని అనగా స్వామి పై వాక్యములను చెప్పి పోయిరమ్మన్నారు.

గుహుడు పడవను నడపటం కర్మయోగం. తమ తమ కర్మలను చక్కగా అనుష్ఠించడం. రాముడు గుహుని ఆలింగనం చేసుకోవటం భక్తియోగం. 'స్వకర్మణా తమభ్యర్చ్య' కర్మలను చక్కగా అనుష్ఠించిన వానిపై భగవంతునికి అనుగ్రహం కలుగుతుంది. గుహుడు గంగలో పడి చనిపోవడం దేహధ్యాసను మరచిపోవడం. అది జ్ఞానయోగం. ఇట్లు మూడుయోగాలు గుహుని శీలములో ఉన్నవని స్వామి సూచించారు. ఈమూడుయోగములూ పరస్పర విరుద్ధములు కావని స్వామిబోధ.

* * *

"ఓం శివ శివ. ఓం రామ రామ."

శివప్రకాశ మొదలిని చూచి స్వామి ఒకరోజు, నీకు బలాతిబలవిద్య బోధిస్తాను నేర్చుకో అని పై మంత్రం ఉపదే

శించారు. బలాతిబలమంత్రం, రామునికి విశ్వామిత్రుడు ఉప దేశించినట్లు రామాయణములో ఉన్నది. ఆమంత్రము గాయత్రీ మంత్రముతో చేరిన నూరక్షరములరహస్య మంత్రము. సావిత్రీఉపనిషత్తులో చెప్పబడినది. దానిని శతాక్షరి అనికూడ అంటారు. ఋషి ఛందస్సు, దేవత–మొదలైనవి. ఈ ఉపనిష త్తులలోనే చెప్పబడినవి. కాని మొదలికి ఈశతాక్షరిని ఉపదే శించక, స్వామి పైవిధంగా ఉపదేశించారు. గురుముఖంగా వచ్చిన విద్య ఏదియైనను బలాతి బలవిద్యయే.

జ్ఞానమూలం గురోర్మూర్తిః పూజామూలం గురోఃపదం।
మంత్రమూలం గురోర్వాక్యం మోక్షమూలం గురోఃకృపా॥

గురువాక్యం ఏదైనప్పటికి మంత్రమే.

* * *

"అపసర్ప సర్ప భద్రంతే దూరం గచ్ఛ మహాయశాః,
జనమేజయస్య యజ్ఞాంతే అస్తీక వచనం స్మర."

ఇది పాముమంత్రం. స్వామి సీతారామయ్యకు దీనిని ఉపదేశించి ఉదయాస్తమానం నూరుమారులు జపిస్తే పాములు కానీ, తేళ్ళుకానీ రావు. వానివలన భయమూ ఉండదు—అని అన్నారు.

* * *

"ఒక పెద్దసముద్రం. ఆసముద్రంలో ఒక పెద్దఓడ. ఓడలో ఐదుమంది ప్రయాణం చేస్తున్నారు. ఓడనావికుడు మరొకడు. జాగ్రత్తగా మరి ఓడను నడపవలె"

వేలూరు సుందరమ్మ అజపామంత్రం అంటే ఏమి? అని అడుగగా స్వామి పై విధంగా జవాబు చెప్పినారు.

అజపామంత్రం స్వయంగా ఎప్పుడూ ఉచ్ఛ్వాస నిశ్వాస రూపంగా జరిగే 'సోఽహం' అనే మంత్రం. రోజుకు మనిషి 21600 మార్లు శ్వాస తీసుకోవడం వదలడం జరుగుతూ ఉంటుంది. అహంసః, సోహం. అనేవి ఉచ్ఛ్వాస నిశ్వాసంలో కలసి ఉంటుంది. 'నేనే అతడు, అతడే నేను.' అని ఈమంత్రం యొక్క అర్థం. ఈమంత్రం అందరి దేహాలలోను శ్వాసప్రక్రియగా నడుస్తూ ఉంటుంది, దీనిని గమనించక ప్రాణికోటి గతానుగతికంగా ఉంటూఉన్నది. దీనిని గమనించి ఒక్కొక్క ఉచ్ఛ్వాస నిశ్వాసంలోనూ మంత్రార్థమును జోడుచేసి మనస్సు నిల్పిన వానికి సిద్ధి. అపుడు మనం నాదస్వరూపంగా ఉన్న పరమాత్మతో ఐక్యంకాగలం. అదే సిద్ధి. అదే ఆత్మజ్ఞాన మని హంసోపనిషత్తు తెలుపుచున్నది.

పెద్దసముద్రం అనగా చావు, పుట్టుకలనే జననమరణ సముద్రం. పాంచభౌతిక శరీరమే నావ లేక ఓడ. ఇంద్రియము లను అధిష్ఠించిన దేవతలే ఐదుగురు ప్రయాణికులు. తాదా త్మ్యక అధ్యాసతో ప్రతివిషయములోను అభినివేశ ముంచు కొన్న జీవుడే నావికుడు. జాగ్రత్తగా ఓడను నడపటం నిస్సంగిమై దేహాభాసను తొలగించుకొని ఆత్మస్వరూపంలో స్థిరం

కావటం. అజపా మంత్రతాత్పర్యమును స్వామి సులభరీతిలో పై విధంగా చెప్పినారు.

* * *

"భోజనం చేసేటప్పుడు నాలుక ద్వారా ఎవడు రసాన్ని ఆస్వాదిస్తున్నాడో వానిని తెలుసుకొంటే చాలు."

ఎచ్చమ్మతో స్వామి ఈవిధంగా అన్నారు. 'భోక్తారం యజ్ఞతపసాం సర్వలోక మహేశ్వరం.' అని గీత. పరమేశ్వరుడే భోక్త. ఈశ్వరుడే జీవభావంతో రసేంద్రియంద్వారా రసాస్వాదన చేస్తూ ఉంటాడు. వానిని తెలుసుకోవడమే జీవిత పరమార్థం.

* * *

"జ్ఞానం అంటే అదేకదా?"

ఒకమారు సూర్యునిచూస్తూ స్వామి, జ్ఞానం అంటే అదేకదా?' అని అన్నారు. ఇందులో ఒక విశేషార్థం ఉన్నది. ఒక్కసూర్యుడు వివిధజలాశయాలలో అనేక సూర్యులుగా ప్రతిబింబిస్తుంటాడు. అట్లే సర్వక్షేత్రములలోను భాసిస్తున్నా పరమాత్మ ఏమో ఒక్కడే. ప్రతిబింబ సూర్యుడు బింబభూతుడైన సూర్యునికంటే అన్యంగా కనపడుతాడు. బుద్ధిలో ప్రతిబింబమయ్యే ఆత్మాభాసకూడ ఆత్మకంటే వేరుగా కనపడుతూవుంటుంది. ప్రతిబింబసూర్యుని చంచలత్వాది గుణములు, సూర్యుని కెట్లు చెందవో-చిదాభాసుని కర్తృత్వాది గుణ

ములు ఆత్మకు సంక్రమించవు. స్వయంప్రకాశమానుడై సూర్యుడు వస్తువులను ప్రకాశింపచేసినట్లే, ఆత్మ స్థూలవస్తు సముదాయమును ప్రకాశింపచేసి తానూ వెలుగొందుతూ వుంటుంది. స్వామి ఈతత్త్వమునే క్లుప్తంగా పై విధంగా చెప్పినారు.

* * *

"యముణ్ణి జయించనివాడు ఒక మనుష్యుడా?"

ధృతరాష్ట్రుడు సనత్సుజాతమహర్షిని చూచి, మృత్యువనేది లోకంలో ఉన్నదా? అని ప్రశ్నించాడు. అందులకు మహర్షి "ప్రమాదంవై మృత్యుమహం బ్రవీమి" అని అన్నారు, ప్రమాదం అంటే బ్రాహ్మీస్థితిలో లేకపోవడం. లేదా ఆత్మ నిరతిలో ఉండక పోవటం. అదే మృత్యువు. జననమరణ ప్రవాహంలో చిక్కుకొనడం ఈ ప్రమాదం మూలముననే. అట్టి మృత్యువును జయింపనివాడు ఒక మనుష్యుడా! అని స్వామి ప్రశ్న. సాధ్యమైనంతవఱకు ప్రవృత్తినుంచి తప్పుకొని నివృత్తి అనుసరించవలె నని బోధ.

* * *

"అతత్త్వజగతో విస్మృతిః నతు బ్రహ్మణః"

స్వామి ఒకమారు అరుగుమీద ఉన్న రెండు స్తంభ ములచుట్టూ చిన్నపిల్లవానివలె గబగబ చట్టుతున్నారట. ఒక సంస్కృత విద్వాంసుడు ఇద్దరు స్నేహితులతో కలసి స్వామిని చూడటానికి వెళ్ళినప్పుడు ఈచర్య ఆయనకు

ఆశ్చర్యం కల్గించింది. ఈయనకు ఏదైన మతిభ్రంశ కలదా యని సందేహముతోచి-'అపితే విస్మృతిః?అని ప్రశ్నించాడట. అందులకు స్వామి, 'అత్ర త్వజగతో విస్మృతిః నతు బ్రహ్మణః' అని బదులుచెప్పారట. విస్మృతి అనగా మరచిపోవడం. విస్మృతి అంటే ఉన్మత్తత పిచ్చితనం అనికూడ అర్థం. 'అపితే విస్మృతిః' అన్న ప్రశ్నలో నీకేమైనా చిత్తభ్రమనా? అన్న ధ్వని యున్నది. అందులకు స్వామి లౌకికవిషయంలో విస్మృతి కాని బ్రహ్మవిషయంలోకాదు అని బదులివ్వగా పండితుడు నిర్వార పోయెనట.

* * *

"పోయే దెక్కడ ? వచ్చే దెక్కడ? నేను నాచోటులో ఉంటాను. నీవు నీచోటులో ఉండు."

సేలం శాంతాశ్రమస్వామికి క్షేత్రాటన అంటే చాల అభిలాష. ఎప్పుడూ, ఒకచోట నిలువక క్షేత్రాటన చేసే వారు. స్వామి ఆయనను చూచి పై విధంగా అన్నారు. క్షేత్రాటన చేయనివారికి చేయ మనిబోధ. మితిమీరి చేసేవారికి క్షేత్రాటన సాధనాంగమే కానీ సాధ్యం కాదనిబోధ. శంకరులు

"కాశీక్షేత్రం శరీరం త్రిభువన జననీ
వ్యాపినీ జ్ఞానగంగా
భక్తిః శ్రద్ధా గయేయం నిజగురుచరణ
ధ్యానయోగః ప్రయాగః

విశ్వేశోఽయం తురీయః సకలజనమనః
సాక్షిభూతోఽంతరాత్మా
దేహే సర్వం మదీయే యది వసతి పున
స్తీర్థమన్యత్కిమస్తి.

అని అన్నారు.

త్రిభువనజనని జ్ఞానగంగయే ప్రవాహం. శరీరమే కాశీ క్షేత్రం. భక్తిశ్రద్ధలే గయ. గురుచరణధ్యానయోగమే ప్రయాగ. తురీయుడైన విశ్వేశ్వరుడే ఆత్మ, సాక్షి. అన్నీ శరీరములోనే యున్నవి. ఇక వేరే తీర్థము లెందుకు?

ఆత్మపూజలో శంకరులు —

కిం కరోమి క్వ గచ్ఛామి కిం గృహ్ణామి త్యజామికిం।
ఆత్మనా పూరితం సర్వం మహాకల్పాంబునాయథా॥

అని వ్రాసినారు. మహాప్రళయంలో ఎక్కడచూచినా జలమే. ఎటుచూచిననూ ఆత్మతో నిండి ఈశావాస్యముగా కనపడుచున్నది. దేనిని గ్రహించడం? దేనిని వదలడం? ఎక్కడకు పోవడం? ఎక్కడకు రావడం? వారివారి స్వరూపములో ఉండటమే క్షేత్రాటనం అని స్వామి బోధ.

* * *

'ఎవరు స్త్రీ ?'

ఒకప్పుడు స్వామి ఎచ్చమ్మను, నీవు ఇంటినివదలి హాయిగా గోపురంలో వాసంచేయరాదా? అని అడిగినారట. అందులకు ఎచ్చమ్మ 'నేను స్త్రీనికదా? నాకు అంత పరిపక్వ

స్థితి రాలేదు.' అని బదులు చెప్పినది. స్వామి 'ఎవరు స్త్రీ' అని బదులు ప్రశ్న వేశారు, ఎచ్చమ్మ దేహాత్మక బుద్ధిని తొలగించడానికి ఈ ప్రశ్న.

దక్షిణామూర్త్యష్టకంలో—

దేహం ప్రాణమపీంద్రియాణ్యపి చలాం బుద్ధిం చ శూన్యంవిదుః
స్త్రీ బాలాంధ జడోపమా స్త్వహమితి భ్రాంతా భృశంవాదినః
మాయాశక్తి విలాసకల్పిత మహా వ్యామోహ సంహారిణే
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే.

ఈ భావమే చెప్పబడినది. ఈ సందర్భంలో మీరాబాయి జీవితంలో జరిగిన ఒక సంఘటన చెప్పుకోతగ్గది.

మీరాబాయి గిరిధరగోపాలునికి స్వాత్మార్పణ చేసుకొన్నది. అందుచే ఉత్తర మధురను వదలి కృష్ణభగవానుని విలాసాలాకు ఆటపట్టైన బృందావనం వెళ్ళిపోయింది. ఆమె వెళ్ళినపుడు బృందావనంలో వల్లభాచార్యులనే కృష్ణభక్తులున్నారు. వారిదర్శనం చేసుకొందామని మీరాబాయి కబురు పంపినది. ఆయన తాను స్త్రీని చూడనొల్లనని జవాబు చెప్పి పంపారట. అందులకు మీరాబాయి 'ఈ బృందావనంలో ఉన్న పురుషుడు ఒక శ్రీకృష్ణుడే. తక్కిన వారంతా స్త్రీలే. అట్లుకాక మరొకరు తన్ను పురుషుడని భావించుకొనే పక్షంలో అతడు బృందావనమే వదలి వెళ్ళవలసి వస్తుంది' అని తిరుగ

జవాబు పంపినదట. దానితో వల్లభాచార్యులు ఆమె మహాత్త్వమును గుర్తించారట.

*　　*　　*

"ఇందులోనూ ఈశ్వరుడున్నాడు. బాగాచూస్తే తెలుస్తుంది."

ఒకమారు గుడిలో స్వామి ఒక స్తంభం చుట్టూ ప్రదక్షిణ చేస్తున్నారు. ఎచ్చమ్మ 'స్వామీ ఈ స్తంభానికి ఎందుకు ప్రదక్షిణ చేస్తున్నారు?' అని అడిగింది. స్వామి 'ఇందులోనూ ఈశ్వరుడున్నాడు. బాగాచూస్తే తెలుస్తుంది. అని అన్నారు. ఈశ్వరుడు సర్వవ్యాపి. ఆయన ఆబ్రహ్మస్తంబ పర్యంతం వ్యాపించి ఉన్నాడని శాస్త్రములు చెప్పుతున్నవి. హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని 'ఈ స్తంభములో నీహరి ఉన్నాడా?' అని ప్రశ్నించి స్తంభమును తన్నగానే దానిలోనుంచి హరి ఆవిర్భవించినాడు. సర్వత్రి, విశ్వేశ్వరుని విశ్వరూపసందర్శనం చేయవలెనని స్వామి బోధ.

"శ్రీరాముని చరణకమలములను నమ్ముకొంటే ముక్తి. నీవు ఈవిషయం మరచిపోవుకదా?"

తిరుచి రుక్మిణమ్మ దేవీభక్తురాలు. మూకపంచశతి ఆర్యాశతకంలోంచి పదవశ్లోకమూ, పదునైదవశ్లోకమూ ఆమె చదివి నమస్కరించగా, స్వామి సజలనయనులై ఆమెను దగ్గరగా పిలిచి కౌగిలించుకొనిరి. వెంటనే రుక్మిణమ్మ మూర్ఛ

పోయినది. స్వామి తనచేతితో ఆమె కనులు తుడువగా, రెండు నిముషములకు స్మృతిని కోల్పోయింది. స్వామి చరణములను తనశిరస్సుతో స్పృశించి నమస్కరించినది అప్పుడు స్వామి పై విధంగా అన్నారు.

'జ్ఞానీ త్వాత్మైవ మే మతం' తత్త్వజ్ఞుడు నా ఆత్మ స్వరూపుడే-అని గీత. భగవచ్చరణములకు, గురుపాదములకు భేదము లేదు. గురుపాదములే రామచంద్రుని చరణములు. రాముని పాదములు నమ్ముకొన్నవారికి అనగా గురుభక్తి యుతులకు ముక్తి కరతలామలకం.

*　　*　　*

"నిరాహారంగా ఉంటే మోక్షం. వైరాగ్యం ఆహారిస్తే మోక్షం"

నిరాహారమంటే విషయత్యాగం. ఏది లోనికి ఆహరింపబడునో అది ఆహారం. శ్రద్ధావిషయానుభవం కూడ ఆహారమే. దానిని వదలితే మోక్షం. మోక్షం అంటే చిత్త వృత్తి నిరోధమే. అది అభ్యాసంచేతనూ, వైరాగ్యంచేతనూ లభిస్తుంది. అందుకే స్వామి 'వైరాగ్యం ఆహారిస్తే మోక్షం. అని అన్నారు.

'న వైరాగ్యాత్ పరం భాగ్యం న బోధా దపరం సుఖం
న హరే రపరస్త్రాతా న సంసారా త్పరో రిపుః'

# మహాసమాధి

స్వామి నలువది సంవత్సరములకాలము ఈవిధముగా శ్రితజనరక్షాధురీణులై తిరువణ్ణామలైలో జీవితం గడిపినారు. ఇట్లుండగా ఆయనకు విదేహకైవల్యంపై మనసు పోయింది. ఈవిషయం చూచాయగా సుబ్బలక్ష్మమ్మకు తెలుపవలెనని స్వామి ఒకరోజు,

'చాలకాలంగా నిన్ను ఒకవిషయం అడగాలని అనుకొన్నాను. ఏదో ఒకటి కచ్చితంగా చెప్పినావంటే ఆవిధంగా చేయాలని ఉన్నాను. జనం నాకు ఒకటే తొందరకలిగిస్తున్నారు. నేను ఇప్పుడు ఉండే విధంగానే ఉండనా? లేదా ఏదో క్రొత్తకుటీరమో పర్ణశాలనో వేసుకొని అక్కడ యోగాభ్యాసం చేయడమా? అని పాలుపోవటంలేదు. నీవు ఏమంటావు?' అని అడిగినారు.

సుబ్బలక్ష్మమ్మకు ఆప్రశ్నలోని సంకేతం తెలియలేదు. అందుచేత ఆమె, 'మీకు పైన వేసుకొన్న అంగవస్త్రం జారిపోయినా తెలియదే! మీకు ఒకకుటీరం తక్కువైనదికాబోలు! ఉన్నచోటనే ఉండి యోగాభ్యాసం చేయండి.' అని బదులిచ్చింది.

కాని స్వామి సుబ్బలక్ష్మమ్మను వదలలేదు. చూచినప్పుడంతా అదే ప్రశ్న వేసేవారు. ఒకమారు విసిగి—'మీకు క్రొత్తకుటీరంపై అంత అభిలాష ఉంటే—అట్లాగే ఒకటి నిర్మిం

చుకొని యోగం ఆరంభించండి' అని చివరకు అంగీకరించింది.

"ఔను ఔను. నేనూ అదే చాలకాలంగా అనుకొంటూ ఉన్నాను. నీవూ అదేమాట చెప్పినావు." అని దరహాసంతో ఏదో పెన్నిధి దొరికినవానివలె స్వామి వెళ్లిపోయారు. ఆనాటి నుంచి ఆప్రశ్నను వేయటం నిలిపివేశారు. స్వామి విదేహకై వల్యం కోరినట్లూ సుబ్బలక్ష్మమ్మ వాక్కే పరమేశ్వరి అనుజ్ఞ వలె భావించినట్లూ అర్థమౌతుంది.

ఈ ఉదంతం జరిగిన కొన్నినాళ్ళకు పోరుగూరివారు కొందరు వచ్చి స్వామికి అభిషేకం చేయవలెనని సంకల్పించారు. ఆసన్నాహంతో స్వామికి కేశసంస్కారం కావించి, అభిషేకానికి పూనుకోగా స్వామి, 'నాకు స్నానం వద్దు. జ్వరం రావచ్చును' అని అన్నారట. భక్తికూడ ఒకప్పుడు మౌఢ్యంగా పరిణమిస్తుంది. వారు ఆయన చెప్పినమాట వినలేదు. తెచ్చిన పన్నీరు బుడ్లన్నీ ఆయన శిరస్సుపై కుమ్మరించి, శివలింగానికి అభిషేకం చేసినట్లు బిందెలతో బావినుండి నీరు తెచ్చి తలపై కుమ్మరించసాగినారు. పొరుగుఊరి వారికే స్వామి ఇంతసొంతమైతే ఉన్నఊరివారు అవకాశాన్ని వదలుకొంటారా? వారూ ద్విగుణీకృతోత్సాహంతో పాల్గొన్నారు. అభిషేకంకోసం కాచుకొన్న జనం లంకాదహనంనాటి హనుమంతుని తోకవలె పెరిగినది. ఈ అభిషేకము స్వామివారికి నిజముగానే కైవల్యమైనది. అభిషేకోత్సవం పూర్తిఅయ్యేసరికి నూతిలోని నీరు పూర్తిగా వినియోగమైంది. దానితర్వాత ఒంటిని తుడిచి

విభూతి పూసి నూతనవస్త్రములతో స్వామిని అలంకరించి ఒక ఫోటోకూడ భక్తులు తీసిరి.

ఆనాటి సాయంత్రిమే స్వామికి జ్వరం ప్రారంభించినది. ఎట్టి మహనీయులకైనా దేహత్యాగమునకు ఒక కారణం ఉండవలెనుకదా! ఎంతజ్వరమున్ననూ స్వామి దినచర్యలో మాత్రం మార్పు లేదు. వరుసగా నలుబదిరోజులు జ్వరం వదలకుండా కాచినది. స్వామి చిక్కి శల్యమైపోయారు. జ్వరోద్ధతికి తాళుకోలేక, ఒకరోజు చిన్నగురుక్కులు ఇంటి అరుగుమీద పడిపోయారు. గురుక్కులు స్వామికి పరిచర్య చేయసాగాడు. ఊరివారికి ఈవిషయం తెలియగానే తండోపతండముగా జనం రాసాగారు. తిరువణ్ణామలై కృత్తికోత్సవమునకు వచ్చే జనమును మించి పోయినదీజనం. స్వామి అనునేయులలో వైద్యులు చాలమంది కలరు. వైద్యం ఏమయినా ఉపకరించునేమో అని వారు ఉత్సాహపడ్డారు. కాని మందుపుచ్చుకోరు. ఆహారం తీసుకొనరు.

ఇట్లుండగా శ్రీ బి. వి. నరసింహస్వామి, నారాయణశాస్త్రికి స్వామివిషయంగా ఒక ఉత్తరం వ్రాసిరి. ఉత్తరమందినదే తడవు నారాయణశాస్త్రి తిరువణ్ణామలై వచ్చి చేరెను. అంతవరకు కండ్లుకూడ తెరవక పడుకొన్న స్వామి నారాయణశాస్త్రిని తనకరుణాపాంగ వీక్షణములతో చూచెను. శాస్త్రి ఒకనారింజపండును స్వామికి సమర్పింపగా నలు

పది రోజులుగా ఏ ఆహారమునూ తీసుకొనని స్వామి, దానిని ఒలిచి ఒకతొనను వ్రేలితో చిదిమి వాసనచూచి వదలిపెట్టిరి.

వానచినుకులు, తడిగాలి. గురుక్కులు శాలువను తెచ్చి స్వామికి కప్పెను. స్వామి ఏమియుచెప్పక ఊరకుండిరి. కొంత సేపటికి స్వామి లేచి ఆశాలువతోనే ఆలయమువైపు తూలుతూ నడచి వెళ్ళిరి. ఎక్కడక్రింద పడిపోవునో అని వెంట నారాయణశాస్త్రి, మాణిక్యస్వామియు వెళ్ళిరి. త్రోవలో ఒక గుంటలో వాననీరు నిలిచి యుండెను. స్వామి చూడగానే అందులోదిగి మోకాలిలోతు నీటిలో కూర్చుండిరి. స్వామిని చూచుటకు జనం రాసాగిరి. ఈ సందడిని భరించలేక, ఆగుంట లోనే పడుకొనిరి. రాత్రి ఎనిమిది గంటలవఱకు ఊరి వారం దరూ దూరముగా నిలుచుకొని స్వామిని వదలక యుండిరి. రాత్రికాగానే వారితోబాటు మాణిక్య స్వామియు వెళ్ళి పోయెను.

నారాయణశాస్త్రి మాత్రము స్వామివద్దనే నిలుచుని ఉండిరి. తెల్లవారుఝామున మూడుగంటలకు స్వామి గుంట వదలి బయటకు వచ్చి తడిగుడ్డలతో గురుక్కులు ఇంటికి నడచివచ్చి, మరల పడకలో అట్లే పడుకొనిరి. బి. వి. నరసింహస్వామి సుందరకాండ పారాయణచేసిన ఉపకరించునేమో అని సలహానిచ్చిరి. వెంటనే నారాయణశాస్త్రి పారాయణ ప్రారంభించెను. కాని స్వామి దేహస్థితిలో ఏవిధమైన మార్పునూ లేదు. సుబ్బలక్ష్మమ్మ స్వామిని దర్శించినపుడు

'సుబ్బలక్ష్మీ! చూచినావా?' అని ప్రశ్నించిరి. అప్పటికి కాని, సుబ్బలక్ష్మమ్మకు తన్ను అడిగిన ప్రశ్నలో సంకేతము తెలియ లేదు. 'నేను చెప్పినకుటీరమూ యోగాభ్యాసమూ ఇదికాదని ఆమె వాపోయెను.

అది విభవసంవత్సరము. మార్గశీర్ష మాసము. స్వామి జననకాలమందు గురుశనిశుక్రులు మేషవృశ్చిక కుంభరాసు లలో ఉన్నట్లే, స్వామి విదేహ కైవల్యమునకు నిశ్చయించు కొన్న శుక్రవారము ఉదయమునకూడ అదేరాసులలో ఆస న్నులైరి. స్వామి పద్మాసనమున కూరుచుండిరి. నలువది సంవ త్సరముల కాలము తన మహాత్త్వప్రదర్శనమునకు క్రీడారంగ ముగా చేసుకొన్న అరుణాచల క్షేత్రములోని ఆదిదంపతులకు స్వామి తనహృదయమున నిలిపి, ఆనందస్ఫురణతో రోమాం చితులై భ్రూవోర్మధ్యమున ప్రాణమావేశింప జేసి, సనాతను డును, విశ్వనియంతయు, జ్యోతిర్మయుడును, సర్వపోషకుడును అగు పరమేశ్వరుని విభూతిలో తనప్రాణవాయువులను కలిపెను.

నలువదేళ్ళకాలము స్వామి కరుణాస్రవంతిలో నోల లాడిన జనానీకమునకు అరుణాచలము రాముడులేని అయోధ్య యైనది. వారి హృదయములు మూగవోయినవి. వారి ముఖ ముల చింతామేఘము లావరించినవి. చీటుక మాటుకకూ పసి పిల్లలు తల్లి ఒడినిచేరినట్లు స్వామి పజ్జను చేరే జనమునకు

ఇపుడు ప్రాపులేక పోయినది, జ్ఞానియై మౌనియై జీవన్ముక్తుడై తిరువణ్ణామలై వీథులలో దిరిగిన స్వామి ఇపుడెక్కడ ?

అరుణాచల సానువులలో అమ్మవారు ఈశ్వరుణ్ణి ఉద్దేశించి తపస్సుచేసి అర్ధనారియై అపీతకుచాంబయని ప్రఖ్యాతి బడిసినది. స్వామి నలువది సంవత్సరములకాలము తపస్సుచేసి ఆ తపఃఫలితముగా ఈశ్వరుని అర్ధాంగముకాక పూర్ణాంగముగా మారిపోయెనా?

ఏమైననేమి? స్వామి భవ్యజీవితము మనకొక మార్గదీపిక. ఆయన బోధలు మనకు అనుసంధానము చేయతగినవి.

"ఈశానః సర్వవిద్యానా మీశ్వరః సర్వభూతానాం
బ్రహ్మాధి పతి ర్బ్రహ్మణోధిపతి
ర్బ్రహ్మా శివో మే అస్తు సదాశివోమ్॥"



# శ్రీ శేషాద్రి స్వామివారి జన్మకుండలి

## ఇంగ్లీషుతేది *22-1-1870*

కలియుగాది 4970—శుక్ల సంవత్సరం, మకరమాసము శనివారము పంచమి 14-23 హస్తా నక్షత్రము సూర్యోదయాది 56¾ ఘటియలు—ధనుర్లగ్నం తులానవాంశ.

చంద్రదశలో బాకి—2 సం. 3 నె. 0 దినములు

| | | | |
|---|---|---|---|
| | గు | | |
| శు | రాశి | | రాహు |
| కు ర బు కే | | | |
| ల | శని | | చం |

| | | | |
|---|---|---|---|
| శని | రవి శు | బు | |
| కేతు | అంశ | | చం కు |
| | | | రాహు |
| | | ల గు | |

### గ్రహస్థితి

| | | |
|---|---|---|
| రవి 1 శ్రవణ | బుధ 2 శ్రవణ | శని 4 జ్యేష్ఠ |
| చంద్ర 4 హస్త | గురు 3 భరణి | రాహు 1 పుష్య |
| కుజ 4 శ్రవణ | శుక్ర 3 పూర్వాభాద్ర | కేతు 3 ఉత్తర |

శ్రీ స్వాములవారిసిద్ధి – విభవనామ సంవత్సరం ధనుర్మాసం. 21-(4-1-1929) స్వాతి నక్షత్రం-అభిజిత్ ముహూర్తం.

# సంస్కృతభాషలో నున్న కీర్తనలకు, శ్లోకములకు సామాన్య భావానువాదము

పుట 8 కీర్తన - చిత్సభానాయకమ్

ఓచిత్తమా చిత్సభానాయకుడగు (చిదంబరేశ్వరుడగు) సాంబశివుని సేవింపుము.

అతడు హృదయమునందలి అజ్ఞానమును పోగొట్టును. (పోగొట్టినాడు) తనపవిత్రమైన నటనచే, (నాట్యము నందు) దుర్గను జయించినాడు. ప్రపంచమును పాలించును. అట్టి శివుని సేవింపుము.

అతడు దివ్యరత్న హారములను ధరించును-దీనుల తాపమును హరించును-భోగమోక్షముల నిచ్చును. అతని సంచారము పవిత్రము. అతడు పాపములను పోగొట్టును. కవులు ఆశివుని భక్తితో స్మరింతురు. కామకోటిశాస్త్రిచే స్తుతింపబడిన చరణములుగల ఆశివుడు కరుణామయుడు. మునిజనుల హృదయమునందు విహరించును. ఆచిత్సభానాయకుని సేవింపుము.

పుట 8 కీర్తన - రమాపతే

ఓలక్ష్మీపతీ! నిరంతరము నీదాసుడ నగు (నీకు సమస్కరించు) నాయందు దయను చూపుము.

మంచిమనసు కలవారికి సంతోషమును కలుగజేయువాడా! దయామయహృదయా! లక్ష్మీపతీ! నన్ను

రక్షింపుము. ఆనందముతో కూడినవాడా, హృషీకేశా! (సర్వేంద్రియప్రవర్తకా) చిదానందా! మురారీ! నా హృదయమున భూమోదయమును(పరమాత్మయొక్క ఉదయమును-అనుభవమును) దామోదరా! భీమునిచే పూజింపబడినవాడా! గజేంద్రునకు వరము నిచ్చిన వాడా! నిర్మలమైన గుణములు కలవాడా! చంద్రుని వంటి ముఖముగలవాడా! కోరిన కోర్కెలను తీర్చు వాడా! పుష్పములవంటి పండ్లు (దంతములు) కల వాడా! నీలమేఘచ్ఛాయ గలవాడా (కాంతిచే నల్లని మేఘమును జయించినవాడా!)

దిక్పాలుర మదాతిశయమును అణచివేసిన రావణుని జయించి, అతని హృదయమును శిరసును ఛేదించిన పరాక్రమశాలీ! విభూ! భూమి, నీరు, వాయువు, అగ్ని, ఆకాశము, చంద్రుడు, సూర్యమండల మనెడు ప్రకాశవంతమైన ఆభరణములు కలవాడా! ఆశ్రయించిన వారిని రక్షించిన వాడా, కామకోటిశాస్త్రిచే స్తుతింపబడినవాడా! లక్ష్మీరమణా! కరుణాలయా! అమృతమును పోలిన మృదువాక్కులు గలవాడా! ఈశ్వరాదులచే స్తుతింపబడినవాడా! అపారమైన దయ గలవాడా! అచ్యుతా! సుగుణా!
పద్మములవంటి నేత్రములు కలవాడా! సుజనులకు ఆశ్రయమైన వాడా! రాక్షసులను సంహరించినవాడా!

సాటిలేని సుచరిత్ర కలవాడా! అడ్డులేని గరుడవాహనము గలవాడా! (గరుడగమనా!) నీచుడనగు (అల్పుడనగు) నన్ను రక్షింపుము.

పుట 9 కీర్తన - అంబశివే

మన్మథుని నాశనముచేసిన శివుని అంకమున నివసించు, ఓ అంబా, పార్వతీ! నిన్ను ఉపాసించుచున్నాను. బ్రహ్మవిష్ణువులచే పూజింపబడితివి - దిగంబరుడైన శివునిగూడ వస్త్రధారునిగనే(సాంబరునిగనే)చూతువు. తుంబురుడు మొదలగువారి గానమునందు ఆసక్తికల దానవు. బాలకుచాంబా! శంకరీ! కాదంబరి అను మద్యమును సేవించుదానా! సిద్ధులయొక్క మనసులనెడు పద్మములయందు బంధింపబడిన భర్తగలదానా! సురతే! వరదే! అమృతమయమైన సంభాషణకల దానా! (అమృతమువలె మధురముగ మాటలాడు దానా!) సందేహము వచ్చినప్పుడు యథార్థమైన విషయమును (సత్యమును) నాబుద్ధికి వెంటనే భాసింపచేయుము.

పామరులైన మనుష్యుల సహవాసమును నానుండి దూరముగ నుంచుము. (నాకు కలుగకుండ చూడుము) నీ చరణసేవకుడ నగు నన్ను బాగుగ చూడుము. పద్మదళములవంటి నేత్రములు కలదానా! కామేశ్వరి!

కామకోటిశాస్త్రియొక్క వాక్కుల సమూహమే ఇల్లు గాగలదానా! అంబా! నిన్ను నేనుపాసించుచున్నాను.

పుట 21 శ్లోకము - సత్సంగత్వే

సత్పురుషులతో స్నేహము చేయుటవలన నిస్సంగత్వము-(దేనియందు సంగము లేకుండుట) కలుగును- నిస్సంగత్వమువలన మోహము పోవును. మోహము నశించుటవలన, చలనములేని (స్థిరమైన) తత్త్వజ్ఞానము కలుగును. దానివలన జీవన్ముక్తి కలుగును.

,, దర్శనాదభ్రసదసి-చిదంబరక్షేత్రమున చిదంబరేశ్వరుని చూచుటవలనను, కమలాలయము అనగా తిరువారూరు అనేక్షేత్రమున పుట్టుటవలనను, కాశియందు మరణించుట వలనను, అరుణాచలమును స్మరించుటవలనను. మోక్షము కలుగును.

పుట 33 - లలాటేత్రిపుండ్రమ్

నుదుటియందు త్రిపుండ్రమును (మూడు విభూతిరేఖలు) కస్తూరి తిలకమును (బొట్టు) మెడలో రుద్రాక్షమాలను కటియందు కౌపీనమును (మొలకు, గోచి) శిరస్సునందు భయంకరమైన పామును, చంద్రుని ధరించుచు అందఱకు ప్రదీపము (పెద్దవెలుగు) అయిన అరుణగిరి యోగి సర్వోత్కృష్టుడై యున్నాడు.

*పుట 34 – వరుణాది*

వరుణుడు మొదలైన దేవతలచే పూజింపబడినట్టియు, బాలసూర్యుని కాంతిగలట్టియు, కరుణామూర్తి అయినట్టియు అరుణాచలనాథునకు నమస్కారము.

*పుట 43 యేభూతా బలి మిచ్ఛన్తి*

ఏభూతములు బలిని కోరుచున్నవై, రాత్రింబవళ్ళు తిరుగుచున్నవో–

*పుట 51 వాగర్థావివ*

శబ్దార్థజ్ఞానము కలుగుటకై, శబ్దార్థములవలె పూర్తిగా కలిసియున్న, ప్రపంచమునకు తల్లిదండ్రులైన పార్వతీ పరమేశ్వరులకు నమస్కరించుచున్నాను.

*పుట* **110** *న హి జ్ఞానేన సదృశం*

జ్ఞానముతో పోల్చదగిన పవిత్రమైనది ఈలోకములో ఏదియొకటి లేదు.

*పుట 113 శుక్లాంబరధరం*

తెల్లని వస్త్రమునుధరించి నట్టియు, చంద్రుని కాంతివంటి కాంతిగలట్టియు, నాలుగుచేతులు, గలట్టియు ప్రసన్నమైన ముఖముగల విష్ణువును, (సర్వవ్యాపకుని) అన్ని విఘ్నములను నశింపజేయుట కొఱకు ధ్యానింపవలెను. ఈశ్లోకము విఘ్నేశ్వర పరమగుచో, సర్వవ్యాపకుడగు

విఘ్నేశ్వరుని ధ్యానింపవలెను. అని చెప్పవలెను. విఘ్నేశపదమును అధ్యాహారము చేసికొనవలయును.

పుట 114 ఉల్లంఘ్య

సముద్రజలమును, ఒకఆటగా దాటి

పుట 121 ఆపదామపహర్తారం

ఆపదలను హరించువాడును, సర్వసంపదల నిచ్చువాడును, లోకమున కంతకును ఆనందము నిచ్చువాడును అగు శ్రీరామునకు మాటిమాటికి నమస్కరింతును.

పుట *123* కావేరీవిరజా

కావేరీనదియే విరజానదీజలముల కాశ్రయము. (కావేరియే విరజానది) శ్రీరంగస్వామి మందిరమే వైకుంఠము. శ్రీరంగేశ్వరుడే శ్రీమహావిష్ణువు. శ్రీరంగమే ప్రత్యక్ష పరమపదము.

పుట *123* మాదృశానాం

ఓపురుషోత్తమా! నావంటి దిక్కులేని వారికి దిక్కెవరు? ఓఅర్జునా! నేను సన్యాసివేషమున నుండి బోధింతును.

పుట *125* ఆర్తావిషణ్ణాః

కష్టములలో నున్నవారు, దుఃఖములలో నున్నవారు, శిథిలమైన వారు, భయపడిన వారు, భయంకరమైన

రోగముతో బాధపడువారు నారాయణ అను శబ్దము బాగుగా కీర్తించినంత మాత్రముననే, దుఃఖములనుండి విముక్తిని పొంది సుఖింతురు.

పుట 126 జ్ఞానానందమయం

జ్ఞానానందమయుడు, స్వచ్ఛమైన, స్ఫటికముయొక్క ఆకారము గలవాడు, అన్నివిద్యలకు ఆధారమైనవాడు అగు హయగ్రీవదేవుని ఉపాసించుచున్నాను.

,, గురవే సర్వలోకానాం

అన్నిలోకములకును గురువు, సంసారమనెడు వ్యాధితో బాధపడువారికి వైద్యుడు, అన్నివిద్యలకు నిధి అయిన దక్షిణామూర్తికి నమస్కారము.

పుట 126 మౌనవ్యాఖ్యా

మౌనమనెడు వ్యాఖ్యానముచే పరబ్రహ్మతత్త్వమును ప్రకటించినట్టియు, యువకుడైనట్టియు, వృద్ధులును, బ్రహ్మనిష్ఠులునైన ఋషిసమూహములచే పరివేష్టింపబడినట్టియు, చేతియందు చిన్ముద్రను ధరించినట్టియు, ఆత్మారాముడు ఆనందముతో ఒప్పియున్న ముఖము గలవాడు, ఆచార్యశ్రేష్ఠుడు నైనట్టియు, శ్రీదక్షిణామూర్తిని స్తుతింతును.

పుట 126 మందస్మితం

చిరునగవు గలవాడు, ప్రకాశించుచున్న అందమైన ముఖముగలవాడు, నూరుకోట్ల మన్మథుల సౌందర్యము దివ్యమైన ఆకారము గలవాడు, రాగిరంగుకలిగి కోమలముగ నున్న జడలలో చంద్రరేఖను ధరించినవాడు, దయాళువు, మఱ్ఱిచెట్టు మొదట కూర్చొనిన వాడు నగు ఆదక్షిణామూర్తిని చూచుచున్నాను.

,, 126 అనన్యా

"నేనే భగవంతుడైన వాసుదేవుడను" అని అనన్యభావముతో అద్వైతదృష్టితో నన్ను నిత్యము ఉపాసింతురో, వారియొక్క యోగక్షేమ భారమును నేనే వహింతును.

,, 127 రాఘవత్వే భవత్ సీతా

శ్రీమహావిష్ణువు శ్రీరాముడుగ నవతరించినపుడు, శ్రీమహాలక్ష్మి సీతగా అవతరించినది. శ్రీకృష్ణావతారమున రుక్మిణిగ అవతరించినది. ఇతరావతారములయందు కూడ ఆమె ఆయనతోనే యున్నది.

,, 128 పరిత్రాణాయ

సాధువులను రక్షించుటకు, దుష్టులను నశింపచేయుటకు, ధర్మసంస్థాపన చేయుటకు, నేను యుగయుగముల అవతరింతును.

,, 130 ఆత్మా త్వం గిరిజామతిః

నా ఆత్మయే నీవు-నా మనస్సు, పార్వతి-నా ప్రాణములు

నీకు సేవకులు (పరివారగణములు), నా శరీరము నీఇల్లు, నేను ప్రపంచవిషయముల ననుభవించుట నీకు నేను చేయుపూజ. నేను నిద్రించుట సమాధిస్థితి—నేను అటు నిటు తిరుగుట నీకు ప్రదక్షిణము చేయుటయే. నామాట లన్నియు నిన్ను గురించి చేయు స్తోత్రములు. ఓశంభూ! నేను చేయుపనులన్నియు నీ ఆరాధనమే.

పుట 131 ఏకాకార సమస్తలోకజనకం

ఒకే ఆకారముగలవాడు – సమస్తలోకములకు తండ్రి, మేరుపర్వతము (బంగారుకొండయే విల్లుగా గలవాడు) పాములు చుట్టియున్న కిరీటము కుండలములను ధరించు వాడు. పెద్దపాము లనెడు అలంకారముతో ప్రకాశించు వాడు. పూర్ణిమనాటి చంద్రుని కాంతివంటి కాంతిగల ముఖము గలవాడు. విష్ణువుచే పూజింపబడినవాడు. దుఃఖ మనెడు అడవికి దావాగ్నియైన వాడు. శుభ మును చేయువాడు. అగు అరుణాచలనాథుని సేవించు చున్నాను.

,, 138 అపసర్ప

ఓసర్పమా! తొలగిపో, దూరముగా పొమ్ము. నీకు భద్రమగుగాక, గొప్పకీర్తిగల ఓసర్పమా! జనమే జయుని యజ్ఞాంతమునందు, ఆ స్త్రీకుడు పలికిన వాక్యము లను స్మరింపుము.

,, *138* జ్ఞానమూలం గురో ర్మూర్తిః

శ్రీగురుమూర్తియే జ్ఞానమునకు మూలము. గురుచర

ణమే ప్రథమపూజ్యము. గురువాక్యమే సర్వమంత్రము
లకు మూలము. గురుకృపయే మోక్షమునకు మూలము

పుట 140 *భోక్తారం యజ్ఞతపసాం*

యజ్ఞములకును తపస్సులకును కర్తృరూపములకును
దేవతారూపమునను భోక్తయైనట్టియు, సర్వలోక
మహేశ్వరుడైనట్టియు–సర్వభూతములకు సుహృదుడై
నట్టియు (ప్రత్యుపకారమును కోరకఉపకారము చేయు
వాడు) నన్ను తెలిసికొని శాన్తిని పొందును.

,, 141 *అతత్త్వజగతో*

పరమార్థముగ సత్యముకాని ప్రపంచమును మఱచితినే
గాని సత్యమైన బ్రహ్మను మఱచిపోలేదు,

,, 142 *కాశీక్షేత్రం శరీరం*

శరీరమే కాశీక్షేత్రము–జ్ఞానమే ముల్లోకముల తల్లియై
వ్యాపించి యున్నగంగ–భక్తిశ్రద్ధయే గయ. గురుచరణ
ధ్యానయోగమే ప్రయాగ. సకలజన మనస్సులకు సాక్షి
యైన అంతరాత్మయే తురీయుడైన విశ్వేశ్వరుడు. నా
దేహమునందే అన్నియు నుండగా వేఱే తీర్థ మెందుకు?

,, 143 ఏమిచేయుదును?ఎక్కడకు వెళ్ళుదును? దేనిని తీసి
కొందును? దేనిని వదలుదును? ప్రళయకాలమున జల
మయమైనట్లుగా ప్రపంచమంతయు ఆత్మతో నిండి
యున్నది.

,, 144 *దేహం ప్రాణ మపీన్ద్రియాణ్యపి*

స్త్రీలు, బాలురు, అంధులు, మందబుద్ధులవలె వివేక

జ్ఞానములేని వారు, భ్రాన్తినొందిన వారై, గట్టిగా వితండవాదము చేయుచు, దేహము, ప్రాణములు, ఇంద్రియములు చంచలమైన బుద్ధి, శూన్యము, "నేను" అని తెలిసికొనుచున్నాడు. (దేహమే నేను, అని కొందఱు, ప్రాణములే నేనని, ఇంద్రియములు నేనని, బుద్ధి నేను అని, శూన్యము నేను అని, అనుకొను చున్నారు) మాయాశక్తియొక్క విలాసమువలన పై విధముగా కల్పితమైన గొప్పవ్యామోహమును-(దేహ ములే నే నను భ్రమను) నాశనము చేయు, గురుమూ ర్తియైన శ్రీదక్షిణామూర్తికి నమస్కారము.

పుట 146 నవైరాగ్యాత్పరం

వైరాగ్యముకంటె ఎక్కువైన సంపద లేదు. జ్ఞానమును మించిన సుఖము లేదు. విష్ణువుకంటె రక్షకు డెవడును లేడు. సంసారముకంటె శత్రు వెవరును లేరు.

" 152 ఈశానస్సర్వవిద్యానామ్

సర్వవిద్యలకు ప్రభువు, సర్వభూతములకు ప్రభువు, వేద ములకు ప్రభువు, (లేదా బ్రహ్మయు, అధిపతియు, అనగా సర్వాత్మనా వ్యాపించినవాడు) హిరణ్యగర్భ బ్రహ్మకు ప్రభువు, అగు పరమాత్మ న న్ననుగ్రహించు టకై శాంతుడగుగాక. నేను ఆసదాశివుడనే అగు చున్నాను.

# కుళందై ఆనందస్వామి

## సంగ్రహ చరిత్ర

ద్రావిడభాషలో 'కుళందై' అనగా శిశువు. కుళందై ఆనందస్వామి అన్న పేరుతో వారు ఎప్పుడూ శిశువువలె ఆనందస్థితిలో వుండేవారన్న భావ మున్నది. మహాత్ములు, 'బాలోన్మత్త పిశాచవత్' బాలురవలె, ఉన్మత్తులవలె, పిశాచములవలె సంచరిస్తారని మనము వినియే యున్నాము.

కుళందై ఆనందస్వామి సుమారు మూడువందల సంవత్సరములక్రితం హాలాస్యక్షేత్ర మని ప్రసిద్ధిచెందిన మధురానగరంలో అవతరించారు. రాణీ మంగమ్మ పరిపాలనాకాలంలో, వీరితండ్రి సంస్థానంలో ఉద్యోగిగా ఉండేవారు. వీరి తల్లి పేరు త్రిపురసుందరి. చాలరోజులుగ సంతతి లేనిదానివలన ఆమె మీనాక్షిని సంతానార్థము ప్రార్థిస్తూ వచ్చినది. ఒకరోజు మీనాక్షి స్వప్నములో కనపడి ఆమెకు పుత్రప్రాప్తి కలుగుతుందని అనుగ్రహము చేసినది. కొంతకాలమునకు ఆమెకు కవలపిల్లలు జన్మించారు. మొదటి బిడ్డకు రాముడనీ, రెండవ పిల్లవానికి లక్ష్మణు డనీ నామకరణము చేశారు. మొదటి పిల్లవాడైన రాముడే, కుళందై యానందస్వామి. రెండవ పిల్లవాడైన లక్ష్మణుని సంతతి-ఇప్పటికీ, మధురలోనూ, బత్తలగుండు అనే చోటులోనూ వున్నారు. త్రిపురసుందరి తాను మొక్కుకొన్న విధముగా రాముని లక్షరూపాయలతో సహా

మీనాక్షికి సమర్పించినది. పిల్లవాడు ఆలయంలోనే పెరుగ సాగినాడు.

దర్శనార్థం వచ్చే జనులందరూ, కుళందై ఆనంద స్వామిని చూచి ఆశ్చర్యపడేవారు. అతనిని మీనాక్షి బాలకు నిగా పరిగణించేవారు. కుళందై ఆనందస్వామికి ఏడో ఏడు రాగా కాశీనుంచి శ్రీగణపతిబ్రహ్మము తగినశిష్యుని అన్వే షిస్తూ మధురకు వచ్చారు. మధుర ఆలయములో ఉన్న కుళందై ఆనందస్వామిని చూడగానే ఆయనను కాశీక్షేత్రానికి తనతో బాటు రమ్మన్నారు. కుళందై ఆనందస్వామి, తనతలి దండ్రులకు తాను చేయవలసిన కర్తవ్యమును పూర్తిచేసికాని రానని చెప్పినందున, గణపతిబ్రహ్మము కూడ మధురలోనే తాత్కాలికముగా స్థిరపడ్డాడు.

కుళందై ఆనందస్వామికి 16వ ఏడువచ్చినది. ఒకరోజు ఈయన తండ్రి సమయనల్లూరు అనే గ్రామసమీపమున నున్న తన భూములను చూచునిమిత్తము వెళ్ళి తిరిగివచ్చుచుండగా, దస్యుడొకడు ఆయనను హత్యచేసాడు. కుళందై ఆనందస్వామి తండ్రికి చరమకార్యముల పూర్తిచేశారు. ఆయనతల్లి త్రిపుర సుందరి, భర్తతో బాటు సహగమనము చేసినది. అంతటితో కుళందై ఆనందస్వామికి ఐహిక బంధనములు తొలగిపోయినవి. వారు గణపతిబ్రహ్మముతో బాటు కాశీకి వెళ్ళ సిద్ధపడ్డారు.

కాశీక్షేత్రములో, గణపతిబ్రహ్మము వద్ద కుళందై ఆనందస్వామి ఎన్నో యోగరహస్యములు గ్రహించారు. సుమారు రెండువందల సంవత్సరములు ఉత్తరభారత దేశంలో వారు సంచారంచేశారు. హిమాచలసానువుల నున్న టిబెట్టుకు వెళ్ళారు. నేపాళానికి వెళ్ళారు. నేపాళదేశంలో ఒకరోజు స్నానంచేసి ఉదయం కుళందై ఆనందస్వామి వస్తూండగా, నేపాళదేశపురాజు అంతఃపురములో, వ్యాధిగ్రస్తుడై మరణావస్థలో ఉన్నట్లు ప్రజలు వారికి తెలిపారు. అంతఃపురమునకు కుళందై ఆనందస్వామి వెళ్ళి తనచేతనున్న గంధపు బెత్తముతో రాజుగారి దేహమును తడమగానే రాజు వ్యాధివిముక్తుడై లేచి కూరుచున్నాడు. రాజు కుళందై ఆనందస్వామికి ప్రణమిల్లి, మీరు కోరినది ఇచ్చుటకు సిద్ధముగా నున్నానని విన్నవించారు. నాకేమీ అక్కర లేదు. కానీ సమాధిలో ఉండవలెనని ఇచ్ఛ వున్నదిగనుక 'ఆరుఅడుగుల నేల ఇచ్చినావంటే చాలని' రాజుతో స్వామి బదులుపలికారు. వెంటనే రాజు తనసేవకులతో చెప్పి కుళందై ఆనందస్వామి సమాధి నిమిత్తము ఒకచక్కని ప్రదేశము నిర్మించి ఇచ్చినాడు. ఆచోట వారు పంద్రెండువళ్ళు కాలము జీవసమాధిలో వుండినారు. అటుపై ఉత్తరభారతంలో మరల సంచరించసాగినారు.

దక్షిణభారతమువ సంచరించు కాలమున, తిరువణ్ణామలైలో రెండవమారు చాలకాలము జీవసమాధిలో నుండినారు.

తిరునల్వేలిజిల్లాలో తెన్‌కాసి అనుచోట మూడవమారు జీవ సమాధి అయ్యారు. అచ్చట సమాధికి నెల్లియప్ప సమాధి అని పేరు.

దాదాపు వారు ఉత్తరభారతమున రెండువందల సంవత్సరముల కాలము వసించినారు. పిదప దక్షిణభారతమునకు విజయము చేశారు. ఆంధ్రదేశములో వీరికి త్రిలింగస్వామి అని పేరు. ఇచ్చట వీరు కౌపీనధారులై ఉండేవారు. తంజావూరులో దాదాపు ఇరవై ఏళ్లు కాలముండినారు. మధురలో నలువదిఏండ్లు కాలముండినారు,

వీరి నాలగవసమాధి మధురలో వున్నది. వీరు కడపటి కాలమున రాచపుండుతో బాధపడిరి. కాని వారు దానిని లెక్కచేయలేదు. ఆలాగే దొర్లాడేవారు. వైద్యులను చికిత్స చేయుటకు అనుమతించలేదు. ఆంగీరసవర్షము (1932) ఆశ్వీజ మాసము శనివారము దశమి శ్రవణానక్షత్రమునాడు సిద్ధి పొందిరి.

కుళందై ఆనందస్వామి కాశీక్షేత్రంలో చాలకాలమున్నారు. అక్కడకూడ వారు త్రైలింగస్వామియనియే వ్యవహరింపబడ్డారు. వారు నిరంతర మౌనవ్రతధారులుగ యుండేవారు. ఒకపుడు శ్రీరామకృష్ణపరమహంస కాశీక్షేత్రమునకు వెళ్ళిన సందర్భములో త్రైలింగస్వామిని దర్శించారు.

పరమహంసను చూచి స్వామి స్వాగతముగా తనపాదముపెట్ట నిచ్చారు. ఆయనయందు కాశీవిశ్వనాధుడు సజీవముగ ప్రత్యక్షమైనట్లు పరమహంసకు తోచెను. వారికి దేహాభావమే యుండెడిదికాదు. ఎండలో మాడిపోవుచున్ననూ, ఇసుకపై అనాయాసముగా స్వామిపంచుకొని యుండేవారు.

రామకృష్ణపరమహంస, స్వామిని భగవంతుడు ఒకడా పలుపురా? అని ప్రశ్నించిరి. మౌనములో యున్నందున అభినయములద్వారా, స్వామి సమాధిస్థితిలో చూచినపుడు భగవంతుడు ఒక్కడనియు, ద్వంద్వతాదృష్టిలో చూచినపుడు పలువురనియూ ప్రత్యుత్తరమిచ్చారు.

రామకృష్ణపరమహంస స్వామిస్థితి, పరమహంసస్థితి యని హృదయునితో చెప్పెను. హృదయుడు రామకృష్ణ పరమహంసకు మేనత్తకుమార్తె పుత్రుడు. త్రైలింగస్వామి అప్పుడు మణికర్ణికాఘట్టమున నొక స్నానఘట్టము కట్టించుచుండెను. పరమహంస ఆజ్ఞమేరకు హృదయుడు కొన్నిపారల మన్నుత్రవ్వెను. ఇందులకు స్వామి చాలసంతోషించెను. రామకృష్ణపరమహంస స్వామికి పాయసము నిచ్చి సత్కరించెను.

త్రైలింగస్వామినిగూర్చి అనేక గాథలు, అద్భుత చర్యలు ప్రచారంలో వున్నవి. ఆయన ఎంతటివిషానైనా గడగడ త్రాగివేసేవారట. కాశీప్రజలు తరచు చూచే దృశ్యము, స్వామి గంగానదిలో పద్మాసనస్థుడై తేలుతూ

వుండటం. కొన్నిరోజులపాటు నీళ్లలో అలాగే వుండిపోయే
వారట. అట్లా నీళ్ళలో లేకపోతే, మండుటెండలో, మణికర్ణికా
ఘట్టములో దిగంబరులుగా కాలుతున్న మెట్లపై, వెన్నెలలో
శయనించివున్నట్టు శయనించి వుండేవారు.

స్వామి మహాత్ములేకాదు, మహాకాయులుకూడ. వారిది
చాలస్థూలశరీరం. వారివయస్సు అంచనా మూడువందలు వేసే
వారుకనుక, సంవత్సరమునకు ఒక్క పౌండు చొప్పున బహుశా
మూడువందల పౌండ్లు తూగేవారు. ఇంతకూ వారు దాదాపు
నిరాహారులే. కొన్నిరోజులపాటు ఆహారం లేకుండా వుండే
వారు. ఉపవాసం విరమించిన రోజు విస్తారంగా మజ్జిగ త్రాగే
వారట.

ఒకమారు దుష్టుడొకడు వారిని పరీక్షించదలచి,
సున్నపునీళ్ళను మజ్జిగ అని తెచ్చి వారిచేత త్రాగించాడట.
స్వాములవారు మారుచెప్పక వాడు తెచ్చిన నీటినంతా
త్రాగారు. వారు త్రాగిన రెండుమూడు నిముషములకు వీని
కడుపులో ఎక్కడలేని మంట పుట్టినది. కుర్రో మొర్రో అంటూ
స్వామి పాదాలమీద పడ్డాడు. "దుష్టుడా! నీలోనిప్రాణమూ,
నాలోనిప్రాణమూ ఒకటి అని నీవు గ్రహించలేదు. ఇక మీద
నైనా జాగ్రత్తగా వుండు" అని మౌనవ్రతమును వదలి మంద
లించారట.

త్రైలింగస్వామి ఎప్పుడూ దిగంబరముగా వుండేవారు.
వీరి దిగంబరత్వమును చూచి పోలీసువారికి చికాకుపుట్టేది.

స్వామిని పోలీసువాడు ఒకరోజు పట్టుకొని జైలులోపెట్టి భద్రంగా తాళంవేసి బైటకువచ్చాడు. వచ్చి వెనుకకు తిరిగి చూడగా స్వాములవారు గదిలో లేరు. జైలుగది మీదనున్న డాబామీద పచారు చేస్తున్నారు. పోలీసువిసిగి స్వాములవారిని క్రిందికి దిగి రమ్మన్నాడు. వారు మారుమాటాడక దిగివచ్చారు. మళ్ళీ వారిని గదిలోత్రోసి పోలీసుబంధించాడు. మళ్ళీపోలీసు వెనుకకు తిరిగిచూస్తే యథాప్రకారం స్వాములవారు గదిలో లేరు;డాబామీద పచారుచేస్తున్నారు. అంతటితో ఇకలాభము లేదని పోలీసు వారిని వదలిపెట్టివేశాడు. వారి దిగంబరత్వం పోలీసువానికి అసహ్యంగా వుండేది. కాని వారేమో నిర్లేపులు. వారికి దిగంబరత్వం, పట్టుదుకూలాలను ధరించినంత హాయిగా వుండేది.

ఒకరికి చాలాకాలముగా కుదరని రోగముండేది. వారు స్వామిని దర్శించారు. ఎట్లో చొరవచేసుకొని స్వామి పాదములను గట్టిగా పట్టుకొని వారికి నమస్కరించి లేచారో లేదో వారివ్యాధి అద్భుతముగా నివారణ ఐనది. ఇలాంటి అద్భుతములు జరిగినా, వారేమో తనకేమీ పట్టనట్లు, కర్త ఎవరో ఐనట్లు వుండిపోయేవారు.

ఒకప్పుడు స్వామి తిరునల్వేలిప్రాంతములో సంచరించుచున్నప్పుడు మరొక సాధువును కలిసికొని–'ఏరా నీవు తొమ్మిది తూటులుగల దేహానికి లోబడిన వాడవేకదా?' అని అన్నారు.

అందులకు ఆసాధువు 'మీరుమాత్రం' అని బదులుప్రశ్న వేశారు. స్వామి 'నన్ను యోనిజుడనియా అనుకొన్నావు? నేను పదవతూటు (రంధ్రము) గుండా వెళ్ళిపోయేవాడిని. అని బదులిచ్చారు.

1950లో ఒకానొక శిష్యుడు సత్యాగ్రహం చేయబోతూ స్వామివద్దకు చెప్పడానికి వెళ్ళాడు. స్వామి సత్యాగ్రహాపు బెడదఅంతా నీ కెందుకు? అని ప్రశ్నించారు. అందుల కతడు 'నేను మీవద్ద ఉత్తరవుకోసం రాలేదు. మీకు చెప్పి పోదామని మాత్రం వచ్చాను.' అని అన్నాడు. స్వామి అపుడన్నారు. నేను ప్లాసీయుద్ధము జరుగుతున్నపుడు సమాధిలో ఉండినాను. తెల్లవాళ్ళు నాచుట్టూ గుండ్లువేస్తూ వచ్చారు. వాళ్లు ఎపుడు మనదేశం వదలి వెళ్లుతారని నీఉద్దేశం?" అందులకు శిష్యుడు, 'మీరే చెప్పండి' అని తప్పుకొన్నాడు. స్వామి '1950 వ సంవత్సరం తానుగా వాడే మూటాముల్లె కట్టుకొని వెళ్ళిపోతాడు. వాడు వెళ్ళటానికి కారణం నీవుకానీ, నీగాంధీ కానీ కాదు.' అని బదులుచెప్పారు.

స్వామివారివద్ద పెద్ద శ్రీచక్రముండేది. కానీ దానికి ఒకనాడైనా వారు పూజచేసేవారు కాదు. వారే దేవీస్వరూపులుకనుక వారికి బాహ్యపూజయొక్క అవసరము లేదని మనము అనుకోవాలి.

వారు సాధారణంగా పెసరపప్పుపాయసం తీసుకొనేవారు. ఆపాయసమూ కనీసము రెండుగంటలైనా పక్వం

కావాలి. శిష్యుడొకడు పాయసాన్ని తయారుచేసి తనస్నేహి తునికోసం ఒకలోటా ప్రత్యేకంగా వుంచి స్వామి ఆహారించిన పిదప నీవు పాయసం తీసుకోనేదని అతనితో చెప్పి స్వామివద్దకు మిగతాపాయసమును తెచ్చాడు. 'చేసిన పాయసాన్ని అంతా తెచ్చావా?' అని స్వామి అడిగారు. 'ఆ' అని బదులుచెప్పాడు శిష్యుడు. 'నిజంగానా?' అని మళ్ళా అడిగారు. 'ఈసందేహ మేమి? రోజూ తెచ్చే విధంగానే ఈరోజూ తెచ్చాను' అని శిష్యుడు తలాయించాడు.' స్వామి పాయసం తీసుకొన్న తర్వాత నీవు తీసుకో అని వాడితో చెప్పి, ఒకలోటా అతని కిచ్చిరాలేదా? చెప్పు' అని స్వామి నిలదీసి అడిగారు. అంత టితో శిష్యుడు నిరుత్తరు డయ్యాడు.

మరొకప్పుడు పళనిలో స్వాములవారున్నారు. క్షేత్రా టనకోసం వచ్చిన దంపతులు స్వాములవారిని దర్శించారు. వారిని చూడగానే సంతానం కోసం క్షేత్రాటనము చేస్తున్న ట్లున్నది అన్నారు. 'ఔను' అని దంపతులు బదులిచ్చారు. 'నాగప్రతిష్ఠ మొదలైన పరిహారాలుకూడ చేసినట్లున్నది' అని మరలస్వామి అన్నారు. దానికీ వారు ఔనన్నారు. అందులకు స్వామి, 'అడసరే, నీవు మొదటిభార్యను వదలిపెట్టి, ఈ రెండవ భార్యతో క్షేత్రాటన చేస్తూ పుత్రకామేష్టికర్మలు ఎన్ని చేసినా, మొదటి భార్య కడుపు రగులుతూవుంటే, ఈకర్మలు

ఎలా ఫలవంతము తౌతవి?' అని ప్రశ్నించారు. అంతటితో ఆగృహస్థునకు తన తప్పిదం తెలిసింది.

రామకృష్ణయ్యారు అనే ఆయన తిరుపతి వెంకటాచల పతి భక్తుడు. వారి ఇంట ఏడుకొండలవానికై ఒక ఉండి యుండేది. దానిలో అప్పుడప్పుడు ఆయన కుటుంబము డబ్బు వేయుట వాడుక. ఒకమారు కుళందై ఆనందస్వామి 'ఆఉండిలో వున్న ఫలాని మొత్తము నాకీ' అని అడిగారట. ఉండి తెరచి లోనఉన్న డబ్బును లెక్కింపగా స్వామిచెప్పిన మొత్తమునకు అందులోని పైకము ఒక్కరూపాయి అధికముగా ఉండెను. రామకృష్ణయ్యారు కుటుంబమువారు-'స్వామీ మీరు ఉండిలో ఉన్న డబ్బును సరిగా చెప్పలేదు కనుక మీకు ఏలాగు ఇవ్వ గలము?' అని అడిగారట. కుళందై ఆనందస్వామి అంతటితో ఆఉండిలోని డబ్బును లాగుకొని, ఒక్కరూపాయి దూరముగ విసరివేసి, 'ఈరూపాయి మీదికాదు' అని అన్నారట. ఇంతలో పక్కింటివారువచ్చి తాము కొన్నినెలలక్రితము రామకృష్ణయ్య ఉండిలో ఒకరూపాయ వేసినది గుర్తుకు తెచ్చుకొని స్వామి చెప్పినది 'సరే' అని అన్నారట. వెంకటాచలపతి ఉండిలోని డబ్బు స్వామికి సమర్పణ ఐనది.

ఒకరోజు స్వామి వీథిలో తెన్నెమీదకూర్చుని ఉండగ ఆవూరిలోనే వున్న కుప్పదిబ్బస్వామి వచ్చాడు. కుప్పదిబ్బ స్వామి ఒకసాధువు. అతనినిచూడగానే కుళందై ఆనందస్వామి

'పోరాపో త్రాగుబోతా' అని హాస్యంచేశారు. కుప్పదిబ్బ స్వామి పోతనగారు వర్ణించినట్లు-అంబుజోదర దివ్యపాదార విందచింతనామృత పానవిశేషమత్తుడు. అందులకు కుప్పదిబ్బ స్వామి 'నీ చేతిలోనుండి విభూతి తీసుకొనికానీ ఇక్కడనుంచీ కదలను' అని భీష్మించుకొని కూరుచున్నాడు. స్వామి ప్రక్క నున్న కఱ్ఱతీసుకొని కుప్పదిబ్బస్వామికి దేహశుద్ధి చేయటం ప్రారంభించారు. ఆదెబ్బలకు అంతులేదు. ఇతరులు ఓర్చుకో లేరు. కుప్పదిబ్బస్వామి దెబ్బలు తింటున్నా ఆచోటువిడిచి కదలలేదు. 'వేయి మరో రెండుదెబ్బలువేయి' అని పైగా కుప్పదిబ్బస్వామి అంటున్నాడు. కొంతసేపటికి కఱ్ఱదించి ప్రక్కనఉంచి, తనవిభూతి సంచిలోనుంచి ఒక పిడికెడు విభూతినితీసి 'ఇదో తీసికో' అని స్వామి అన్నారు. కుప్పదిబ్బస్వామి దానిని తీసుకొంటూ-'అబ్బ! ఒకమెట్టు ఎక్కినాను' అని వెడలిపోయాడు.

మరొక్కమారు ఈకుప్పదిబ్బస్వామి, కుళందై ఆనంద స్వామిని చూచి, "ఎందుకు ఈదేహాన్ని ఇట్లా పెంచుతున్నావు నీవు త్రాగే పెసలపప్పుగంజితో ఈదేహం ఇట్లా వృద్ధి కాగ లదా? ఇంత పెద్దదేహమున్నా, నీమనస్సేమో రాయి. అది శిలాసదృశం. నీవేమో ఉద్ధరిస్తావని నమ్మికొన్నవారికి పంగ నామములు పెట్టి ఒక్కరోజు సడీ చప్పుడూలేకుండా వెళ్ళి పోతావు. అని నిందాస్తుతి చేశారు. సిద్ధులు లోకంలో

కొంతకాలం సంచరించి అదృశ్యులౌతారని కుప్పదిబ్బస్వామి ఉద్దేశ మని కనిపిస్తుంది.

ఒకరోజు, స్వామి నిద్రిస్తుండగా ఒక రైతుపిల్లవచ్చినది. పగలుసుమారు 1-30 గంట. స్వామి లేచేంతవరకూ ఆ పిల్ల కాచుకొని కూచున్నది. ఇంతలో స్వామి నిద్రనుంచి లేచారు. వారితో ఈఅమ్మాయి ప్రసాదంకోసం కాచుకొని వుందని ప్రక్కన ఉన్నవారు చెప్పారు. స్వామి ఆ అమ్మాయి వంక చూడగానే, ఆ అమ్మాయి గ్రహంఉన్న వాళ్లు ఆడే విధంగా ఆడసాగింది. అందరూ వేడుకగా చూస్తున్నారు. కొంతసేపటికి స్వామి ఆ అమ్మాయిని చూచి, 'నీవెవరు?' అని ప్రశ్నించారు. ఆ అమ్మాయి మీదనున్న దెయ్యం-'నేను కరుప్పణ్. పదిసంవత్సరాలుగా ఈ అమ్మాయిని ఆవేశించి వున్నాను. నీవు ఇక్కడ వుండటం నాకు తెలియదు. నాకు ఒళ్ళు ఒకటే మండిపోతున్నది. ఉష్ణం దహిస్తున్నది. నేను వెళ్ళిపోతాను' అని అన్నది. "ఐతే వెళ్లు" అని స్వామి అన్నారు. అంతటితో ఆ అమ్మాయి స్వస్థతఐనది. ఆ అమ్మాయికి విభూతి ప్రసాదం ఇచ్చి స్వామి పంపారు.

ఒకనికి మహావాక్యోపదేశము కలుగవలెనన్న అతడెంతో పుణ్యము చేసుకొని యుండవలెను, గురువును పన్నెండు సంవత్సరములు సేవచేసిన వారికికానీ, మహావాక్యోపదేశలబ్ధి కలుగదు. ఒకరోజు స్వామి చిన్నప్పనుచూచి, వచ్చే పౌర్ణమి

నాడు నీకు మహావాక్యోపదేశము చేస్తాను,” అని సెల విచ్చారు. చెప్పినవిధముగా పౌర్ణమినాడు చిన్నప్పకు మహా వాక్యోపదేశం చేశారు. సాధారణంగా కుళంద్రై ఆనందస్వామి మాటలు చిన్నపిల్లలు మాట్లాడేవిధంగా వుండేవి. అంత స్పష్టంగా వుండేదికాదు. ఆరోజుమాత్రం ప్రణవం స్ఫుటంగా ఉచ్చరించారు. స్వామి శిష్యుడు పరశురాముడు అనే అతడు తనకు స్వామి ఉపదేశించలేదుకదా అని చింతించినాడు. స్వామి స్నానానికి లేచారు. స్నానంచేస్తూ పరశురాముని చూచి, ఏరా! ఎందుకు చింతిస్తున్నావు! ఉపదేశం నీకుచేయ లేదే అనా? ఆ ఉపదేశం నీకుకూడా, నీవు రోజుకు 108 మార్లు జపంచేస్తూ రా-జపఫలాన్ని విభూతీ అవీ ఇచ్చి వృథా చేసుకోకు--’ అని అనుగ్రహించారు.

చిదంబరక్షేత్రంనుంచీ ఒకధనికుడు సంతానములేక, స్వామి అనుగ్రహం అర్థించివచ్చాడు. దోషపరిహారానికి ఎంత ధనమైననూ ఖర్చుపెట్టడానికి తయారుగా ఉన్నానని చెప్పు కొన్నాడు. స్వామి ప్రత్యేకపూజ చేయుటకు సమ్మతించారు. కొన్ని రోజులు ఇలా గడిచినవి. చిదంబరం ధనికుడు వెళ్ళి పోవలసిన దినము సమీపిస్తున్నందున స్వామిని హెచ్చరిక చేశాడు. అందులకు స్వామి “దేనికీ మాఅమ్మ ఉత్తరువును అడిగి నీకు విషయం చెబుతాను” అని అన్నారు. మరునటి రోజు స్వామి “అమ్మ ఉత్తరువు ఇవ్వలేదు. నీవు వెళ్ళవచ్చును’

అని అన్నారు. చిదంబరం వర్తకుడు ఆశాభంగంతో వెళ్ళి నాడు. అతని ప్రారబ్ధకర్మ బలీయమైనది.

పై చెప్పబడినవన్నీ తమిళ దేశంలో స్వాములవారున్న పుడు జరిగిన సంఘటనలు. వంగ దేశములోనూ, ఉత్తరభారత దేశములోనూ త్రైలింగస్వామిగ వ్యవహరించినపుడు జరిగిన కొన్ని సంభవములు క్రింద వ్రాయబడుచున్నవి.

స్వామి నర్మదాతీరంలో మార్కండేయ ఆశ్రమములో కొన్నిరోజులు నివసించారు. ఆ ఆశ్రమంలో 'తాకీబాబా' అనే మహానీయు డుండేవాడు. ఒకరోజు పౌర్ణమి రాత్రి తాకీబాబా నర్మదాతీరంలో ధ్యానమగ్నులై వున్నారు. అర్ధరాత్రి కళ్ళు తెరచి చూచారు. ఎదురుగా ప్రవహిస్తున్న నర్మదలో నీళ్ళకు బదులు పాలున్నవి. త్రైలింగస్వామి ఆపాలను తమదోసిళ్ళతో త్రాగుతున్నారు. తాకిబాబాకూడా లేచి పరీక్షిద్దామని నర్మదలో దిగి తమదోసిలితో పాలను తీసుకోనబోగా, పాలకు బదులు యథాప్రకారం నీళ్లే వచ్చినవి. అంతటితో తాకీబాబా త్రైలింగస్వామి మహత్త్వాన్ని గుర్తించారు.

ఒకరోజు స్వాములవారు తమవాడుక ప్రకారం గంగా తరంగములలో తేలుతున్నారు. అపుడు ఉజ్జయినీ మహారాజు తమవాహ్యాళికి వెళ్లేపడవలో పోతున్నారు. మణికర్ణికా ఘట్ట మువద్ద స్వామి తేలుతుండటం చూచి, ఆశ్చర్యపడి తమ సేవ కులను వీరెవ్వరు అని అడిగారు. వారు ఆయనొక మహానీయు

డని బదులు చెప్పారు. రాజు వారివద్దకు పడవపోనిచ్చి స్వామిని పడవలోనికి రమ్మన్నారు. స్వామి లోనికి వచ్చారు. రాజును పరిశీలనగా చూచారు. రాజువద్ద బ్రిటిషు ప్రభుత్వమువారు ఇచ్చిన ఒక పెద్దకరవాల ముండినది. స్వాములవారు దానిని చూడవలెనని కోరి తీసుకున్నారు: రాజు కరవాలమును ఇచ్చాడు. స్వాములవారు దానిని చూస్తూచూస్తూ వున్నట్టుండి దానిని విసరి గంగలో పారవేశారు. రాజుగారి కోపము మితి మీరిపోయినది. ఆయన నేత్రములు క్రోధారుణితము లైనవి. ఆకత్తిపై ఆయనకు అంతప్రేమ. స్వాములవారు రాజును చూచి చిరునవ్వునవ్వి గంగలోనికురికి మళ్ళా పడవలోని కొచ్చారు. వారి చేతులలో ఇపుడు రెండు కరవాలములున్నవి. రెండిటికీ వెంట్రుకవాసి వ్యత్యాసములేదు. "ఈరెండుకత్తులలో నీకత్తి ఏదో తీసుకొని, రెండవదానిని నాకివ్వమని" స్వామి అన్నారు. రాజుకు ఎంతపరీక్షించినా తనకత్తి ఏదో తెలియ లేక పోయినది.

నీకత్తిని నీవేగుర్తించకపోతే ఆకత్తి నీది ఎలా ఔతుంది? అని ప్రశ్నించి రెంటిలో ఒకకత్తిని రాజుకు ఇచ్చి, రెండవ దానిని గంగలో పారవేశారు. రాజు స్వామిని క్షమాభిక్ష వేడుకొన్నాడు.

ఉమాచరణుడు అనే ఆయన స్వామిశిష్యుడు. ఒకరోజు ఈయన ఆశ్రమానికి వచ్చాడు. ఆశ్రమంలో శాస్త్రవిచారణ

జరుగుతున్నది. ఇంతలో ఆకాశం మేఘావృతమైనది. తుఫాను గాలి వీచడానికి ప్రారంభించినది. ఆశ్రమంలోని సన్యాసులు శాస్త్రవిచారణ కట్టిపెట్టి తమతమగదులకు వెళ్ళిపోయారు. ఉమాచరణుడుకూడ వెళ్ళవలెనని ప్రయత్నపడగా స్వాముల వారు అతనిని కూచోమన్నారు. మారుమాటాడక ఉమాచరణుడు కూచున్నాడు. కొంతసేపటికి ప్రబలవర్షం ప్రారంభమైనది. వానప్రారంభంకాగానే స్వాములవారు ఉమాచరణుని చూచి 'ఇక నీవు వెళ్లవచ్చును' అని అన్నారు. 'ఈవానలో ఎలా వెళ్ళటమా?' అని ఉమాచరణుడు తటపటాయించాడు. దానిని చూచి స్వామి 'ఇంకా వెళ్లలేదా' అని మళ్ళా అడిగారు. అంతటితో ఉమాచరణుడు ఆశ్రమం వదలి రోడ్డుపైకి వచ్చాడు. గాఢాంధకారం. తనముందు ఎవరో వ్యక్తి లాంతరుతో వెడుతున్నాడు. ఉమాచరణుడు ఆవ్యక్తిని అనుగమించాడు. చిత్రంగా అతనిమీద ఒక్కచుక్కైనా వర్షం పడలేదు. కానీ చుట్టూ ద్రోణవర్షం కురుస్తున్నది. ఇంతలో ఉమాచరణుని ఇల్లువచ్చింది. ముందున్నవ్యక్తి, లాంతరు రెండూ అదృశ్యమైంది. ఇది అంతా తనగురుప్రభావమే అని ఉమాచరణుడు అనుకొన్నాడు.

మరొకరోజు ఉమాచరణుడు ఆశ్రమానికి రాగా స్వామి అతనినిచూచి, ఆలయానికి వెళ్ళి అమ్మవారిని దర్శించి, రమ్మన్నారు. ఆలయానికి వెళ్ళిచూస్తే, గర్భగుడిలో అమ్మవారున్న

చోటు ఖాళీగావుంది. అమ్మవారి మూర్తి లేదు. ఉమాచర
ణుడు ఆశ్చర్యపడి ఈవిషయాన్ని స్వామితో విన్నవించాడు.
"అలాగా ఐతే అమ్మవారు నిన్నుచూడటానికి ఇక్కడికే
వస్తుందిలే" అని తన మధురకంఠంతో రెండుమార్లు అమ్మా
అమ్మా అని పిలిచారు. ఇంతలో వారున్న ప్రదేశం దివ్యజ్యో
తితో వెలిగిపోయింది. నవవర్షుక, బాలిక, త్రినయిని వారి
ముందు గోచరించింది. ఉమాచరణుడు ఆనందంలో మునిగి
పోయినాడు. స్వామి ఆజ్ఞ మేరకు అమ్మవారికి ప్రణమిల్లి లేవ
గానే ఆమె అదృశ్యమైనది. స్వామి "ఇపుడు గుడిలో పోయి
చూడు." అని ఆజ్ఞాపించారు. గుడిలో యథాప్రకారం దేవీ
విగ్రహం ఉన్నది. ఉమాచరణుడు ఆ శిలాచైతన్యమూర్తికి
నమస్కరించి వెనుతిరిగినాడు.

ఒకరోజు స్వాములవారు కాళికాలయంలో వున్నారు.
విజయకృష్ణ అనే ఆయన ఆమార్గంవెంట వెళ్ళుతున్నాడు.
స్వాములవారు విగ్రహంముందు మూత్రించి, మూత్రమును
చేతులలో తీసుకొని అమ్మవారిపై చిలకరిస్తున్నారు. విజయ
కృష్ణకు ఇది గొప్ప అపచారంగా తోచి, మీరుచేస్తున్న దేమి
పని అని గద్దించి అడిగారు. స్వామి నవ్వుతూ "నేను అమ్మకు
గంగాభిషేకము చేస్తున్నాను." అని సెలవిచ్చారు. విజయ
కృష్ణ ఈవిషయం భక్తసోదరులతో చెప్పగా వారు—"ఆయన
కాశీవిశ్వేశ్వరుడు. అందుచేత వారిమూత్రం గంగాజలమే
స దేహంలేదు." అని అన్నారట.

సిద్ధులు ఈశ్వరుని ప్రమథగణంలాంటి వారు. వారి చర్యలు దురూహ్యాములు. వారిచరిత అతిగహనము. వారికి వారేసాటి.

కుళందై ఆనందస్వామి లేక త్రైలింగస్వామి జీవిత చరిత్ర మనకు పరమవస్తువు ఒక్కటి వున్నదని సూచిస్తూ బృహదారణ్యక ప్రోక్తమైన-"ఆత్మావా అరే ద్రష్టవ్య శ్రోతవ్యో మంతవ్యో నిధి ధ్యాసితవ్యః విజ్ఞానే నేదిగ్ం సర్వం విదితం"- అనే ఉపనిషత్సూక్తిని గుర్తుకు తెస్తున్నది.

శ్లో॥ యత్కీర్తనం యత్స్మరణం యదీక్షణం
యద్వందనం యచ్ఛ్రవణం యదర్హణం,
లోకస్య సద్యో విధునోతి కల్మషం
తస్మై సుభద్ర శ్రవసే నమోనమః.

శ్లో॥ తపస్వినో దానపరా యశస్వినో
మనస్వినో మంత్రవిద స్సుమంగళాః,
క్షేమం న విందంతి వినా యదర్పణం
తస్మై సుభద్ర శ్రవసే నమోనమః.

ఓం తత్సత్

# మండలి ప్రచురణలు

హరినామ మహిమశతకము 0-30
భగవన్నామ సంకీర్తన 4-00
హరినామమహిమ(పోతన) 0-50
శివపద మణిమాల 0-30
కనక దుర్గానందలహరి 0-25
గణేశసహస్రనామస్తోత్రము 0-50
శివతాండవము 1-00
హనుమాన్ చాలీసా (సచిత్ర
ము) 0-30
ఆమ్నాయమందారః 15-00
చండీసప్తశతి 6-00
హోమశతచండీయాగః 5-00
బాలరామాయణము
(60 చిత్రములు) 1-00
హరేరామ భజనమాల 0-25
శ్రీరామ జయరామ జయ
జయరామ భజనమాల 0-15
భగవత్ప్రాప్తి-ఉపాయములు 0-25
అష్టాదశ శ్లోకగీత 0-25
అద్భుతరామాయణము 8-00
శ్రీత్రిపురసుందరీపూజాకల్పః 7-00
శ్రీవనదుర్గా మహావిద్యా
పంచదశి 5-00
(ప్రత్యంగిరాఋక్పారాయణ
క్రమసహితా)
గీతాప్రతిభ 1-25
కుండలినీసాధనానుభవము 4-00
గీతాకదంబము ౧వ దళము 1-75
,, ౨వ దళము 1-75

పరమ సాధన 1-25
పద్మపురాణము భూమి
ఖండము 4-00
అద్వైతమకరందము 1-75
అరవిందుని పురుషోత్తమ
తత్త్వము 2-50
తులసీమహిమామృతము 3-00
భక్తిరసాయనము 4-00
భారతీయ తత్త్వశాస్త్రము
1 భా. 5-00
,, ,, 2 భా 5-00
భారతీయ ధర్శనము 2-00
సిద్ధాంతకల్పవల్లి 1-00
నేనెవరు 1-00
ఆత్మతత్త్వము 2-00
శ్రీరామపూజావిధానము 0-30
తులసీ గోపూజ 0-30
అవధూతసూక్తులు 1-00
వేలుపువంద 0-50
నేపాలయాత్ర(చిత్రములతో 1-50
వినయపత్రిక తులసీదాసు
50 చిత్రములు) 6-00
నామవందనము 1-50
గాయత్రీకల్పము 4-00
కైవల్యనవనీతము 2-50
విష్ణుసహస్రనామస్తోత్రము
శంకరభాష్యానుసారపద్యా
నువాదము 4-00
శ్రీజానకీ త్రిశతి 3-00

| | | | |
|---|---|---|---|
| జగన్నామ మహిమ | 1-00 | శ్రీత్రిపురారహస్యము | 4-00 |
| ఈశావాస్యోపనిషత్తు (శాక్త ద్వైతదర్శన వాఖ్యానము) | 4-00 | శ్రీకాళహస్తీశ్వరశతకము | 0-75 |
| శ్రీసనత్సుజాతీయము(శంకరాచార్యాది శ్రీషడ్భాష్య ఆంధ్రానువాదము | 15.00 | నవవిధ భక్తులు | 3.50 |
| | | అవధూతవాణి | 1-50 |

## శ్రీ ఈశ్వర సత్యనారాయణగారి గ్రంథములు

| | | | |
|---|---|---|---|
| శ్రీసప్తశత్యుపాసనాక్రమము | 8-00 | దేవీసూక్త పరమార్థము | 1-50 |
| సిద్ధాంత శిఖామణి (శైవ గ్రంధరాజము | 8-00 | శ్రీరాజవిద్యాగీత (భగవద్గీత నవమాధ్యాయము | 4-00 |
| దేవపూజారహస్యము | 4-00 | శ్రీలక్ష్మీహృదయము | 6-00 |
| అమ్మతో ముచ్చటలు 1, 2 భా. | 3-00 | భీమేశ్వరనుతి | 0-50 |
| సౌరమంత్ర పాఠము (సస్వరము ఆంధ్రపద్య, ఆంగ్ల గద్యానువాదము | 1-00 | శాస్త్రసాధనము | 0-75 |
| సాధన సామగ్రి (దుర్గాసప్తశతి ఆధ్యాత్మికనివృతిసారము) 1, 2 భా 1కి 4-00 3వ భా 5-0 | | బాలాంబికా శతకము | 0- 5 |
| 4 వ భాగము | 6-00 | శ్రీసూక్త రహస్యార్థము | 3-00 |
| శివానందన నాటకము | 3-00 | శ్రీసౌభాగ్యలక్ష్మీహృదయము | 5-0 |
| | | శ్రీకాళిదాస దేవీపంచస్తవి | 5-00 |
| | | కలిసంతరణమంత్రవివరణం | 4-0 |
| | | శ్రీదుర్గాస్తుతి | 3-00 |
| | | శక్తిపాతము | 4-00 |
| | | శివరాత్రి పరతత్త్వము | 1-00 |
| | | సోఽహంసమాధి | 1-00 |

## శంకర గ్రంథ రత్నావళి

ఈ శంకరవాఙ్మయము నంతను "శంకర గ్రంథ రత్నావళి" అను పేర ప్రత్యేక శాఖగా మా మండలిలో సుమారు 58 సంపుటములుగ తెనుగున అనువదించి మూలముతోఁ బ్రకటింపవలెనని సంకల్పించితిమి. ఇప్పటికి ఏడు సంపుటములను బ్రకటించితిమి. 2, 4, 6, 7 సం॥ ములు 1కి 8-00, 5వ సం॥ 10-00 1, 3 అచ్చులో నున్నవి. 8వ సం॥ తయారగుచున్నది

---

సాధన గ్రంథ మండలి, తెనాలి

# జగద్గురు బోధలు

## శ్రీ కంచికామకోటి పీఠాధిపతుల ఉపన్యాసాలు

అనువాదకులు : "విశాఖ"

పరిశోధకులు ; శతావధానులు, శ్రీ వేలూరి శివరామశాస్త్రి

తొమ్మిది సంపుటాలు 1, 2, 3, 4, 8, 9 సం. ములు 1కి 6-00. 5, 6 సం. ములు 1కి 3-00 లు 7 వ సం. ము 4-00 మొత్తం రు. 46-00 లు ముందుగా పంపిన పోష్టుచార్జిలు మేముభరించి, రిజిష్టరుపోష్టులో పంపెదము. కొలది ప్రతులు మాత్రమే గలవు - పదియవ సంపుటము తయారగుచున్నది.

"ఈ సంపుటాలు ఆంధ్రసరస్వతికొక అమూల్యాభరణాలని చెప్పాలి. నేటి నాస్తికులకు నిత్యపారాయణం చేయతగ్గ గ్రంథాలు.... తియ్యటి తేట తెలుగుభాష. మూడు క్లాసులు చదివిన వాళ్ళైనా ముచ్చటగా చదువుకోతగిన గ్రంథాలు. తెలిసికొనదగిన అంశాలు. జీవిత పరమార్థాన్ని అర్థించే ప్రతిగృహస్థు హస్తభూషణం చేసికోదగిన గ్రంథాలివి. వేదధర్మ స్వరూపం యిందులో వజ్రకాంతులతో నయనపర్వం చేస్తుంది."

—ఆంధ్రప్రభ.

సాధన గ్రంథమండలి, తెనాలి.